శ్రీరస్తు

# శ్రీ రామాయణ తరంగిణి

ప్రథమ భాగము

## వాల్మీకి తీర్థము



రచయిత :

పోలూరి హనుమజ్జానకీరామశర్మ B. A. (Hons)

నెల్లూరు
1989



మూల్యము : రు. 2

ప్రథమ ప్రకాశనము : జనవరి 1983 - ప్రతులు; 1000
ద్వితీయ ప్రకాశనము : జనవరి 1989 - ప్రతులు; 500

ముద్రణ పర్యవేక్షకుడు:
చి॥ మాచవోలు శివరామప్రసాద్ M.A.,

ప్రకాశకుడు:
పోలూరి హనుమజ్జానకీ రామశర్మ B. A., (Hons)
16/1216, పొగతోట, నెల్లూరు.

ప్రతులు దొరకుచోట్లు:

(1) శ్రీ రామకృష్ణ సేవాసమితి (రిజిష్టర్డు)
కాసుఖేలవారి అగ్రహారము
నెల్లూరు-5 24 001

(2) శ్రీ వివేకానంద విద్యాలయము
4/120, ముకుందపురము
నవాబుపేట, నెల్లూరు-524 002

(3) శ్రీ బ్రహ్మానందతీర్థస్వామి
శ్రీ సత్యానందాశ్రమము
ఇనమడుగు- 524 137
కోవూరు తాలూకా, నెల్లూరుజిల్లా.

కమలాంబిక ప్రెస్ - నెల్లూరు.

# ఆశీస్సులు

## శ్రీ సత్యానందమహర్షులవారు

శ్రీ సత్యానందాశ్రమము, ఇనమడుగు, నెల్లూరుజిల్లా.

శ్రీరామచంద్రుడు మర్యాదాపురుషోత్తముఁడు. సకల కల్యాణ గుణగరిష్ఠుఁడు. ధర్మాచరణమున ఆస్తికులెల్లరికి మార్గదర్శకుడు. కనుకనే విజ్ఞులు "రామునివలె జీవితమును ధర్మమార్గమున గడుపుడు, రావణునివలె అధర్మమార్గమున ప్రవర్తింపకుడు" అని ప్రజలకు బోధించుచుందురు. శ్రీరామచంద్రుఁడు రాజుగ ప్రజలను కన్నబిడ్డలవలె పాలించియు, కుమారుడుగ తండ్రియాజ్ఞ ఎట్టిదైనను తు. చ. తప్పక శిరసావహించియు, సోదరులయెడ ప్రీతియు, తల్లులయెడల భక్తియు, భార్యయెడల అనురక్తియు గురునియెడ పరాభక్తియు సేవకులయెడ సౌహార్దతయు చూపి సర్వులకు ఆదర్శమహాపురుషుడై వరలెను.

మనపుణ్యభారతదేశమందే గాక ప్రపంచమం దంతటను శ్రీరామచంద్రునియొక్క జీవితమును ఆదర్శముగ నిర్ణయించుకొని అటుల వర్తించుటకు ప్రయత్నించుచున్నారు. శ్రీరామ ప్రభుని పవిత్ర చరిత్రమును శ్రీ నారదమహర్షి బోధించిన విధముగ శ్రీ వాల్మీకిమహర్షి ఆదికావ్యమగు శ్రీమద్రామాయణముగ రచించెను. ఇది సకలధర్మసారమై వేదతుల్యమై వరలుచున్నది. విభీషణుఁడు శ్రీరామచంద్రుని శరణుపొందిన సందర్భమున సుగ్రీవుడు రావణసోదరుడైన విభీషణునకు అభయ మివ్వరాదని పట్టు పట్టినప్పుడు శ్రీరామభద్రుడు తన వ్రతము నిట్లు తెల్పెను.

"సకృ దేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ.

ఒక్కసారి నేను నీవాడను, నన్ను రక్షింపుము అని ప్రార్థించుచు శరణుపొందిన వారిని సమస్తభూతములనుండి రక్షించెదను. ఇది నాదృఢవ్రతము అని చాటెను.

శత్రువుచేతకూడ కొనియాడబడు సకల సద్గుణములు గలవాడే మహాపురుషుడు. రాక్షస కృత్యములచేత శత్రువై శ్రీరామచంద్రునిచే వాయవ్యాస్త్రముచే దూరముగ పడవేయబడిన మారీచుడు "రామో విగ్రహవాన్ ధర్మః" శ్రీరాముడు ధర్మస్వరూపుడని రావణునితో నుడివెను. అట్టి శ్రీరామచరితములో గల దివ్యాంశములను సర్వులకు తెలియునట్లు బ్రహ్మశ్రీ పోలూరి హనుమజ్జానకీరామశర్మగారు తీర్థములుగ విభజించి ఏబదిఒక్క ఉపన్యాసముల నొసంగిరి. అవి శ్రీరామాయణతరంగిణి అనుపేర ప్రచురింపబడుట ఆనందదాయకమైన విషయము. శ్రీ జానకీరామ శర్మగారు శ్రీ సత్యానందాశ్రమ వార్షికోత్సవములలో 1964 సం॥ నుండి ఈనాటి వరకు పాల్గొనుచు శ్రీమద్రామాయణమునందలి వివిధ ఘట్టముల గూర్చియే ఉపన్యసించుచున్నారు. వీరికి శ్రీమద్రామాయణము అభిమాన గ్రంథము. శ్రీరామచంద్రుని అనుగ్రహమువలనను మా అనంతాశీర్వాదములవలనను శ్రీరామాయణ తరంగిణి ఆస్తిక మహాశయులకు ధర్మములను తెల్పి వారలను అనుష్ఠానపరులుగా ఒనర్చుగాక!

o—o

శ్రీరస్తు

# తొలిపలుకులు

విభవ సంవత్సర వైశాఖమున ( 1988 మే నెల ) సప్తమ భాగము వెలువడుటతో ఈశ్వరానుగ్రహమున శ్రీరామాయణ తరంగిణి ముద్రణము పూర్తియయ్యెను. అప్పటికి ఈ ప్రథమ భాగము ప్రతులు మిగుల కుండెను. తక్కిన భాగముల ప్రతులు కొలఁదిగా నుండెను. అందువలన ఈ భాగమును మరల ముద్రింప వలసి వచ్చెను. ఈ సందర్భమున ఈగ్రంథరచనకు అనుషంగికము లైన కొన్ని సంఘటనములను, ఏడవ భాగముయొక్క తొలిపలుకు లలో పేర్కొన్నవానినే, ఇందుకూడ నివేదించుచున్నాను.

నాకు శ్రీమద్వాల్మీకిరామాయణముతో వ్యాసంగము ఈగ్రంథ రచనకు పూర్వమే అనేక విధముల ఏర్పడెను. 1951 మార్చి నెలలో మా అక్కగారు కీ॥ శే॥ శ్రీమతి చోరగుడి హనుమత్ శేషమ్మగారు పి. ఓ. ఎల్ (P. O. L ) పరీక్ష వ్రాసిన తరువాత ఎమ్. ఓ. ఎల్. (M. O. L.) పట్టముకొఱకు, "వాల్మీకి రామాయణ నాటకములు" అనువిషయముపై పరిశోధనవ్యాసమును (Thesis) వ్రాయఁబూనుకొనెను. ఆమెకు సాయముగా నేనుకూడ సంస్కృత ములోని రామకథానాటకములను చదువుచు వాల్మీకిరచనముతో పోల్చి విమర్శించుచుంటిని. ఆ పరిశీలనము 1954 జులై ప్రాంత మున పూర్తియై ఆమె 1955 జనవరిలో ఎమ్.ఓ.యల్. (M.O.L. పట్టమును పొందెను.

1954 అక్టోబరులో జయ సంవత్సరశరన్నవరాత్రులలో మేమిరువురము కందుకూరు తాలూకాలోని వెన్నూరునకు పోయి

తిమి. అక్కడ మా తాతగారి యింటిలో 4-10-1954 తేది ఉద యము సుమారు 10 గంటలకు ఏకాంతమున నేను విశ్రమించి యుండఁగా అనుకొనకుండ వ్యాసభగవానుని గూర్చి స్తుతి పద్య ములు స్ఫురింపఁ జొచ్చెను. ఆ రచనము క్రమముగా నలచరిత్ర ముగా రూపొంది విలంబి సంవత్సరాశ్వయుజ బహుళ ప్రతి పత్సోమవాసరమున, 13-10-1958 తేది పూర్తియయ్యెను.

తరువాత 15-3-1959 తేది ఫాల్గున కృష్ణదశమీ స్థిరవాసర మున సాయంకాలము మిత్రుఁడు కీ॥ శే॥ శ్రీ దుర్భా రామమూర్తి గారికొఱకు శ్రీ వేంకటగిరిరాజ కళాశాలకు ఎదురుగానున్న వినోద భవనమునకు (Macleans Club & Reading Room) పోయితిని. ఆయన పైయంతస్తునందు క్రీడానిమగ్నుఁడై యుండెను. నేను పైకి పోయి ప్రక్కన వరండాలో (Balcony) కూర్చుండి ఆకసమువంక చూచుచుంటిని. అప్పుడు అయిదున్నర గంటల ప్రాంతమున వాల్మీకికి సంబంధించిన పద్యములు స్ఫురింపఁజొచ్చెను. కలి కల్మషహరమైన నలచరిత్రము తరువాత పరమేశ్వరుఁడు నాచేత పుణ్యప్రదమైన రామకథను పలికించు చున్నాఁడేమో యను తలంపు కలిగెను. ఆ తలంపుతో మరల రామాయణమును పఠింపఁ జొచ్చితిని.

అప్పటికే అనేకపర్యాయములు వాల్మీకి రామాయణము లోని వివిధ ఘట్టములను రామకథానాటకములలోని సన్నివేశము లతో పోల్చి పరిశీలించియుండుటచే కొన్ని యభిప్రాయములు నాకు ఏర్పడియుండెను. వాల్మీకి రచనమునకు భిన్నముగా నాటక కర్తలైన మహాకవులు గావించిన కల్పనము లన్నియు రసాభాసము లయ్యేనేకాని రసవంతములు కాలేదని, సన్నివేశ సంఘటనమున సంవాద శైలియందు అంతర్బాహ్యసంఘర్షణచిత్రణమున

(Depiction of internal and external struggle) ఏ నాటక కర్తయు వాల్మీకిమహర్షితో సమత్వమును పొందలేకపోయెనని, రూఢముగ గ్రహించి యుంటిని. కావున రామకథను తెలుఁగునకు తెచ్చునప్పుడు రసపోషణముకొఱకు ఎట్టి కల్పనలు చేయనక్కఱ లేదని, నాటకకావ్యాదులలోని యే యంశములను చొప్పింపఁ బనిలేదని నిశ్చయించుకొంటిని. వాల్మీకిరచనము సర్వాంగసుందర మైన చిత్రము. దానియందు కొన్నిరేఖలు చేర్చినను, లేదా ఉన్న వానిని మార్చినను దాని సౌందర్యసమగ్రతకు భంగమే కలుగు నని తోఁచెను. అందువలన వాల్మీకిహృదయమును మాత్రమే గ్రహించి దానిని సాధ్యమైనంతవఱకు తేట తెలుగుఁలో తెలుఁగు వారికి అందింప ప్రయత్నించినచో రచనము కృతార్థ మగునని నిశ్చయించితిని.

ఈ విషయమున కవిత్రయము పోతన్నగారును అవలం బించిన విధానము విశిష్టముగా నున్నది. వారు మూలములోని కొన్ని భాగములను సంగ్రహించినను కొన్నిచోట్ల వర్ణనములను పెంచినను, మూలమునకు భిన్నములైన కల్పనలను, పుక్కిటి పురాణములను కావ్యనాటకాదులలోని యంశములను, తమయను వాదములందు గ్రహింపలేదు. కాళిదాసుని శాకుంతలము ప్రసి ద్ధమై ఎంత యాకర్షకముగా నున్నను, నన్నయభట్టారకుఁడు శకుంతలోపాఖ్యానమున ఆ నాటకములోని ఒక్కకల్పనమును గాని కనీసము ఒక్క శ్లోకమునుకూడ అనువదింపలేదు. అయన వ్యాసునిమూల మెట్లున్నచో అట్లే రచించెను. తెలుఁగున మహా భారత భాగవతములకు ఏర్పడిన ప్రామాణికత్వమునకు గౌరవ మునకు ఇది యొక ముఖ్యకారణము. ఈ దృష్టిలో వాల్మీకి రామా యణమును, మరల నిశితముగ పరిశీలించుచు అయా ఘట్టము

లను యథాశక్తి భావించుచు దానిని చంపూ కావ్యముగా రచింపఁ జొచ్చితిని. రచన నెమ్మదిగా జరుగుచుండెను. అప్పటి నుండి రామాయణముపై ప్రసంగింపవలసి వచ్చినప్పుడెల్ల కేవలము వాల్మీకి రచనముపైననే ఆధారపడి మాటాడుచుంటిని.

ఇట్లుండఁగా 1974 జులైలో అనుకొందును, శ్రీరామకృష్ణ సేవాసమాజయాజమాన్యమున కానుఖేలవారి యగ్రహారమున (నెల్లూరు) శ్రీ సదాశివ వేదాంతమందిరమునందు ఒక సమావేశము జరిగెను. అందు రామాయణములోని యొకసన్నివేశమును ప్రస్తావించితిని అప్పుడు ప్రియమిత్రుఁడు చి॥ బొమ్మిశెట్టి ఎల్లమందయ్య బి. ఏ "ఈ సన్నివేశము తులసీదాసరామాయణమున నిట్లు లేదే'' అనెను.

నే నిట్లు సమాధానము చెప్పితిని. ''ఆ మాట నిజమే తులసీదాసు వాల్మీకిరామాయణమును అనువదించుచున్నా నని చెప్పలేదు. ఆయన గ్రంథారంభముననే అనేకగ్రంథములలోని రామకథావిశేషములను గ్రహించుచున్నా నని, తన రచనావిధానమును ఇట్లు స్పష్టముగా చెప్పెను. 'రామాయణమునందు చెప్పఁబడినది' కొన్నియెడల ఇతర గ్రంథములలో నానాపురాణనిగమాగమ సమ్మతముగా నున్నది యగు రఘునాథగాథను తులసీదాసు తనయంతరంగ సుఖముకొఱకు అతి మంజులమైన భాషానిబన్ధముగా రచించుచున్నాఁడు"

శ్లో॥ నానాపురాణనిగమాగమసమ్మతం యత్
రామాయణే నిగదితం క్వచి దన్యతోఽపి।
స్వాన్తస్సుఖాయ తులసీ రఘునాథగాథా
భాషానిబన్ధ మతిమంజుల మాతనోతి॥

ఈ విషయమున తమిళములో కంబడు, తెలుగున భాస్క రుడు గోనబుద్ధారెడ్డి మొదలగువారిదృష్టి కూడ ఇట్టిదే. వారు వాల్మీకి యభిప్రాయమును మాత్రమే చెప్పవలయు నని పూను కొనలేదు. అందువలన వాల్మీకి రచనమునకు భిన్నములైన సన్ని వేశములు కల్పనములు అనేకములు ఆ గ్రంథములందు కలవు. కావున వానినిబట్టి వాల్మీకియభిప్రాయమును గ్రహించుటకు వీలు లేదు''.

అప్పుడు చి॥ ఎల్లమందయ్య "అట్లయినచో మాకు వాల్మీకి యభిప్రాయము ఎట్లు తెలియును"? అని యడిగెను. "మీరు సమావేశములు ఏర్పాటుచేసినచో నాకు తెలిసినంతవఱకు వాల్మీకి హృదయమును అనుసరించి రామాయణకథను ప్రసంగపరం పరలో వివరింతును" అని చెప్పితిని. తక్కిన సమాజ సభ్యులును ఆ విషయమున కుతూహలము నొందిరి. తరువాత ప్రసంగపరం పర నేర్పాటుచేయు కార్యక్రమ భారమును ఇతర సభ్యుల సహ కారముతో సమాజకార్యదర్శి ప్రియశిష్యుఁడు చి॥ శివరాజు వేంకట నరసింహారావు B.A.B.T. వహింపఁగా కీ. శే. పూజ్యులు డాక్టర్ శ్రీ మల్లవరపు శ్రీనివాసరావుగారు అమోఘమైన ముహూర్తమును నిశ్చయించిరి. ఆ ముహూర్తమున 26–10–1974 నుండి 14-12-75 వఱకు ఆదివారములందు సాయంసమయానంతరము ఏఁబదియొక్క ప్రసంగములను గావించితిని.

1982 జులై ప్రాంతమున శ్రీ శ్రీ శ్రీ సత్యానందమహర్షుల వారి ప్రియాంతేవాసులు శ్రీ శ్రీ శ్రీ బ్రహ్మానందతీర్థస్వామివారు ఆ ప్రసంగములను గ్రంథరూపమున ప్రకటించుట అవశ్యకమని చి॥ ఎల్లమందయ్యను ప్రోత్సహించిరి. అతఁడు ముద్రణ కార్య భారమును వహించెను.

ఈ ప్రథమభాగమున సాహిత్యభూషణ, శ్రీ నవులూరి మాలెకొండయ్య పంతులుగారు సుమారు నూఱు పుటలు సాధు ప్రతిని తయారుచేసిరి. చి॥ చింతలపాటి చంద్రశేఖరం, చి॥ సాంప్రతి గోపన్న, చి॥ విరజానంద సాఫుప్రతని తయారుచేయుటలో కొంత సహకరించిరి. ఇది 1988 జనవరిలో ప్రకాశనము నొందెను.

మూలమునందు ఇప్పుడు మనకు నచ్చనివి నమ్మటకు శక్యము కానివి యనేక విషయములు కలవు. వానిని ఉన్నవి యున్నట్లే చెప్పితిని. వానిని సాధ్యమైనంతవఱకు సహేతుకముగా వివరించుటకు యత్నించితిని. ఇందు అనేక సందర్భములలో మూలములోని శ్లోకములను మాత్రము ప్రధానముగా ఉదాహరించి వాల్మీకి మహర్షి యభిప్రాయమును వివరించుటకు ప్రయత్నించితిని. ఈ ప్రయత్నము సమగ్రము కాదు. సహృదయులు పెద్దలవలన ఇంకను పెక్కు విశేషములను గ్రహింపఁగలరు. ఈ వివరణములందు అధ్యాత్మరామాయణాదులయందలి విషయములను ప్రస్తావింప లేదు. అట్లే వాల్మీకి రచనమునుండి పాఠకుల దృష్టి చెదరకుండ నుండవలయు నను తలంపుతో భాస్కర రామాయణము రంగనాథరామాయణము మొదలగువానినుండి తెలుఁగు పద్యములను కూడ పొందుపఱచలేదు. ఈ కారణము చేతనే శ్రీ శ్రీ శ్రీ బ్రహ్మానందతీర్థస్వామివారు నేను రచించుచున్న చంపూ రామాయణములోని కొన్ని ఘట్టములను విన్న తరువాత, "మీ చంపూకావ్యములోని పద్యములను ఈగ్రంథమునందు అక్కడక్కడ సందర్భోచితముగ పొందుపఱచిన బాగుండునేమో" అని సూచించినను నాపద్యములను ఈ గ్రంథమున ప్రవేశపెట్టలేదు.

ఈగ్రంథమున దొరలిన భ్రమ ప్రమాదములను పెద్దలు తెలిపినచో కృతజ్ఞతతో సవరించుకొందును.

మొదట ముద్రణ వ్యయమును కీ॥ శే॥ బొమ్మిశెట్టి రామనాధం శ్రేష్ఠిగారి పుత్రులు చి॥ ఎల్లమందయ్య బి. ఏ., ఇతని తమ్ముఁడు చి॥ బొమ్మిశెట్టి వీరరాఘవులును కొంత వహించిరి. ప్రియశిష్యులు శ్రీ దొమ్మరాజు నరసింహరాజుగారి ప్రోత్సాహమున తెలుగుగంగ డైరెక్టరు శ్రీ. కే. రామరాజుగారు కొంత ధనమునొసంగిరి; శ్రీ వేముల సత్యనారాయణగారు B.A.C.A.I.I. (Retired Staff Officer, State Bank of India) శ్రీ గోపరాజు పూర్ణచంద్రరావుగారు ( Professor & Head of the Dept. of Civil Engineering B. I. I. T, Ranchi ) కూడ ధన సాహాయ్యమును గావించిరి.

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారు మూఁడవ భాగమునకు రు. 7010/-లు, నాల్గవ భాగమునకు రు. 7500/- లు, ఏడవ భాగమునకు రు. 7300-00 లు ధనసహాయ్యమును గావించిరి. అయిదవభాగమునకు ఆర్థికసాహాయ్యము తప్పక లభించునని ఆప్తులు చెప్పఁగా సాహాయ్యము లభించినట్లే ముందుగా గ్రంథమున ప్రకటించితిని; కారణాంతరములచే లభింప లేదు.

చి॥ రామరాజు చెన్నకేశవరావు బి. ఏ., చి॥ రావినూతల శ్రీరాములు B.A.LL.B. శ్రీ శ్రీ శ్రీ రామానంద భారతస్వామివారును ( బెజవాడ ) మొదలుగా అనేకులు ఈ గ్రంథవిక్రయ ప్రచారములకు కృషి చేయుచున్నారు.

చి॥ మామిడిపూడి పట్టాభిరామన్, M.Sc., చిత్రించియిచ్చిన గ్రంథకర్తపేరు నాలుగు భాగములలో ముద్రింపఁబడినది. ఐదవ భాగములో 137 వ పుటలో ముద్రింపఁబడిన పంచవటీ మతంగవనాది సన్నివేశమును చి॥ బి. రవీంద్ర M.A., చిత్రించి యిచ్చెను.

శ్రీరాజి (నెల్లూరు) చిత్రించి యిచ్చిన యట్టమీఁదిబొమ్మ గ్రంథనామాదికము అయిదవ భాగమునుండి ముద్రింపఁబడుచున్నది.

తప్పొప్పుల పట్టికలను తయారుచేయుటలో నాల్గవ భాగమునకు మా యల్లుడు, చి॥ బద్దెపూడి రామనాథశర్మ B.Sc., ప్రియ శిష్యుడు చి॥ శ్రీహరి, అయిదు ఆరు ఏడు భాగములకు శ్రీశ్రీశ్రీ బ్రహ్మానందతీర్థస్వామివారును సహకరించిరి.

ఈ ప్రథమ బాగ ద్వితీయ ముద్రణమున శోధనకార్యమును ( Proof Reading ) చి॥ మాచవోలు శివరామప్రసాద్ M.A. నిర్వహించెను.

కమలాంబికా ముద్రణాలయాధినేతలు శ్రీపద్మనాభముగారు, చి॥ రంగనాథము, అచ్చటి కార్యకర్తలును ఎంతో శ్రద్ధతో గ్రంథము అందముగా ముద్రిత మగుటకు కృషియొనర్చిరి.

ఈ గ్రంథ ముద్రణ ప్రకాశన విక్రయ ప్రచారములకు తోడ్పడుచుండినవారి కందఱకును శ్రీ సీతాలక్ష్మణ హనుమత్సమేతుఁడైన శ్రీరామచంద్రప్రభువు ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించునుగాక!

అమోఘములైన యాశీస్సులను ప్రసాదించుచున్న శ్రీ శ్రీ శ్రీ సత్యానందమహర్షులవారికి (ఇనముకుగు), సకల విధముల ప్రోత్సహించుచుండిన శ్రీ శ్రీ శ్రీ బ్రహ్మానందతీర్థస్వామివారికిని అనేక నమస్కారములు చేయుచున్నాను.

తప్పులను సవరించుకొని తరువాత గ్రంథమును చదువుఁడని పాఠకులను ప్రార్థించుచున్నాను.

నెల్లూరు,
విభవ, పుష్యము.
1989, జనవరి.

బుధ విధేయుఁడు
పోలూరి హనుమజ్జానకీరామశర్మ.

శ్రీరస్తు

## స్తుతి

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే॥

శ్లో॥ వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే
మధ్యేపుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్।
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాన్తం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్॥

శ్లో॥ నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యై చ తస్యై జనకాత్మజాయై।
నమోఽస్తు రుద్రేంద్రయమానిలేభ్యో
నమోఽస్తు చంద్రార్కమరుద్గణేభ్యః॥

శ్లో॥ యత్ర యత్ర రఘునాథ కీర్తనం
తత్ర తత్ర కృతమస్త కాంజలిమ్।
బాష్పవారిపరిపూర్ణలోచనం
మారుతిం నమత రాక్షసాన్తకమ్॥

శ్లో॥ కూజన్తం రామ రామేతి మధురం మధురాక్షరమ్।
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్॥

శ్లో॥ యః కర్ణాంజలి సంపుటై రహ రహ స్సమ్యక్పిబ త్యాదరాత్
వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు।
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యంతసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్ విష్ణోః పదం శాశ్వతమ్॥

శ్లో॥ వాల్మీకి గిరి సంభూతా రామసాగరగామినీ।
పునాతు భువనం పుణ్యా రామాయణమహానదీ॥

# అభినందనము

రామాయణతరంగిణీ ప్రసంగములయొక్క ముగింపునందు 24-12-75 తేది సాయంకాలము నెల్లూరిలోని సెంట్రల్ కో-ఆపరేటివ్ బ్యాంకు హాలులో (Central Co-operative Bank Hall) శ్రీ శ్రీ శ్రీ సత్యానందమహర్షులవారి యధ్యక్షతయందు అభినందన సభ జరిగెను. శ్రీ శ్రీ శ్రీ బ్రహ్మానందతీర్థస్వామివారు, శ్రీమాన్ కిళాంబి శ్రీనివాసరామానుజాచార్యులవారు, శ్రీ దుగ్గిశెట్టి వేంకటరమణయ్యగారు ప్రసంగ పరంపరను ప్రశంసించుచు ప్రసంగించిరి. శ్రీరామకృష్ణ సేవాసమాజము వారు ప్రసంగకర్తకు సమ్మానపత్రమును సమర్పించి సత్కరించిరి. శ్రీ కోట వీరాంజనేయశర్మగారిచే రచింపఁబడిన ఆశీరభినందన శ్లోక మందారగుచ్ఛము పఠింపఁబడెను. ప్రసంగశ్రోతలు అనేకులు ప్రసంగ కర్తను పుష్పమాల్యవస్త్రాదికములతో సమ్మానించిరి.

---

శ్రీరస్తు

## శ్రీ పోలూరి హనుమజ్జానకీరామశర్మగారికి

రామకృష్ణ సేవాసమాజంవారు సమర్పించు

# సన్మానపత్రము

మహాశయా,

అనవాయితీకోసంగా కాక మహాశయులైనందుకే మిమ్మి మహాశయా అని మేము సంబోధిస్తున్నాము. ఎవరైనాసరే ఒకర్ని పొగడడం తప్పు గాని మెచ్చుకోవడం తప్పు గాదు. మెచ్చుకోలుకు

తగినవారిని ఉపేక్షించడమే తప్పు. మా సేవాసమాజం ధ్యేయాలకూ ప్రయోజనాలకూ సాఫల్యం చేకూర్చడంలో మీరుచేసినకృషి ప్రశంసనీయమైనదీ, ఆదర్శప్రాయమైనదీ అని మేము గుర్తించినందువల్లనే మిమ్ములను అభినందించడంలో మాకానందం కల్గుతున్నది.

ఒకకార్యాన్ని చేపట్టి ఉదరాబదరా ఏదోచెయ్యడంగా కాక ఫలాభిసంధిరహితంగా శ్రద్ధాసక్తులతో సెబా షనిపించుకునే సామర్థ్యంతో చెయ్యడం గొప్పతనం. అలాంటి గొప్పతనం మీకుంది: మీలో నిండుగా ఉంది. శ్రీమద్వాల్మీకిరామాయణాన్ని రామాయణతరంగిణి పేరిట ప్రతి ఆదివారమూ ధారావాహినిగా ప్రవచనం చెయ్యడానికి నిస్స్వార్థబుద్ధితో మీరు అంగీకరించి దానిని ఒక తపస్సుగా స్వీకరించి తుదముట్ట నిర్వహించారు. వాల్మీకి రామాయణమరందతరంగిణిలో రాజహంసవలె చరించి వాల్మీకి హృదయావిష్కారమైన గోవిందరాజస్వామి వ్యాఖ్యాక్షీరసాగరాన్ని మందరమువలె మథించి సారాన్ని సుధాభాండమువలె పైకితెచ్చి దానికి మీసాహిత్య విద్యాప్రావీణ్యం చేత ప్రతిభచేత సౌరభ్యం కలిగించి 51 ఉపన్యాసములు చేసినారు. జానకీజానిచరిత్రానికి శ్రోతల సానుభూతిని సంపాదించి వారికి రసానుభూతిని అందించినారు, అంతపెద్ద ఆదికావ్యమును మీ తీయనివచస్సుతో ఒలిచి చేతికిచ్చిన అరటిపండు తినుటలోని సౌలభ్యముతో మాకు ఆకళింపుకు తెచ్చినారు.

శ్రోతలపుణ్య విశేషమువల్లనూ మీ చెక్కుచెదరని దీక్షవల్లనూ మాప్రణాళికావిజయం సాధ్యపడింది. వాల్మీకి రామాయణముపై ఇట్టి ఉపన్యాసపరంపర నెల్లూరున అపూర్వమైనదన్న విజ్ఞులప్రశంస విన్నమాఆనందము అతివేలమైనది. మా కృతార్థత నిండైనది: కృతజ్ఞత మాటలకు అందనిది.

శ్రీ శారదరామకృష్ణుల అనుగ్రహముతోబాటు సర్వదేవీ దేవతల అనుగ్రహము మీపై నిండుగా ఉండాలని మీరు నిండు నూరేళ్లు సర్వశుభాలతోను వర్ధిల్లాలనీ ఆకాంక్షిస్తున్నాము.

ఈ శ్వ రో జ య తు

ప్రభుసేవాభిలాషులు

బి. ఎల్లమందయ్య, బి.ఏ. కోశాధికారి

డా. సి. పి. శాస్త్రి, ఎం.బి.బి.ఎస్, అధ్యక్షులు

జమ్మలమడక శ్రీరామచంద్రమూర్తి బి.కాం.

డి.సి. రాఘవయ్య B.A.B.L. ఉపాధ్యక్షులు

డా. శేషాద్రిరెడ్డి M.B.B.S.

సన్నపురెడ్డి చంద్రశేఖరరెడ్డి B.A. ఉపాధ్యక్షులు

నెల్లూరు
21-12-75

శివరాజు వేంకటనరసింహారావు
బి,ఏ.బి.టి.
కార్యదర్శి,

---

## ఆశీరభినన్దనశ్లోకమందార గుచ్ఛః

బాలసరస్వతీత్యాదిబిరుదవిభ్రాజినా అష్టావధానినా
శ్రీకోట వీరాంజనేయశర్మణా సుహృద్వరేణ
రచితః

[ బాలసరస్వతీత్యాదిబిరుదవిరాజమానుఁడు అష్టావధాని సుహృద్వరుఁడును అయిన శ్రీకోట వీరాంజనేయశర్మ ఆశీస్సులతో అభినందించుచు రచించిన శ్లోకమందారగుచ్ఛము. ]

శ్లో॥ పోలూరి వంశకలశాంబుధిశీతభానో
శ్రీజానకీరమణనామక వేదమూర్తే।
అస్మత్పురాకృతవిశేషఫలప్రభావా
త్ప్రాప్తం హి రామచరితాత్మక మాంధ్రకావ్యమ్॥

[పోలూరివంశపయోధిసుధాకరా! హనుమజ్జానకీరామశర్మా! వేదమూర్తీ! మాయొక్క పురాకృతమైన పుణ్యఫలవిశేషమువలన శ్రీరామ చరిత్రాత్మకమైన యాంధ్రకావ్యమును వినుభాగ్యము ప్రాప్తించినది.]

శ్లో॥ వాల్మీకే రివ తావకాననసృతాం పీయూషవర్షాయితాం
శ్రుత్వా రామకథాం పరైకఫలదాం నానారసోదంచితామ్।
లబ్ధ్వా మోదసుధా మహో నిరవధిం తీర్త్వా భవాంభోనిధిం
ధన్యం మిత్ర మదీయజన్మ సమభూత్ స్వస్త్యస్తు తే సర్వదా॥

[బహురసోదంచితమై అమృతవర్షమై మోక్షఫలదమై, వాల్మీకి ముఖమునుండివలె, నీవదనమునుండి ప్రసరించుచుండిన రామకథను విని సంసార సాగరమును తరించి నిరవధికమైన సంతోషమును పొందితిని. నాజన్మ ధన్యమయ్యెను. మిత్రమా! నీకు ఎల్లప్పుడు మేలగును గాక!]

శ్లో॥ విస్రబ్ధా శ్శిశవః కుభావరహితాః విద్యార్థినః ప్రేక్షకాః
చిత్రీభావజుష స్తథా యువతయ శ్శ్రుత్వా ప్రసంగం తవ।
తిర్యంచోఽపి విచేతనాః కిసలయీభూతా శ్చ దార్వాదయః
యుష్మద్రామకథాసుధా మిహ భువి స్తోతుం సమర్థోఽద్య కః॥

[నీ ప్రసంగము వినుచు శిశువులు నిశ్చలముగా నుండిరి; ప్రేక్షకులు విద్యార్థులు శ్రద్ధామయులై యుండిరి; యువతులు చిత్రములోని బొమ్మలవలె నుండిరి; తిర్యక్కులు సైతము ఆనంద మగ్నములై చాంచల్యరహితములై నటులుండెను; మందిరద్వార బంధములలోని దారువులు కూడ చిగురించినట్లుండెను. నీ రామ కథాసుధను స్తుతించుటకు సమర్థుఁ డెవఁ డున్నాఁడు?]

శ్లో॥ రాజానో హి భవాదృశాన్ బుధజనా నర్హా స్సమభ్యర్చితుం
కాలేఽస్మిన్ కనకాభిషేక మతులం తే సన్తి చేత్ కుర్వతే,
ధన్య స్త్వం భవదీయకీర్తి లతికా వ్యాప్నోతి భూమండలే
విద్వన్ సత్కవిసార్వభౌమ బిరుదం గృహ్ణీష్వ భూయాచ్ఛుభమ్॥

[నీవంటి బుధజనులను అర్చించుటకు రాజులే అర్హులు. వారు ఇప్పుడు ఉన్నచో నీకు అతులమైన కనకాభిషేకమును చేసియుందురు. నీవు ధన్యుఁడవు. నీ కీర్తిలత భూమండలమున వ్యాపించుచున్నది. ఓ విద్వాంసుఁడా! "సత్కవిసార్వభౌమ" అను బిరుదమును స్వీకరింపుము. నీకు శుభమగునుగాక!]

**గమనిక** :- శ్రీ వీరాంజనేయశర్మగారు ఈ ప్రసంగములనే గాక, ఈ ప్రసంగకర్త తెలుఁగున చంపూ కావ్యముగా రచించుచుండిన శ్రీమద్రామాయణములోని పెక్కు ఘట్టములను వినియుండిరి. అందువలన ఈ ప్రసంగములను ఆ మహాకావ్యరచనమును రెంటిని ఉద్దేశించుచు శ్రీ వీరాంజనేయశర్మగారు ఈ బిరుదము నొసంగిరని గ్రహింపవలసియున్నది.

శ్లో॥ రామయ్యశాస్త్రితనుజేన కవీశ్వరేణ
వీరాంజనేయ ఇతి విశ్రుతకీర్తిభాజా।
మందారపద్యసుమరాజి రనూనగంధా
సౌహార్దసారకలితా రచితా మనోజ్ఞా॥

[ రామయ్యశాస్త్రిపుత్రుఁడు కవీశ్వరుఁడు విశ్రుతకీర్తియునైన వీరాంజనేయశర్మ సౌహార్దసారమధురసభరితమై సుగంధయుతమై మనోహరమైన పద్యమందారమాలికను రచించెను.]



# విషయసూచిక



శ్రీ ర స్తు

# శ్రీ రామాయణతరంగిణి

## 1. వాల్మీకి తీర్థము

### 1. కళ్యాణగుణములు

శ్రీరామాయణప్రసంగములయందు వాల్మీకివృత్తాంతమును ముందుగా గ్రహించుట అవశ్యకము. ఆమహర్షి రచింపకున్నచో రామాయణకావ్యమే పుట్టియుండదు కదా! ఆకావ్యమే లేకున్న శ్రీరామచంద్రుని మహిమ నింతగా మనము గుర్తించియుండము. శ్రీసీతారామలక్ష్మణులు ఆ సేతుహిమాచలముగా ఆరాధ్యదైవములుగా వెలసియున్నారన్నచో వాల్మీకిరచనమే యందులకు మూలము కావున వాల్మీకివృత్తాంతము శ్రీరామకథాసౌధమునకు పునాది. మఱియును ఋషిని పేర్కొనకున్నచో మంత్రజపము ఫలింపదు. శ్రీరామాయణ మహామంత్రమునకు వాల్మీకియే ఋషి. కావున వాల్మీకితీర్థమును సేవించి అనంతరము కథాతీర్థములందు ప్రవేశింతము.

ఈ మహాకావ్యముయొక్క ఆరంభమే వింతగా నుండును. వాల్మీకిమహర్షి నారదమహర్షిని ప్రశ్నించుటతో గ్రంథ మారంభమగును. తపస్వియైన వాల్మీకి, తపస్స్వాధ్యాయనిరతుఁడు వాగ్విదులలో శ్రేష్ఠుఁడు మునిపుంగవుఁడును అయిన నారదుని ప్రశ్నించెను.

శ్లో॥ తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్।
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్॥

బాలకాండ సర్గ-1 శ్లో-1

ఇందు వాల్మీకికి ఒక్క విశేషణము, నారదునకు మూఁడు విశేషణములును ఉపయోగింపఁబడినవి. విశేషణములయాధిక్యముచేత నారదునిగౌరవము వ్యక్త మగుచున్నది. నారదుఁడు తపస్స్వాధ్యాయనిరతుఁడు. చాంద్రాయణాదివ్రతములకు తపస్సని పేరు. స్వాధ్యాయ మనఁగా వేదాధ్యయనము. తపస్స్వాయనిరతుఁ డనగా వేదములను అధ్యయన మొనర్చుటయందు, అందు విధింపఁబడిన వివిధవ్రతములను ఆచరించుటయందును ఆసక్తి కలవాఁడు. ఆయన వాగ్విదులలో శ్రేష్ఠుఁడు. వాక్ అనఁగా ముఖ్యముగా వేదమే. ఛాందోగ్యోపనిషత్తులో భూమవిద్యాప్రకరణమున నారదమహర్షి వేదములే గాక ఇతిహాసపురాణములు, వ్యాకరణముతర్కము మొదలుగా పెక్కువిద్య లభ్యసించినట్లున్నది. కావున వేదములయొక్క శాస్త్రములయొక్క తాత్పర్యము నెఱింగినవారిలో ఆయన శ్రేష్ఠుఁడు. మునిపుంగవుఁ డనువిశేషణమును కూడ ఇట్లే గ్రహింపవచ్చును. మును లనఁగా మననశీలము కలవారు; వేదములు శాస్త్రములును చూపుచున్నమార్గముల ననుసరించి జీవునియొక్క జగత్తుయొక్క ఈశ్వరునియొక్క యథార్థ స్వరూపమును గూర్చి నిరంతరము ఆలోచించుండువారు. ఈ యాలోచనమును ఏకాగ్రతతో కొనసాగించుకొనుటకొఱకే వారు తపోవనములలో నుందురు. నారదుఁడు అట్టివారిలో అగ్రగణ్యుఁడు. ఇన్నియర్హతలు కలవానిని వాల్మీకి ప్రశ్నించుచున్నాఁడు. మూలమున "పరిపప్రచ్ఛ" అని కలదు. అనఁగా వాల్మీకి మిక్కిలి యాదరముతో ఆసక్తితో మాటిమాటికీ అడిగె నన్నమాట. ఆయనయు తపస్వియే; కావున ఉపదేశమునకు అర్హుఁడు. అర్హుఁడైనవాఁడు శ్రద్ధతో అడిగినప్పుడే పెద్దలు ధర్మమును గాని తత్త్వమును గాని యుపదేశింతురు.

వాల్మీకి అడిగినప్రశ్న యిది. "ఈలోకమునందు ఇప్పుడు గుణవంతుఁ డెవఁడు? వీర్యవంతుఁ డెవఁడు? ధర్మజ్ఞుఁడు కృతజ్ఞుఁడు సత్యవాక్యుఁడు దృఢవ్రతుఁడును అయినవాఁ డెవడు? చరిత్రకలవాఁ డెవడు? సర్వభూతములుయందును హితుఁడైనవాఁ డెవఁడు? ఇతఁ డొక్కఁడే ప్రియదర్శనుఁడని చెప్పఁదగినవాఁ డెవడు? ఆత్మవంతుఁడు క్రోధమును జయించినవాఁడు కాంతిమంతుఁడు అసూయలేనివాఁడును ఎవఁడు? రణరంగమున నెవనికి రోషము కలిగినచో దేవతలుకూడభయపడుదురో అట్టివాఁడెవఁడు? ఈవిషయమున నాకు చాల కుతూహలముకలదు. దీనిని నీవలన వినఁగోరుచున్నాను, ఇట్టినరుని తెలిసికొనుటకు నీవే సమర్థుఁడవు.

శ్లో॥ కో న్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ క శ్చ వీర్యవాన్
ధర్మజ్ఞ శ్చ కృతజ్ఞ శ్చ సత్యవాక్యో దృఢవ్రతః॥ 2

శ్లో॥ చారిత్రేణ చ కో యుక్తః సర్వభూతేషు కో హితః
విద్వాన్ కః క స్సమర్థశ్చ క శ్చైక ప్రియదర్శనః॥ 3

శ్లో॥ ఆత్మవాన్ కో జితక్రోధో ద్యుతిమాన్ కోఽనసూయకః
కస్య బిభ్యతి దేవా శ్చ జాతరోషస్య సంయుగే॥ 4

బాల–సర్గ-1

ఈ ప్రశ్నమును పరిశీలింపుఁడు. వాల్మీకి అనేక గుణములను పేర్కొని, ఆ గుణము లన్నియు కలిగిన నరుఁడు, అనఁగా విష్ణువో శివుఁడో కాదు, మానవుఁడే; ఈలోకమున, అనఁగా వైకుంఠమునఁ గాదు కైలాసమున గాదు, భూలోకముననే; ఇప్పుడే, అనఁగా కృతయుగమునఁ గాదు తాము మాటాడుచున్నప్పుడే; ఎవఁడున్నాఁడని యడుగుచున్నాఁడు. వాల్మీకి పేర్కొన్నవానిని కళ్యాణ గుణము లందురు, సకలకళ్యాణగుణములను కలిగిన మానవుఁ డెవఁడైన నొకఁడు తమకాలమున నున్నాఁడా అనుటయే వాల్మీకి ప్రశ్నకు తాత్పర్యము,

అది విని నారదుఁడు సంతోషించి "నీవు పెక్కు గుణములను పేర్కొన్నావు. అవి దుర్లభములు. నేను ఆలోచించి తెలిసికొని ఆ గుణములు గలవానిని చెప్పెదను" అని చెప్పి ఇట్లనెను: "ఆ గుణము లన్నియు కలవాఁడు ఇక్ష్వాకువంశమున జన్మించిన రాముఁడే యని జనులు చెప్పుకొనుచున్నారు. అతఁడు నియతాత్ముఁడు మహావీర్యుఁడు ద్యుతిమంతుడు ధృతిమంతుఁడు" ఇట్లు మొదలుపెట్టి నారదుఁడు ఇంకను పెక్కుగుణములను పేర్కొనెను. దీనినిబట్టి వారిరువురును తమకాలమున జరిగిన చరిత్రను, అందు మహానాయకులుగా ప్రసిద్ధులైన రామసుగ్రీవవిభీషణాదులను గూర్చియే బావించుచున్నా రనుట స్పష్టము. వాల్మీకి పెక్కుగుణములను పేర్కొని ఆగుణము లన్నియు కలవాఁ డెవఁ డని యడుగుటలో అభిప్రాయమేమి? ప్రయోజనమేమి? లోకమున గుణవంతులని ప్రసిద్ధులైనవారియందు సాధారణముగా ఏవో కొన్ని గుణములు ప్రసిద్ధములై యుండును. అవి యైనను ఆపదలు సంభవించినప్పుడు పరీక్షకు నిలువఁగలవా యనుట సంశయాస్పదమే. అట్టి యెడల దుర్లభములైన పెక్కు కళ్యాణగుణములను కలిగినవాఁడు జీవితములో ఒడుదుడుకులు సంభవించినప్పుడు ఆ గుణములను నిలుపుకొనుచు ధర్మమునే పాటించుచు ఎట్లు వ్యవహరించును? పరిస్థితులు ప్రతికూలమైనప్పుడు ఆపద్ధర్మమును పాటించి తమ సహజమైన గుణమునో ధర్మమునో వదులుకొని ఎట్లో శరీర రక్షణము గావించుకొని, తరువాత ప్రాయశ్చిత్తాదులచే శుద్ధులై మరల సలక్షణముగా కొందఱు వ్యవహరించుచుందురు. వారును మహాపురుషులే యగుదురా! అట్లు కాక ఏపరిస్థితియందును తమ గుణమును ధర్మమును వీడక వర్తించువారిని మాత్రమే మనము

ఆదర్శప్రాయులైన మహాపురుషులనుగా గ్రహింపవలయునా? ఎట్లయినను మనవలెనే సుఖములు దుఃఖములు అనుభవించుచు ఆశానిరాశలతో కొట్టుమిట్టాడుచు కష్టములు వచ్చినప్పుడు కూడ ధర్మమును వీడని మహాపురుషులనుగూర్చి తెలిసికొనుట సాధారణ మానవులకు చాల ఉపయోగకరము. ఇదియే వాల్మీకి ప్రశ్నలోని యభిప్రాయము.

రామాయణమునుగూర్చి త్ర్యంబకమఖి సంస్కృతమున ధర్మాకూత మను గ్రంథమును రచించెను. ధర్మాకూత మనఁగా ధర్మమును గూర్చిన తలంపు. రామాయణమునందు ఏధర్మమును వాల్మీకి ఉద్దేశించెనో దానిని త్ర్యంబకమఖి వివరించెను. అందు ఈ సందర్భమున ఆయన యొకచిత్రమైన చర్చ చేసెను. విశ్వామిత్రుఁడు వసిష్ఠుఁడు మొదలుగా సృష్టికి ప్రతిసృష్టి చేయఁగలిగినవా రెందఱో మహానుభావులు ఆ కాలమున ఉండఁగా నారద మహర్షి క్షత్రియబాలుఁడైన రాముని సకలకళ్యాణగుణసంపన్నునిగా ఏల పేర్కొనెను? గౌతమ మహర్షి, "మహాత్ములయందు ధర్మవ్యతిక్రమము సాహసముకూడ కన్పించుచున్నది." (దృష్టో ధర్మవ్యతిక్రమః సాహసం చ మహతామ్॥సూ) అని రచించి సాధారణ మానవులకు ధర్మశాస్త్రమే ప్రమాణము కాని. ఆ మహాత్ములచరిత్రలు కావని చెప్పెను. వారి జీవితములలో ధర్మాతిక్రమణము సాహసము ఎప్పుడైన సంభవించినను, వారు తపశ్శక్తిచే అదోషమును పోఁగొట్టుకొనఁగలిగిరి. మఱి సామాన్యులు తప్పులు చేయఁగలిగినట్లుగా తపస్సులు చేయలేరు. కావున వారు మహాత్ములతో సామ్యమును పాటించి సాహస మొనర్చుట సమంజసము కాదు. కావున సామాన్యులు ధర్మశాస్త్రమునే ప్రమాణముగా అవలంబింప

వలయును. విశ్వామిత్రుఁడు పరశురాముఁడు మొదలగువా రంద ఱును ఎప్పుడైన ఒకప్పుడు ఆపదలప్రాబల్యమున ధర్మము నతి క్రమించి తరువాత తపస్సులు చేసి ప్రాయశ్చిత్త మొనర్చుకొన్న వారే. మఱి శ్రీరామునిచరిత్రయందు ధర్మాతిక్రమణము గాని, ఆ దోషమును తొలగించుకొనుటకు ప్రాయశ్చిత్తము చేసికొనుట గాని కన్పింపదు. శత్రువై ఆయినచేత దెబ్బతిన్న మారీచుఁడే చెప్పినట్లు "రూపొందిన ధర్మము రాముఁడు" (రామో విగ్రహ వాన్ ధర్మః). కావున నారదమహర్షి విశ్వామిత్ర పరశురామాదు లను లెక్కగొనక శ్రీరామునే సకలకళ్యాణగుణసంపన్నునిగ, ధర్మశాస్త్రమువలె ప్రమాణమైన చరిత్రగలవానినిగా పేర్కొనె నని త్ర్యంబకమఖి యుద్ఘాటించెను.

కాని బ్రహ్మదేవుని యాదేశమున వాల్మీకి రామకథను రచిం చినట్లు గ్రంథమున స్పష్టముగ కలదు. అట్లయినను బ్రహ్మదేవుఁడు కూడ పై యభిప్రాయముతోనే రాముని చరిత్రమును రచింపు మని వాల్మీకిని ఆదేశించె నని చెప్పవచ్చును. అనఁగా బ్రహ్మదేవుని యభిప్రాయమునే త్ర్యంబకమఖి వ్యక్తీకరించినాఁ డన్నమాట.

ఇది లోకమునకు కూడ సమ్మతమైనదే. ఈమహాకావ్యము ఆవిర్భవించినప్పటి నుండి, మనదేశముననే కాదు, ప్రపంచమున ఇతర దేశములలో కూడ శ్రీరామచంద్రునియొక్క జీవితమును ఆదర్శముగ పెట్టుకొని తమజీవితములను దిద్దితీర్చుకొన్నవారు అసంఖ్యాకులుగనున్నారు; ఇఁకముందును ఉందురు.

గుణసంపన్నుఁడైనవాఁ డెవఁడో చెప్పుమని మాత్రమే వాల్మీకి యడిగినను, నారదుఁడు శ్రీరాముని పేర్కొని, ఆయనచరిత్రమును కూడ సంగ్రహముగ చెప్పెను. వాల్మీకి పేర్కొన్నగుణము లన్నియు

శ్రీరామునియందు ఎట్లు సమన్వయించుచున్నవో చరిత్రమున నారదుఁడు నిరూపించె నన్నమాట. కావున ఈ గుణము లన్నియు నారదుఁడు చెప్పిన రామకథాసంగ్రహముననే ఎట్లు నిరూపింపఁ బడుచున్నవో గ్రహించుట సమంజసము, రాముని చరిత్రము వాల్మీకికిని తెలియును కావున నారదుఁడు కొన్ని గుణములకు ఉదాహరణముగా కొన్ని విశేషములను చెప్పినను, కొన్నింటికి రామచరిత్ర విశేషములను వాల్మీకియూహకే వదలియుండును. కావున కొన్నియెడల ఉదాహరణములను తరువాత వాల్మీకి రచించిన గ్రంథము నుండి కూడ మనము గ్రహింపవచ్చును.

ఈ కథాసంగ్రహమునే బాలరామాయణ మని వ్యవహరించుచున్నారు. ఈసంక్షేపమునందు బాలకాండకథయే లేకుండుట గమనింపఁదగియున్నది. బాలురు సాధారణముగా పెద్దలు చెప్పినట్లే నడచుకొనుచుందురు. యౌవనము వచ్చిన తరువాతనే పెక్కు విషయములలో స్వతంత్రముగ ఆలోచించి నిశ్చయించుకొని అట్లు వారు వర్తింపవలసిన యావశ్యకత యేర్పడును. అప్పుడే వ్యక్తిత్వము వ్యక్తమగునవకాశము కలుగును. కావుననే నారదమహర్షి అయోధ్యాకాండవృత్తాంతముతో రామునిచరిత్రమును ఆరంభించి యుండును.

మొదట "గుణవంతుఁ డెవఁడు? అన్నది వాల్మీకి వేసిన ప్రశ్న. ఇతరులచే ఏది మాటిమాటికి గుణింపఁబడుచుండునో, అనఁగా స్మరింపఁబడుచుండునో, అది గుణము, మనము మాటి మాటికి పెద్దల విషయమున స్మరించునది వారు మనయందు చూపువాత్సల్యమే. మహాత్ములు తమకన్న తక్కువవారితో కలిసి మెలిసి యుండుటయే వారియందలిసౌశీల్యము. ప్రజలకు నాయకు

లందు అనురాగమును కలిగించునది యిదియే. గుహుని విషయమున శబరివిషయమునను రామునియందు ఈ సౌశీల్యము వ్యక్తమగుచున్నది. రాముఁడు వనములకు బయలుదేరినపుడు గంగాతీరమున నిషాదులకు అధిపతియు తనకు ప్రియుఁడునైన గుహుని కలిసికొనెను,

శ్లో॥ గుహ మాసాద్య ధర్మాత్మా నిషాదాధిపతిం ప్రియమ్।
గుహేన సహితో రామో లక్ష్మణేన చ సీతయా॥
బాల-సర్గ —శ్లో. 29,30

మహారాజపుత్రుఁడైన శ్రీరాముఁడు బోయరాజును ప్రియుఁడైన మిత్రునిగా భావించె నన్నచో ఆయన ఎంత విశాలహృదయుఁడో వ్యక్తమగుచున్నది. తక్కువజాతి స్త్రీయైన శబరివలన ఆయన పూజను గ్రహించుటయు నిట్టిదియే.

శ్లో॥ శబర్యా పూజిత స్సమ్యక్ రామో దశరథాత్మజః।
బాల-సర్గ-1 శ్లో. 58

అధికారపదవులలో నున్నవారు అంతస్తులు మఱచి తమకన్న తక్కువస్థితిలోనున్నవారిని ఆదరముతో చూచుట సులభము కాదు. కుచేలుని శ్రీకృష్ణుఁడు ఆదరింపగలిఁగెను. కాని ద్రుపదుఁడు తనతోఁగూడి విద్యాభ్యాసము గావించిన ద్రోణుని ఆదరింపలేక పోయినాఁడు.

వీర్యవంతుఁ డగుట రెండవ గుణము. చాల దుష్కరమైన కార్యమును చేసియును బడలిక నొందకుండుట వీర్యము. శూర్పణఖచే ప్రేరేపింపఁబడి ఖరదూషణత్రిశిరసు లను ముగ్గురు నాయకులతో పదునాలుగువేల మంది రాక్షసులు దండెత్తి వచ్చినప్పుడు

రాముఁ డొక్కఁడే వారి నందఱను అనాయాసముగా సంహరించి నాఁడు.

శ్లో॥ తత శ్శూర్పణఖావాక్యా దుద్యుక్తాన్ సర్వరాక్షసాన్।
ఖరం త్రిశిరసం చైవ దూషణం చైవ రాక్షసమ్॥ 47
నిజఘాన వనే రామ స్తేషాం చైవ పదానుగాన్॥ 48
బాల-సర్గ-1

రాముఁడు ఒకటిన్నరముహూర్తములో, అనఁగా డెబ్బది రెండు నిముసములలో, వారి నందఱను సంహరించె నని ఆయుద్ధమునుండి తప్పించుకొనిపోయిన అకంపనుఁడు అను రాక్షసుఁడు రావణునకు చెప్పెను. దీనినిబట్టి శ్రీరామునివీర్య మెట్టిదో మనము గ్రహింపవచ్చును.

మూడవగుణము ధర్మజ్ఞత. ఎల్లవారును కీడు తొలఁగవలయునని మేలు కలుగవలయు ననియు కోరుకొందురు. అది ధర్మమువలన కలుగు నని శాస్త్రములు చెప్పుచున్నవి. ఏధర్మము వలన ఏశ్రేయస్సు కలుగు నన్నది లౌకిక మైన మనయాలోచన కందునది కాదు. విద్యాభ్యాసమునకై పిల్లవానిని బడికి పంపుట లౌకికమైన సాధనము. సరస్వతీ పూజకావించినచో చదువు చక్కఁగా వచ్చునన్నప్పుడు సరస్వతీపూజకు విద్య చక్కఁగా కొనసాగుటకుఁ గలసంబంధము లౌకికమైన మనయాలోచనకు అందునది కాదు. కావున విద్యాభ్యాస మను శ్రేయస్సునకు సరస్వతీపూజ అలౌకికమైన సాధనము. ఇది శాస్త్రమువలన తప్ప మఱియొక విధముగా మనకు తెలియదు. శాస్త్రవిహితములైన యలౌకికసాధనములనే ధర్మము లందురు. సాధారణములు విశేషములును

అయినదర్మముల నెఱింగినవాఁడు ధర్మజ్ఞుఁడు. మనకు సాధారణ ముగా ధర్మము తెలిసినట్లే యుండును. కాని క్లిష్టపరిస్థితులలో ఏది ధర్మమో నిశ్చయముగా తెలిసికొనుట సులభము కాదు,

భరతుఁడు చిత్రకూటమునకు పోయి, "నీవు ధర్మము నెఱింగినవాఁడవు, నీవే రాజువు" అని రాజ్యమును స్వీకరింపు మని రాముని మిగుల భక్తితో ప్రార్థించెను. వసిష్ఠాదులు సైతము ఆ సమయమున రాముఁడు భరతుని ప్రార్థనను అంగీకరించి అతఁడిచ్చుచున్న రాజ్యమును స్వీకరించుటే సమంజసమని చెప్పుచుండిరి. రాముఁడును చాల ఉదారుఁడు. ఆయనకును భరతునిప్రార్థనమును తిరస్కరించుట ఇష్టము కాదు. కాని ఆయన తనయిష్టమును లెక్కపెట్టక తనకు భరతునకును కష్టమునే కలిగించుచున్నను, తండ్రికి ఇచ్చినమాటను పాటించుటయే ధర్మ మని స్పష్టముగా గుర్తింపఁగలిగెను. అది ధర్మజ్ఞత.

శ్లో॥ త్వ మేవ రాజా ధర్మజ్ఞ ఇతి రామం వచోఽబ్రవీత్!
రామోఽపి పరమోదార స్సుముఖ స్సుమహాయశాః॥
నచైచ్ఛ త్పితురాదేశా ద్రాజ్యం రామో మహాబలః!
బాల-సర్గ-1-శ్లో. 36, 37

కృతజ్ఞత యన్నది నాల్గవగుణము. తనకు ఇతరులు చేసిన యుపకారమును, స్వల్పమైన దానిని కూడ, గొప్పగా భావించి జ్ఞప్తి యందుంచుకొనుట కృతజ్ఞత. సీతను రక్షించుటకై జటాయువు రావణునితో పోరి నిహతుఁ డయ్యెను. అతనిని జూచి రాముఁడు మిగుల శోకించి తండ్రికి వలె ప్రేతకృత్యములను గావించి అతనికి ఉత్తమలోకములు కలుగునట్లు చేసెను.

శ్లో॥ గృధ్రం చ నిహతం దృష్ట్వా హృతాం శ్రుత్వా చ మైథిలీమ్!
రాఘవ శ్శోకసంతప్తో విలలాపాకులేంద్రియః

తత స్తే నైవ శోకేన గృధ్రం దగ్ధ్వా జటాయుషమ్॥
బాల-సర్గ-1-శ్లో 53, 54

రావణుఁడు సంహరింపఁబడినతరువాత దేవతలు ప్రత్యక్షమైరి. నీ కేమి వరము కావలయునో కోరుకొమ్మని యింద్రుఁ డనెను. అప్పుడు రాముఁడు తనకుఁ గావలసినది యేదియు కోరక, తన కొఱకు రణమున మరణించిన వానరులందఱు మరల జీవింపవలయునని కోరెను. జటాయువువిషయమున వానరులయందును రాముఁ డెంతో కృతజ్ఞతను చూపెను.

శ్లో॥ దేవతాభ్యో వరం ప్రాప్య సముత్థాప్య చ వానరాన్
బాల_సర్గ-1 శ్లో. 86

సత్యవాక్యపాలనము అయిదవగుణము. భూతార్థకథనము ప్రతిజ్ఞాపాలనము అని యిది రెండువిధములు. జరిగినది జరిగినట్లు చెప్పుట భూతార్థకథనము లేక యథార్థభాషణము. ఇది సులభము కాదు. కావుననే న్యాయస్థానములలో ప్రమాణములు చేయించి సాక్షులచేత సాక్ష్యములను చెప్పింతురు. సాధారణవిషయములలో కూడ జరిగిన వృత్తాంతమును చెప్పునప్పుడు అందులో మనకు అవమానకరముగా ఏదైన నున్నచో దానిని దాటవేయుదుము. శ్రీరాముఁడు సుగ్రీవునితో సఖ్యము చేయునపుడు తనవృత్తాంతమును నంతయు చెప్పెను; అనఁగా మాయలేడివలన తాము మోసపోవుట, తమ యజాగరూకతవలన సీతాపహరణము జరుగుటను గూడ ఆయన చెప్పెను.

శ్లో॥ సుగ్రీవాయ చ తత్సర్వం శంస ద్రామో మహాబలః॥
ఆదిత స్తద్యథావృత్తం సీతాయా శ్చ విశేషతః॥
బాల-సర్గ-1 శ్లో. 59, 61

ఇచ్చినమాటను నిలుపుకొనుట ప్రతిజ్ఞాపాలనము. వాలి తన భార్యను హరించి తన్ను చంపఁగోరుచున్నాఁ డని సుగ్రీవుఁడు చెప్పఁగా అవాలిని తప్పక వధింతు నని రాముఁడు ప్రతిజ్ఞచేసి, అమాటప్రకారమే వాలి నొక్కబాణముతో వధించెను.

శ్లో॥ ప్రతిజ్ఞాతం చ రామేణ తదా వాలివధం ప్రతి॥
నిజఘాన చ తత్రైనం శరేణైకేన రాఘవః॥
బాల-సర్గ-శ్లో 62, 69

ఆఱవగుణము దృఢవ్రతత్వము. వ్రత మనఁగా సంకల్పమే. ఎన్నియాటంకములు వచ్చినను సంకల్పించిన దానిని కొనసాగించుటయే దృఢవ్రతత్వము. తండ్రి కైకకిచ్చినమాటకొఱకై రాముఁడు అడవులకు పోవ సంకల్పించెను. దాని కెన్నియో ఆటంకములు కలిగెను; కౌసల్య వారించెను. దశరథుఁడు కూడ వలదనెను. పౌరు లందఱును అడ్డుపడిరి. వారందఱును విలపించుచు రథమువెంట చాలదూరము వచ్చిరి. అయినను రాముఁడు వెనుకకు మరలలేదు. ఇది దృఢవ్రతత్వము.

శ్లో॥ పౌరై రనుగతో దూరం పిత్రా దశరథేన చ॥
బాల-సర్గ-1 శ్లో. 28

చరిత్రకలిగియుండుట ఏడవగుణము. చరిత్ర మనఁగా ఆచారము. తల్లి తండ్రి ఆచార్యుఁడు మొదలగువారు చెప్పినట్లు

చేయుచు వారిని సేవించుటయే చరిత్రము. దశరథుఁడు తనకు వరమిచ్చె నని కైక నిర్దేశించుటవలన ఆమెకు ప్రియమును గావించుటకొఱకు రాముఁడు అడవులకు పోయెను. ఇంతకన్నను చరిత్ర ఏమున్నది?

"సర్వభూతములయందును హితుఁ డెవఁడు?" అన్నది వాల్మీకి యడిగిన గుణములలో ఎనిమిదవది. "సర్వభూతముల యందు" అనుటచేత మిత్రులయందు తటస్థులయందు మాత్రమే కాక శత్రువులయందును హితము చేయువాఁ డనియే గ్రహింప వలసియున్నది. హితము ప్రియముగా నుండు నని చెప్పఁజాలము. తప్పు చేసినవానిని దండించి చక్కనిమార్గమునకు తెచ్చుట హితము. కబంధుఁడు శాపవశమున వికృతమైన రాక్షసరూపము నొందెను. రాముఁడు వానిని సంహరించి వెడలిపోక వాని శరీర మునకు అగ్నిసంస్కారము గావించినాఁడు. దానివలన వానికి దివ్యత్వము కలిగినది. ఆయనకుఁగల దయ అపారము.

శ్లో॥ కబన్ధం నామ రూపేణ వికృతం ఘోరదర్శనమ్॥
తం నిహత్య మహాబాహు ర్దదాహ స్వర్గత శ్చ సః॥
బాల-సర్గ-1 శ్లో. 55, 56

విద్వాంసుఁ డగుట తొమ్మిదవగుణము. రాముఁడు వేదములు, వేదాంగములు, ధనుర్వేదము, శాస్త్రములు, వానితత్త్వము నెఱిఁగినవాఁడు. విద్వాంసుఁ డనఁగా ముఖ్యముగా ఆత్మతత్త్వము నెఱింగినవాఁడే. తనకై ఏదియు కోరుకొనకుండుట, ప్రాప్తించిన రాజ్యమును సులభముగా వదిలివేయుట మొదలగు లక్షణముల వలన రామునియందు ఈగుణము వ్యక్తమగుచున్నది.

శ్లో॥ వేదవేదాంగతత్త్వజ్ఞో ధనుర్వేదే చ నిష్ఠితః॥
సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞః స్మృతిమాన్ ప్రతిభానవాన్॥
బాల-సర్గ-1-శ్లో, 14, 15

సమర్థత పదియవగుణము. రాముఁడు సర్వకార్యధురంధరుఁడు. ఆయన విల్లెక్కు పెట్టఁగానే సముద్రుఁడు ప్రత్యక్షమై సేతువును నిర్మించి లంకకుఁ జేరి రావణుని సంహరింపఁగలిగెను.

శ్లో॥ సముద్రం క్షోభయామాస శరై రాదిత్యసన్నిభైః॥
దర్శయామాస చాత్మానం సముద్ర స్సరితాం పతిః।
సముద్రవచనా చ్చైవ నలం సేతు మకారయత్॥
తేన గత్వా పురీంలంకాం హత్వా రావణ మాహవే॥
బాల-సర్గ-1, శ్లో. 79, 80, 81

పదునొకండవగుణము ఏకప్రియదర్శనత్వము, ఎవనిని చూచినంతనే ఆహ్లాదము కలుగునో అతఁడు ప్రియదర్శనుడు. ఇతనివలె లోకములో ప్రియదర్శనుఁడు మఱియొకఁడు లేఁడు, అని ఎవనినిగూర్చి చెప్పుటకు వీలగునో అతఁడు ఏకప్రియదర్శనుఁడు. ఇందులకు సౌందర్యము చాలవఱకు కారణ మని చెప్పవచ్చును. దీనినే నారదుఁడు పూర్ణచంద్రునివలె ప్రియదర్శనుఁడై యున్నాఁడని (సోమవత్ప్రియదర్శనః) చెప్పినాఁడు. భూతదయగలిగిన మహాత్ములచూపులలో ప్రేమతరంగములు ప్రసరించుచుండును. అందువలన వారిదర్శనము అత్యంతము ప్రియముగా నుండును. నారదుఁడు రామునియందలి సౌందర్యలక్షణముల నన్నింటిని చెప్పి, లక్ష్మీవంతుఁడు శుభలక్షణుఁడు అను విశేషములచేతశీలసౌందర్యమును గూడ సూచించెను.

శ్లో॥ సమ స్సమవిభక్తాంగ స్స్నిగ్ధవర్ణః ప్రతాపవాన్!
పీనవక్షా విశాలాక్షో లక్ష్మీవాన్ శుభలక్షణః॥

బాల-సర్గ-1 శ్లో. 11

ఆత్మవంతుఁ డగుట పంద్రెండవగుణము. ఆత్మ యనఁగా ధైర్యమనియు అర్థము కలదు. ఆత్మవంతుఁ డనగా ధైర్యశాలి యని తనసామర్థ్యమునందు విశ్వాసముకలవాఁ డనియు చెప్పవచ్చును. దండకారణ్యమున ఋషులు రామునియొద్దకు వచ్చి రాక్షసుల వలన తమకు కలుగుచున్న బాధలను చెప్పుకొనిరి. ఆరాక్షసులను గూర్చి ఏమియు అడుగకుండ వారి నందఱను సంహరింతునని రాముఁడు ప్రతిజ్ఞచేసెను, ఆ రాక్షసులు ఎంతమంది యున్నారో, ఎంతబలము కలవారో, మొదలగు సందేహము లేమియు ఆయ నకు గలుగలేదన్నచో ఆయనకుఁగల యాత్మవిశ్వాస మెట్టిదో మనము గ్రహింపవచ్చును.

జిత క్రోధత్వము పదుమూఁడవగుణము. జితక్రోధత్వ మనఁగా క్రోధమును జయించుట; అనఁగా అసలు కోపము లేకుండుట కాదు; కోపమును వశమందుంచుకొనుట; దానికి లోఁబడకుండుట. సామాన్యులు కోపమునకు లొంగిపోవుదురు. మహాత్ములకు కోపము లొంగియుండును. తల్లి తండ్రి ఆచార్యుఁడు మొలదగువారివిషయ మున ఏసందర్భమునందును కోపము రాకుండుట జితక్రోధత్వము నకు ముఖ్యలక్షణము. రాముఁడు అడవులకు బయలుదేరునపుడు అందఱును కైకపై కోపించి నిందించిరి. రాముఁడు మాత్రము లేశము కూడ కోపము నొందక ఆమెకు ప్రియమును కలిగించుటకే ప్రయత్నించెను.

శ్లో॥ స జగామ వనం వీరః ప్రతిజ్ఞా మనుపాలయన్।
పితుర్వచననిర్దేశాత్ కైకేయ్యాః ప్రియకారణాత్॥
బాల-సర్గ-1 శ్లో. 24

ద్యుతిమంతుఁ డగుట పదునాల్గవగుణము. ద్యుతిమంతుఁ డనగా వర్చస్సు కలవాఁడు. దుర్జనులకు వెఱపును కలిగించునట్టి తేజము వర్చస్సు, సజ్జనులకు మాత్రమది ప్రియముగనే యుండును.

అనసూయకుఁ డగుట పదునైదవగుణము. ఇతరులగుణములందు దోషముల నారోపించుట అసూయ. అసూయ లేనివాఁడు అనసూయకుఁడు. ఎన్నియో లోపములున్న వాలినిగూర్చి గాని, రావణుని గూర్చి గాని రాముఁ డెప్పుడును నిందింపకుండుట గమనింపఁదగియున్నది.

రోషము వచ్చినచో దేవతలకు కూడ భయము కలుగుట పదునాఱవగుణము. "దేవతలకు కూడ" అటనువలన రాక్షసులకును భయము కలుగు ననియే అర్థము. రావణునకు కోపము వచ్చినచో దేవతలు రాక్షసులును భయపడుచుండిరి. అట్టి రావణుఁడు ఖరదూషణత్రిశిరసులను పదునాలుగువేలమంది రాక్షసులును డెబ్బదిరెండు నిముసములలో రాముఁ డొక్కఁడే సంహరించె నని విన్నంతనే తల్లడిల్లిపోయెను; కావుననే మారీచుని ప్రయోగించి రాముని వంచించెను; లేకున్నచో ఖరాదులవలె ఏల రామునితో యుద్ధము చేయలేదు. కావున రావణుఁడు రామునకు భయపడె ననుట స్పష్టము. ఇంక దేవతలు రామునకు భయపడుదు రనిన చెప్పవలసిన దేమున్నది? కావుననే రావణసంహారము జరిగినంతనే వారందఱును రాముని పూజించిరి.

శ్లో॥ బభౌ రామ స్సంప్రహృష్టః పూజిత స్సర్వదైవతైః॥
బాల-సర్గ-1 శ్లో, 83



# 2. వేదసమ్మితత్వము

వాల్మీకిప్రశ్నకు సమాధానముగా నారదమహర్షి శ్రీరామచంద్రునిగుణములను పెక్కింటిని పేర్కొని, జరిగిన వృత్తాంతమును సంగ్రహముగా చెప్పి, లోకము మిగుల సంతోషముతో నుండెనని రామరాజ్యమును వర్ణించి, రాముఁడు అశ్వమేధశతములను నిర్వహించుచు 11 వేలసంవత్సరములు రాజ్యము నుపాసించి బ్రహ్మలోకమున కేగు నని భవిష్యద్వృత్తాంతమును ఉద్ఘాటించి పలశ్రుతితో ముగించెను. ఆయన ఫలశ్రుతి నిట్లు చెప్పినాఁడు "ఇది పవిత్రము, పాపములను హరించును, పుణ్యమును కలిగించును, వేదములతో సమానమైనది. రామచరితమును పఠించువాఁడు, సకలపాపములనుండి విముక్తుఁ డగుచున్నాఁడు".

శ్లో॥ ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితమ్।
యః పఠేద్రామచరితం సర్వపాపైః ప్రముచ్యతే॥

బాల-సర్గ-1. శ్లో॥ 98

పవిత్ర మనఁగా చిత్తశుద్ధిని గలిగించునది; అనఁగా తెలియక చేసినపాపములను హరించునది. తెలిసి చేసినపాపములను హరించునది పాపఘ్నము. ఇవి యీజన్మకు సంబంధించినవి. "సకలపాపములనుండి అనుటవలన పూర్వజన్మలలో చేసినపాపములనుండియును విముక్తుఁ డగు నని యర్థము. పుణ్య మనఁగా ఈ లోకమున పరలోకమునను సుఖమును కలిగించునది.

అప్పటికి వాల్మీకి రామాయణమును రచింపలేదు. కావున "ఇది పవిత్రము" అని చెప్పినప్పుడు ఈఫల మంతయు ఈసంక్షేప రామాయణ పఠనమువలననే కలుగు నని గ్రహింపవలసియున్నది.

మఱి దీని కింతఫల మెట్లు కలిగినది? ఇది వేదములతో సమాన మైనది. కావున దీని కింత ఫలము కలుగుచున్నదని నారదమహర్షి స్ఫురింపఁ జేయుచున్నాఁడు. ఇది ఏయొక్క వేదముతోఁగాక వేద ములతో సమానము "వేదైశ్చ సమ్మితమ్" అని ఆయన చెప్పుట గమనింపఁదగియున్నది.

ఇది వేదములతో నెట్లు సమానమగును అన్న విషయమును సావధానముగ వివరముగ మనము గ్రహింపవలసియున్నది. వేద ముల యొక్క యర్థ మంతయు దీనియం దున్నచో ఇది వేదము లతో సమానమగును. ఇంతచిన్న సంక్షేపరామాయణమును వేదార్థ మంతయు నెట్లు ఇముడును? వేదార్థ మనఁగా సకలవేదములకు సారభూతమైన తాత్పర్యము. అట్లయినను, సకలవేదములకు సార మైన తాత్పర్యము ఇది, అని ఎక్కడైన నిరూపింపఁబడి యున్నదా? తైత్తిరీయోపనిషత్తు నందు పంచకోశవివరణమున మనోమయకోశ మును వర్ణించునప్పుడు, ఆ కోశమునకు పురుషరూపకల్పనము గావింపఁబడినది. ఆ కోశమునకు యజుర్వేదము శిరస్సుగా ఋగ్వే దము కుడిచేయిగా, సామవేదము ఎడమచేయిగా, అధర్వణవేదము పుచ్ఛముగా, అనఁగా శరీరమున క్రిందిభాగముగా, చెప్పబడినది. కావున సకలాంగములలో శిరస్సువలె సకలవేదములలో యజు ర్వేదము ప్రధానమైన దన్నమాట. వేదములకు ఉపనిషత్తులు శిర స్సులు. కావున యజుర్వేదములో కూడ తైత్తిరీయోపనిషత్తు ప్రధా నము. అట్టి తైత్తిరీయోపనిషత్తులో శిక్షావల్లియందు ఏకాదశానువాక మున ధర్మానుశాసనము కలదు. వేదాధ్యయనము పూర్తియైనతరు వాత, వేదములయందలి సారమును ఆచార్యుఁడు శిష్యునకు ఈ ధర్మానుశాసనరూపమున ఉపదేశింపవలయును. ఈయను

శాసనమునకు ముగింపులో "ఇదిఆదేశము; ఇది వేదరహస్యము. ఇదియనుశాసనము; ఇట్లు ఉపాసింపఁదగినది" అని చెప్పఁబడియున్నది, ఇచ్చట శ్రీ శంకర భగవత్పాదులవారు "ఇది వేదార్థము; ఇది ఈశ్వరవచనము; లేక ప్రమాణభూతములైన యన్నింటికిని ఇది అనుశాసనము;" అని భాష్యమున నుద్ఘాటించినారు. ఇట్లే శ్రీశంకరానందులవారు కూడ దీపిక యను వ్యాఖ్యానమునందు వేదముచే విధింపఁబడుటవలన, స్నేహపూర్వకముగా ఉపదేశింపఁబడుటవలన, వేదసార మగుటవలన, దీని నాచరింపకున్నచో దుఃఖము కలుగును కావున, ఈధర్మానుశాసనమును జీవించియున్నంతవఱకు లేదా బ్రహ్మజ్ఞానము కలుగువఱకును నిత్యము అనుష్ఠింప వలసినదే" అని చెప్పిరి.

ఇంక సకలవేదసారమైన యీ ధర్మానుశాసనమునందలి విశేషములను తెలిసికొని అవి నారదమహర్షిచెప్పిన శ్రీరాముని చరిత్రయందు ఎట్లు సమన్వయించుచున్నవో గ్రహింపవలసియున్నది. శిష్యునకు వేదమును సమగ్రముగ బోధించి అతనిని గురుకులమునుండి పంపునప్పుడు, అతఁడు జీవితములో అవలంబింపవలసిన ముఖ్యధర్మములను, సకలవేదసారములైనవానిని, ఆచార్యుఁడు ఇట్లు ఉపదేశించును.

(1) సత్యం వద - సత్యమును చెప్పుము-ఇది మానవులు అవలంబింపవలసిన నియమములలో శ్రేష్ఠమైనది. కావుననే దీనికి అగ్రస్థాన మీయఁబడినది.

(2) ధర్మం చర – ధర్మమును ఆచరింపుము. బ్రాహ్మణ క్షత్రియాదివర్ణములకు బ్రహ్మచర్యము మొదలగునాశ్రమము లకు ఏధర్మములను వేదము విధించుచున్నదో వానిని ఆచరింప వలయును.

(3) స్వాధ్యాయా న్మా ప్రమదః - స్వాధ్యాయమునందు పొరపడకుము-నియమపూర్వకముగ నేర్చుకొన్న వేదమును నిత్యము పారాయణము చేయుచు చక్కఁగా నిలుపుకొనవలయును. ఆవిష యమున పొరపాటుపడరాదు. వేదాధికారము లేనివారు రామా యణభారతాది గ్రంథములను నియమముఃతో పఠించుచుండుటయు స్వాధ్యాయముతో సమానమేయగును.

(4) ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతనుం మా వ్యవచ్ఛేత్సీః - ఆచార్యునకు ఇష్టమైనధనమును తెచ్చియిచ్చిన పిమ్మట వంశవిచ్ఛేదము కాకుండ గృహస్థాశ్రమము నవలం బింపుము.

(5) సత్యా న్న ప్రమదితవ్యమ్–సత్యమును చెప్పువిషయ మున పొఱపాటుపడకుము-గురుకులమందున్న బ్రహ్మచారికి లోక వ్యవహారముతో అంతగా సంబంధ ముండదు. కాని గృహస్థుఁ డయిన తరువాత వ్యవహారము తప్పదు. అప్పుడు సత్యమును జాగరూకతతో కాపాడుకొనవలసియుండును.

(6) ధర్మా న్న ప్రమదితవ్యమ్ – ధర్మమువిషయమున పొరపాటుపడకుము-సుఖమునందలిలోభముఃతో ధర్మమును అతి క్రమింపరాదు. ధర్మము తెలియక సందేహము కలిగినప్పుడు పెద్దల నడిగి తెలిసికొని ఆచరింపవలయును.

(7) కుశాలా న్న ప్రమదితవ్యమ్-ఆత్మరక్షణవిషయమున, ఆరోగ్యమునందును ఏమఱుపాటు పనికిరాదు.

(8) భూత్యై న ప్రమదితవ్యమ్-పొందఁదగినసంపదలను అభ్యుదయములను మిథ్యావిరక్తితోఁ గాని, సోమరితనముచేఁ గాని ఉపేక్షింపరాదు.

(9) స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్—అభ్యసించిన వేదమును ప్రతిదినము ఆవృత్తిచేసికొనుచుండుట స్వాధ్యాయము. దానిని శిష్యులకు చెప్పుట ప్రవచనము. ఈరెండింటియందును పొరపడరాదు. ఆత్మరక్షణము, ఆరోగ్యము, ధనసంపాదనము మొదలగు విషయములందలి యాసక్తివలన ప్రమాదము సంభవించునేమో యని స్వాధ్యాయమును గూర్చి శ్రుతి మరల హెచ్చరించుచున్నది.

(10) దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యమ్-యజ్ఞయాగాదులు దేవకార్యములు. శ్రాద్ధాదులు పితృకార్యములు. లోకవ్యవహారమునందు ఎంతగా నిమగ్నుఁడైయున్నను ఎవ్వడును ఈ వైదిక కార్యములను ఉపేక్షింపరాదు.

వీనియందు "న ప్రమదితవ్యమ్" అని పలుమాఱులు విధింపఁబడియున్నది. వేదముచే విహితములైనకర్మలను మానరాదనియే ఈ హెచ్చరికకు తాత్పర్యము.

ఇంక ఉపాసనము విధింపబడుచున్నది.

(11) మాతృదేవో భవ — ఎవనికి తల్లియే దేవతయో అతఁడు మాతృదేవుఁడు. నీవు అట్టివాఁడ వగుము. రుద్రవిష్ణువినాయకాది దేవతలనెట్లు లోకులు పూజింతురో అట్లు నీవు తల్లిని పూజింపుము

(12) పితృదేవో భవ – ఎవనికి తండ్రియే దేవుఁడో వాఁడు పితృదేవుఁడు. నీవు అట్టివాఁడ వగుము.

(13) ఆచార్యదేవో భవ – ఆచార్యుని దేవునిగా భజింపుము.

(14) అతిథిదేవో భవ – దేవుని పూజించునట్లే అతిథిని అర్చింపుము.

(15) యా న్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని: నో ఇతరాణి – తల్లిని తండ్రిని ఆచార్యుని అతిథిని దేవునివలె పూజింపవలయు ననఁగా వారు గుణహీనులైనను పూజార్హు లనియే గ్రహింపవలయును. మఱి వీరియందు శాస్త్రవిరుద్ధమైన ఆచరణము కన్పించుచున్నచో ఏమిచేయవలె? పూజార్హులు కదా యని వీరి యాచరణమును అనుసరింపవచ్చునా అను సందేహమునకు సమాధానముగా ఈ వాక్యము చెప్పఁబడుచున్నది. వీరియందున్న పరిశుద్ధములైన కర్మలనే అనుసరింపవలయును. దుష్టములైన వానిని అవలంబింపరాదు.

(16) యా న్యస్మాకగ్ం సుచరితాని తాని త్వయోపాస్యాని; నో ఇతరాణి – మాయందలి మంచినడవడికలనే నీవు సేవింపవలయును. ఇతరలను అనఁగా శాస్త్రవిరుద్ధములైనకర్మలను సేవింపరాదు.

(17) యే కే చాస్మచ్ఛ్రేయాగ్ంసో బ్రాహ్మణాః తేషాం త్వయాఽఽసనేన ప్రశ్వసితవ్యమ్ – పెద్దలైన బ్రాహ్మణులు వచ్చినప్పుడు ఆసన మొసంగి వారికి బడలికపోవునట్లు ఉపచారములు గావింపవలయును. ఇందు "ఆసనే న ప్రశ్వసితవ్యమ్" అని కొందఱు విభజించి, పెద్దలు కూర్చుండి ఏదేని విషయమును చెప్పు

చున్నప్పుడు నిట్టూర్పు లేకుండి శ్రద్ధతో వినుచుండవలయును. అని కూడ అర్థము చెప్పుదురు.

(18) శ్రద్ధయా దేయమ్ - యోగ్యులైనవారి కేదేని ఇచ్చునప్పుడు శ్రద్ధతో ఈయవలయును.

(19) అశ్రద్ధయా అదేయమ్-అశ్రద్ధతో ఏదియు ఈయరాదు. అశ్రద్ధతో ఇచ్చినచో వస్తువు నష్టమగుటయే కాని దానమునకు ఫలముండదు. శ్రద్ధలేకుండి ఇచ్చుటకన్న ఈయ కుండుటయే మేలు.

(20) శ్రియా దేయమ్-తనకున్న సంపదకు తగినట్లుగా దానము చేయవలయును. శక్తివంచన చేయరాదు.

(21) హ్రియా దేయమ్-ఎంతో ఈయవలసియుండగా ఇంతకన్న ఈయలేకపోవుచున్నాను గదా యని సిగ్గుతో, అనగా నమ్రతతో ఈయవలయును.

(22) భియా దేయమ్ - పూజ్యులైనవారికి ఇచ్చునప్పుడు ఏమైనలోపము కలుగునేమో అను భయముతో ఈయవలయును.

(23) సంవిదా దేయమ్ - సమానులకు ఇచ్చునప్పుడు మైత్రితో ఈయవలయును.

దానము ఉపాసనలో ముఖ్యమైనయంశము. దేవతలను ఉపాసించునప్పుడు, అనగా పూజించునప్పుడు, శక్తికొలదిగా ఎట్లు పదార్థములను నివేదింతుమో, అట్లే తల్లి తండ్రి మొదలగు వారిని ఉపాసించునప్పుడు కూడ వారి కిష్టములైన పదార్థములను యథాశక్తిగా సంపాదించి శ్రద్ధతో నొసగవలయును.

ఇంక యజ్ఞయాగాదికర్మలవిషయమునఁ గాని, ఇతరులతో వ్యవహరించునప్పుడు గాని ఎట్లు వర్తింపవలయును అను ధర్మ సందేహము కలిగినప్పుడు ఏమిచేయవలయును అను ప్రశ్నకు సమాధానముగా క్రిందివాక్యము చెప్పఁబడుచున్నది.

(24) అథ యది తే కర్మవిచికిత్సా వా వృత్తవిచికిత్సావా స్యాత్, యే తత్ర బ్రాహ్మణా స్సంమర్శినః, యుక్తా అయుక్తాః అలూక్షా ధర్మకామా స్స్యుః, యథా తే తత్ర వర్తేరన్ తథా తత్ర వర్తేథాః - ఇంక నీకు శ్రౌతస్మార్తకర్మలయందుఁ గాని, ఆచార విషయమునఁ గాని సందేహము కలిగినచో స్వతంత్రులు క్రూరత్వము లేనివారు, ధర్మకామమును కోరువారు, ధర్మాధర్మములను విమర్శింపగల సమర్థులును అగు బ్రాహ్మణులు ఆకర్మలయందుఁ గాని, ఆ యాచారమునఁగాని పూనికతో ఎట్లు వర్తించుచున్నారో నీవును అట్లే వర్తింపుము.

(25) అథా భ్యాఖ్యాతేషు, యే తత్ర బ్రాహ్మణా స్సంమర్శినః యుక్తాః అయుక్తాః అలూక్షా ధర్మకామా స్స్యుః, యథా తే తేషు వర్తేరన్ తథా తేషువర్తేథాః-లోకముచేత నిందింపఁబడుచున్నవారివిషయమున స్వతంత్రులు క్రూరస్వభావములేనివారు, ధర్మమును కోరువారును అగు బ్రాహ్మణులు ఎట్లు వర్తింతురో అట్లే నీవును వర్తింపుము.

ఇది ధర్మానుశాసనము, ఇదియే సకలవేదసారము. ఇచ్చట నొకసందేహము కలుగవచ్చును. వేదములకు పరమ తాత్పర్యము తత్త్వజ్ఞాన మనుట సుప్రసిద్ధము. మఱి పైయనుశాసనమున దాని ప్రశంసయేలేదు. ఇది యెట్లు వేదసార మగును? ఇది తైత్తిరీయోపనిషత్తులో నొకభాగము. ఆ ఉపనిషత్తులో ముఖ్య

మైనవిషయము తత్త్వజ్ఞానమే. అట్టి ముఖ్యవిషయమీ యను శాసనమునందు ఏల ప్రశంసింపఁబడ లేదు? దీనిని చక్కగా ఆలోచించినచో వేదముయొక్క అభిప్రాయమును మనము ఇట్లు గ్రహింపవచ్చును. తీర్థమునకో క్షేత్రమునకో, యజ్ఞశాలకో శిష్యులను గొనిపోవునుపాధ్యాయుఁడు వారి నందఱను దారి తప్పకుండ తనవెంట నడిపించుకొనిపోవునే కాని అచ్చట జరుగుచున్న యుత్సవమునుగూర్చి వర్ణింపఁబూనుకొనఁడు. ఆ మార్గమున నడచి అచ్చటికి వారు చేరినతరువాత వారే స్వయముగా ఆ యుత్సవమును చూచి అందు పాల్గొని ఆనందింపఁగలరు. దానినిగూర్చి ఆయన ముందుగా ఏమియు చెప్పనక్కఱలేదు. ఎవఁడైన నొకవిద్యార్థి ఆవిషయమై అడిగినను "పోవుచున్నాము గదా! తొందఱ ఏమి? దిక్కులుచూడకుండ నావెంటరమ్ము, నీవే చూడఁగలవు" అని ఆయన సమాధానముచెప్పనే గాని ఆయుత్సవమునుగూర్చి చర్చించుచు కాలక్షేపముచేయుటకు నిచ్చగింపఁడు. అట్లే వేదముకూడ మానవజీవితమునకు పరమగమ్యమైన యాత్మజ్ఞానమును పొందుటకు మార్గమైన ధర్మానుష్ఠానమును నిర్దేశించుచున్నది; ఆ మార్గమున మజిలీవంటివే ఉపాసనలు. వేదవిహితములైనకర్మల నాచరించుచు, పెద్దలను దేవతలను ఉపాసించుచున్నచో ఎవ్వనికైనను ఒకప్పటికి తప్పక తత్త్వమును గూర్చి తెలిసికోవలయు నను కోరిక కలుగును. అప్పు డాతఁడు సహజముగ మరల ఆచార్యుని యొద్దకే వచ్చి ప్రశ్నించి తత్త్వమును తెలిసికొని జీవన్ముక్తుఁడగును. నిర్మలాంతఃకరణము,తీవ్రమైనజిజ్ఞాస, ఆత్మజ్ఞానమునకు ఆవశ్యకములు, అవి కర్మానుష్ఠానముతోఁగూడిన యుపాసనము వలననే సిద్ధించును. భూమి లోపలనున్న నీరు కావలసియున్నప్పుడు బావిని త్రవ్వుచుమట్టిని తీసివేయుటకే ప్రయత్నింపవలయును. మట్టిని తీసివేసినంతనే లోపలనున్న జలము ప్రత్యక్షమ

గును. జలములోపల ఎప్పుడును సిద్ధముగనే యున్నది. దానికై ప్రత్యేకప్రయత్నము అక్కఱలేదు. అట్లే ఆత్మయును నిత్యసిద్ధమే. దానిని పొందుటకై ప్రయత్నమే అక్కఱలేదు. దానిని ఆవరించి యున్న వాసనలు, అజ్ఞానము తొలఁగినచో అది వెంటనే సాక్షాత్కరించును. కావుననే వేదము వాసనలు క్షీణించి తత్త్వజిజ్ఞాస కలుగుటకు మార్గముగా ధర్మానుశాసనమును విధించుచున్నది. కావున ఈధర్మానుశాసనమే సకలవేదసార మనుట నిశ్చితము.

ఈ ధర్మానుశాసన మంతయు ఇంచుమించుగా నారద మహర్షి చెప్పిన శ్రీరామునిచరిత్రయందు సమన్వయించుచున్నది. తండ్రియిచ్చిన మాటను నెరవేర్చుటకై, కైకేయికి ప్రీతిని కలిగించుటకై తాను గావించిన ప్రతిజ్ఞ ననుసరించి శ్రీరాముఁడు అడవికి వెళ్లెను. కావున శ్రీరాముని వర్తనమున సత్యపాలనము. ధర్మమును ఆచరించుట, తల్లిదండ్రులను దేవతలనుగ ఉపాసించుట అను లక్షణములు సమన్వయించుచున్నవి.

మారీచ సుబాహువులను సంహరించి యజ్ఞమును రక్షించుటవలన ఆచార్యుఁడైన విశ్వామిత్రునకు ప్రియమైన గురుదక్షిణను శ్రీరాముఁడిచ్చెననుట స్పష్టము. యజ్ఞరక్షణము, సీతావివాహము పెద్దలయాదేశము ననుసరించి జరిగినవే కాని రాముఁడు స్వతంత్రుఁడై ఆచరించినవి కావు. అందువలన నారదమహర్షి ఆకథను ప్రత్యేకముగా చెప్పక వాల్మీకియొక్క ఊహకే వదలెను. కోట్లకొలఁదిగా గోవులను, అపరిమితమైన ధనమును, విధిపూర్వకముగా విద్వాంసుల కొసంగుచు రాజవంశములను శతగుణముగా శ్రీరాముఁడు స్థాపింపఁగలఁడు, అని చెప్పుటవలన "శ్రద్ధతో నీయవలయును" అను మొదలగు దానవిధులును, వంశము నభివృద్ధి నొందించుట అను లక్షణమును సమన్వయించుచున్నవి.

శ్లో॥ గవాం కోట్యయుతం దత్వా విద్వద్భ్యో విధిపూర్వకమ్।
అసంఖ్యేయం ధనం దత్వా బ్రాహ్మణేభ్యో మహాయశాః॥

శ్లో॥ రాజవంశాన్ శతగుణాన్ స్థాపయిష్యతి రాఘవః।
బాల-సర్గ-1-శ్లో. 95, 96

భరతుఁ డెంత ప్రార్థించినను తండ్రివచనమును స్మరించి శ్రీరాముఁడు రాజ్యము నంగీకరింపలేదు. కావున సత్యమునెడల, ధర్మము నందును పొరపాటుపడకుండుట అను లక్షణములు సమన్వయించు చున్నవి.

అగస్త్యుని వచనమువలన ఇంద్రునినుండి సంక్రమించిన ధనుస్సును పరిగ్రహించెను అనుటవలన క్షత్రియులకు పరిగ్రహము అనుచితమైనను ధర్మజ్ఞుఁడైన,మహర్షివచనము ననుసరించి శ్రీరాముఁడు ఆ వింటిని గైకొనెనని స్పష్టమగుచున్నది. దీనివలన "నడవడికయందు సంశయము కలిగినచో స్వతంత్రులు ధర్మజ్ఞులు నైన బ్రాహ్మణుల ననుసరింప వలయును." అనులక్షణము సమన్వయము నొందుచున్నది.

శ్లో॥ అగస్త్య వచనాచ్చైవ జగ్రాహైంద్రం శరాసనమ్।
బాల-సర్గ-1 శ్లో. 42

దండకారణ్యావాసులు అగ్నిసమానులునైన ఋషుల సమక్షమున రాక్షసులను రణమునందు వధింతు నని రాముఁడు ప్రతిజ్ఞ చేయుటవలన, దుష్టులైనవారివిషయమున శిష్టులయభిప్రాయ మెట్లుండునో అట్లు వర్తింపవలయునను లక్షణము సమన్వితమగుచున్నది.

శ్లో॥ ప్రతిజ్ఞాత శ్చ రామేణ వధ స్సంయతి రక్షసామ్।
ఋషీణా మగ్నికల్పానాం దండకారణ్యవాసినామ్॥
బాల-1 సర్గ-శ్లో. 45

సీతారక్షణమునకై శూర్పణఖను శిక్షించి ఖరాదులను సంహరించుటవలన రాముఁడు కుశలమువిషయమున జాగరూకుఁడై యుండెననుట స్పష్టము. సుగ్రీవుని మిత్రునిగా చేసికొని వాలిని సంహరించి కిష్కింధారాజ్యమును సుగ్రీవున కొసంగుట వలన రాముఁడు భూతివిషయమున అనఁగా అభ్యుదయమునందు ఏమఱుపాటు లేకుండె ననుటస్పష్టము; రావణసంహారము కుశలమునకు సంబంధించినదే. అగ్నిదేవుని మాటవలన సీతను విగతకల్మషనుగా తెలిసికొని రాముఁడు పరిగ్రహించుటవలన, "ధర్మమునందుఁ గాని, వర్తనమునందుఁ గాని సందేహము కలిగినచో స్వతంత్రులు ధర్మజ్ఞులును అయినవారి వచనమును ప్రమాణముగా గ్రహింపవలయు" ననునంశము సమన్విత మగుచున్నది.

శ్లో॥ తతోఽగ్నివచనా త్సీతాం జ్ఞాత్వా విగతకల్మషామ్॥
బాల—సర్గ-1 శ్లో. 83

ఇట్లే రాముఁడు రాజ్యము నుపాసించి బ్రహ్మలోకము నొందుచున్నాఁడు, అనుటచేత క్షత్రియులకు తల్లిదండ్రులతోపాటు రాజ్యపాలనము కూడ దేవతవలె ఉపాసింపఁదగిన దనియు ఆ యుపాసనము బ్రహ్మలోకమునకు చేర్చు ననియు వ్యక్తమగుచున్నది.

ఈ విధముగా ధర్మానుశాసనమునందు పేర్కొనఁబడిన ముఖ్యములైన విధులన్నియు ఇంచుమించుగా నారదమహర్షి చెప్పిన శ్రీరాముని చరిత్రమునందు ప్రత్యక్షముగనే సమన్వయిం

చుచున్నవని చెప్పవచ్చును. ఇట్లు వేదసారము ఇందు నిక్షేపింపఁబడుటచే ఈ బాలరామాయణము వేదసమ్మిత మయ్యెను.

ఈచర్చవలన ఈ సంక్షేపరామాయణమున వేదములలోని కర్మకాండ ఉపాసనకాండ విషయములను సారసంగ్రహరూపమున ప్రతిపాదింపఁబడినను జ్ఞానకాండవిషయము కొలఁదిగనైనను ప్రతిపాదింపఁబడలేదని స్పష్టమగుచున్నది. నిజమే. ఇందు తత్త్వము ఎచ్చటను ఉపదేశింపఁబడలేదు. ఈసంక్షేపమునందే కాదు, తరువాత రామాయణమునందును భగవద్గీతవంటి ఘట్టములు కన్పింపవు. అంతమాత్రమున ఇందు తత్త్వోపదేశము అసలే లేదని తలంపరాదు. ధర్మతత్త్వములను ఉపదేశించునప్పుడు వేదములు ప్రభువువలె శాసింపఁగా, పురాణేతిహాసములు మిత్రునివలె ఉదాహరణములతో బోధింపఁగా, కావ్యములు ప్రియురాలివలె సరసముగా వ్యక్తముచేయుచున్నవి. రామాయణమునందు ఈ పద్ధతియే అవలంబింపఁబడినది.

విషయమును బోధించుటయందు వాచ్యముకన్న, అనఁగా సూటిగా చెప్పుటకన్న, వ్యంగ్యమార్గమున స్ఫురింపఁజేయుటయే మనోహరమై పటిష్ఠముగ నుండును. ఒక్క ఉదాహరణమును గమనింపుఁడు. నలుఁడు అడవియందు దమయంతిని వదలిపెట్టి పోయినతరువాత, ఆమె నిద్రలేచి నలుని గానక, "తన యేకాకిత్వంబునకు నబలాభావంబునకుఁ బ్రతిపదన్యాసజాయమానకంటకమృగపన్నగభయంబునకు వగవక నిజనాథునసహాయత్వంబునకు దుస్సహక్షుత్పిపాసాపరవశత్వంబునకు వగచుచు" నుండెనని నన్నయభట్టారకుఁడు వర్ణించెను, (అరణ్యపర్వ-ఆశ్వా.2-వచ. 83) ఆ స్థితిలో దమయంతి నేను "అబలను; ఒంటరిదానను అడుగు

తీసి అడుగుపెట్టినచో మృగములు, ముండ్లు, పాములు తటస్థించును. దేనివలన నేమి యాపదకలుగునో” అని దుఃఖము నొందలేదఁట. అడవిలో తన్ను వంచించి ఒంటరిగా వదలివెళ్ళినభర్తపై ఆమెకు కోపము రాలేదు. అంతేకాదు, “ఆయనవెంట ఇప్పటివఱకును నేనుంటిని. ఇంక అయనకు తోడై ఎవ్వరుందురు? ఆయనకు ఆఁకలిదప్పికలు కలిగినప్పుడు ఎవ్వరు విచారింతురు?” అనియే అమె దుఃఖింపఁ జొచ్చినదట. దీనివలన ఆమె భర్తను దేవునివలె ఎంత గాఢముగ ఉపాసించుచున్నదో మనకు మనస్సులకెక్కునట్లుగా, “దమయంతి పతివ్రత; మహాపతివ్రత” అని వాచ్యముగా ఎన్నిమాఱులు చెప్పినను ఆ పాతివ్రత్య మెట్టిదో మనకు బోధపడదు.

తత్త్వోపదేశమందును ఈ వ్యంగ్యవిధానమే ఉత్తమపద్ధతి. ఉపనిషత్తులందును ప్రధానముగా ఇదియే అవలంబింపఁబడినది. నారదమహర్షికి సనత్కుమారుఁడు తత్త్వము నిట్లే యుపదేశించెను. ఛాందోగ్యోపనిషత్తునందు సప్తమాధ్యాయమున ఈవృత్తాంతము కలదు. నారదుఁడు సనత్కుమారునియొద్దకు పోయి, “భగవానుఁడా! బ్రహ్మమును బోధింపు”మని ప్రార్థించెను. “నీ వింతవఱకును తెలిసికొన్న దేమో చెప్పుము. పైవిషయమును చెప్పెదను” అని సనత్కుమారుఁడు పలికెను. నారదుఁడు, “నాలుగు వేదములు, ఇతిహాసపురాణములు, వ్యాకరణము, శ్రాద్ధకల్పము, గణితము, ఉత్పాతవిజ్ఞానము, నిధిశాస్త్రము, తర్కము, నీతిశాస్త్రము, నిరుక్తము, శిక్ష, ఛందఃకల్పశాస్త్రములు; ధనుర్వేదము, జ్యౌతిష్యము, సర్పవిద్య, గంధయుక్తి, నృత్యగీతవాద్యశిల్పాదివిజ్ఞానమును అధ్యయనమొనర్చితిని” అని చెప్పెను. ఇది యంతయు నామమే, దీనినే బ్రహ్మమునుగా ఉపాసింపుము” అని

సనత్కుమారుఁడు పలికెను. నారదుఁడు, "నామముకన్న మించి నది కలదా? అని యడుగఁగా ఆయన, నామమును మించినది వాక్కు, దానిని బ్రహ్మమునుగా ఉపాసింపుము" అనెను. ఇట్లు ఒకదానికంటె నొకటి మించినదిగా నారదుఁ డడుగుచుండఁగా ఆయన చెప్పుచునేయుండెను. ఇట్లు నారదుఁడు పెక్కుపర్యాయము లడిగిన తరువాత, తుదకు సనత్కుమారుఁడు, దేనియందున్నవాఁడు అన్యమును చూడఁడో, అన్యమును వినఁడో, అన్యమును దెలిసికొనఁడో, అదియే భూమము; అదియే అమృతము; అదియే సర్వమున కాధారము. ఇది యంతయు ఆత్మయే యని యెఱింగినవాఁడు ఆత్మానందుఁ డగును" అని యుపదేశించెను.

ఈ యాఖ్యాయికయందు ఒక సందేహము కలుగవచ్చును. నారదుఁడు నాలుగువేదములను అధ్యయన మొనర్చితి నని సనత్కుమారునితో చెప్పుచున్నాఁడు. ఛాందోగ్యోపనిషత్తు సామవేదములో నున్నది. తనకును సనత్కుమారునకును జరిగిన సంవాదమును ముందుగానే నారదుఁడు సామవేదమున ఎట్లు అధ్యయనము చేసియుండును? లేక నారదుఁడు అధ్యయనము గావించిన సామవేదమునందు ఈప్రకరణమే లేదా? ఈసందర్భమున ఒకముఖ్యవిషయమును గ్రహింపవలసియున్నది. శ్రీశంకర భగవత్పాదులవారు ఉద్ఘాటించినట్లు వేదములలోని యాఖ్యాయికలన్నియు ప్రరోచనార్థములే. అనఁగా ఒకానొకధర్మమునో తత్త్వవిశేషమునో నిరూపించుచు, వానియందు రుచిని కలిగించుటకొఱకు వేదమాత చెప్పుచున్నకథ లనియే వానిని మనము గ్రహింపవలయును. వానిని జరిగిన సంఘటనములనుగా చరిత్రలుగా భావింప రాదు. బిడ్డకు అన్నమును తినుపించునప్పుడు, మందును త్రాగించునప్పుడు ఎన్నోకథలను తల్లిచెప్పును. అవి యన్నియు

యథార్థములు కానక్కఱ లేదు. అట్లేశాస్త్రవిషయములందు ఉదహరింపబడువిషయములను కూడ యథార్థములనుగా గ్రహింపము. గణితశాస్త్రమునందు. "రాముఁడు ఒక తోటకు ఒక గంటలో నీరు పెట్టఁగలఁడు. కృష్ణుఁడు ఆపనిని అరగంటలోనే చేయఁగలఁడు. ఇరువురు కలిసి పనిచేసినచో ఆపని ఎంతసేపటిలో పూర్తి యగును?" అని లెక్కను చెప్పునప్పుడు, అందులోని రాముఁడు కృష్ణుఁడు యథార్థముగ లోకములోనివ్యక్తులు కానట్లే వేదముల లోని కథలయందు ప్రస్తావింపఁబడు నారదుఁడు సనత్కుమారుఁడు, జనకుఁడు, యాజ్ఞవల్క్యుఁడు మొదలగువారిని యథార్థ వ్యక్తులనుగా తలంప నక్కఱ లేదు. లేదా అనేకకల్పములలో జరిగినకథలను వేదము చెప్పుచున్న దని తలంచినపక్షమున, ఆ కల్పములోనివ్యక్తులకన్న కల్పాంతరములలోనివ్యక్తులు భిన్నులని గ్రహింపవలసియున్నది. జనకుఁ డనఁగానే సీతయొక్క తండ్రి యని గాని, నారదుఁ డనఁగానే వాల్మీకితో ప్రసంగించిన నారదుఁడు అని గాని, ధర్మరాజుతో రాజసూయమునుగూర్చి చెప్పిన నారదుఁడు అని గాని నిశ్చయింప నక్కఱ లేదు. అనామములు కలవారు అనేకులు ఉండవచ్చును. తాతముత్తాతలపేర్లు పిల్లలకు పెట్టుకొనుట పరిపాటిగానే యున్నది. అందువలన వేదముల యందు వినిపించుచున్ననామములను తమబిడ్డలకు పెట్టుకొనుట సహజమే. కావున ఒకానొకనారదుఁడు, పూర్వకల్పమున జరిగిన మఱియొకనారదునివృత్తాంతముగాఁ గాని, శాస్త్రములో ఉదహరింపఁబడినవ్యక్తి విషయముగాఁ గాని, సామవేదమున నారద సనత్కుమారసంవాదమును అధ్యయనము చేసియుండవచ్చును. నాలుగువేదములు జదివినాఁ డన్నచో ఉపనిషత్తు లన్నింటిని అధ్యయనము చేసినాఁ డన్నమాట.

అధ్యయనము చేసినంతమాత్రమున తత్త్వము బోధపడదు. అర్జునుఁడు వేదాధ్యయనము చేసినవాఁడే యైనను తత్త్వము నెఱుంగక శ్రీకృష్ణునకు శిష్యుఁడై ప్రశ్నించి తెలిసికొన్నాఁడు. సాంగములైన వేదములను సకలశాస్త్రములను అధ్యయనము చేసినప్పకిని, తత్త్వము బోధపడవలయు నన్నచో గురువును ఆశ్రయించి సేవించి ప్రశ్నించి తెలిసికోవలసినదే తప్ప సొంతయాలోచనముతో తత్త్వము బోధపడదు అనుట, తత్త్వబోధనవిధానము నిరూపించుటయు వైయాఖ్యాయికకు తాత్పర్యము. కావున ఈ తాత్పర్యమును బోధించుట కొఱకు స్వీకరింపఁబడిన యుదాహరణప్రాయులే నారదసనత్కుమారు లని గ్రహింపవలసియున్నది. కాని యీన్యాయము రామాయణ భారతాదులైన యితిహాసములకు వర్తింపదు. వాల్మీకివ్యాసులు తమ కాలమున జరిగినచరిత్రను గ్రంథములనుగా నిర్మించియుండుటచే శ్రీరాముఁడు శ్రీకృష్ణుఁడు మొదలుగువారు కల్పితపాత్రలు కారని యథార్థవ్యక్తులే యని గ్రహింపవలసియున్నది. ఈవృత్తాంతమువలన ఎవ్వఁడును ఎవ్వనికైనను బ్రహ్మతత్త్వమునుగూర్చి "ఇదిగో యిది" అని చూపుటకు వీలులేదనుట స్పష్టము. అది వాక్కులకు మనస్సునకు అందునది కాదు. ఏయాచార్యుఁడైనను శిష్యునకు వానిమనఃపరిణతినిబట్టి సూచింపవలసినదే. శిష్యుఁడు కూడ గురువు సూచించినమార్గమున దృఢదీక్షతో ఉపాసనము చేయుచున్నచో అదియే తపస్సు అగును. ఆ తపోబలమున చిత్తమునందు మాలిన్యము తొలఁగినంతనే ఆత్మతత్త్వము భాసించును. తత్త్వబోధక వాక్యములు ఉపాసనలును అజ్ఞానమును తొలగించునవియే గాని ఆత్మజ్ఞానమును తెచ్చిపెట్టవు! బావిలో జలము కన్పించుటకై మట్టిని త్రవ్వి తీసివేయునట్లు ఆత్మను ఆవరించియున్న యజ్ఞానమును తొలగించుట ముఖ్యము

గాని, ఆత్మ యిట్టిది అట్టిది అని చెప్పుట ముఖ్యము కాదు. సకల మానవులను అగమ్యమునకు చేర్చునట్టి రాజమార్గమే ధర్మానుశాసనము. కావుననే యిది సకలవేదసార మని తైత్తిరీయోపనిషత్తునందు స్పష్టము కావింపఁబడినది.

ఆత్మజ్ఞానమును పొందుటకు ధర్మాచరణము, అందును ఆచారమును పాటించుట, ఎంతముఖ్యమో పైకథకు ముగింపునందున్న వాక్యములవలన గ్రహింపవచ్చును. ఆహారశుద్ధివలన సత్త్వశుద్ధి కలుగును. సత్త్వశుద్ధివలన నిశ్చలమైనస్మృతి అనఁగా జ్ఞానముకలుగును. స్మృతి కలిగినంతనే సర్వగ్రంథులును విడిపోవును. ఇట్లు మృదితకషాయుఁడైన నారదునకు, అనఁగా జ్ఞానము వైరాగ్యము అభ్యాసము అనువానిచేత రాగద్వేషాదిదోషరహితుఁడైనవానికి, భగవంతుఁడగు సనత్కుమారుఁడు తమస్సునకు పరమందున్న తత్త్వమును చూపుచున్నాఁడు. ఆయననే స్కందుఁడనుచున్నారు. ఆయననే స్కందుఁ డనుచున్నారు "

ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః' స్మృతి లంభే సర్వగ్రందీనాం విమోక్షః। తస్మై మృదితకషాయాయ తమసస్పారం దర్శయతి భగవాన్ సనత్కుమారః। తగ్ం స్కంద ఇత్యాచక్షతే। తగ్ం స్కంద ఇత్యాచక్షతే. - ఛాందోగ్య.. అధ్యా. 7 ఖండ - 26.

ఈదృష్టితో చూచినచో ఈసంక్షేపరామాయణమునందు నారదమహర్షి కూడ తత్త్వజ్ఞానము నొందుటకు మార్గమును ఏర్పఱచియున్నాఁడని గ్రహింపవచ్చును. దీనిని శ్రద్ధాభక్తులతో పఠించువాఁడు మొదట శ్రీరామునిచరిత్రమునే గ్రహించినను, దానిని గూర్చి భావించునప్పుడు క్రమముగా ఆయన తనజీవితమునందు

పరమలక్ష్యముగా తల్లిదండ్రులను సత్యధర్మములను దేవత లనువలె ఉపాసించెను గదా అని గ్రహించును; మఱి కొంతకాలమునకు ఆయనచరిత్రయందు అడుగడుగునను వ్యక్త మగుచున్న తత్త్వజ్ఞానిలక్షణములను గూడ గుర్తించి ఆ లక్షణము లను భావించుచు సద్గురువు నాశ్రయించి ఆత్మజ్ఞానము నొందఁ గలఁడు.

నిశితముగ పరిశీలించినచో ఈ సంక్షేపమునందే శ్రీరాముని చరిత్రమున తత్త్వజ్ఞానిలక్షణములను గుర్తింపవచ్చును. శ్రీకృష్ణ భగవానుఁడు తత్త్వజ్ఞానిలక్షణమును ఇట్లు చెప్పినాఁడు, "ఎవని కార్యములన్నియు కామసంకల్పవర్జితములో ఎవనికర్మ లన్నియు జ్ఞానాగ్నిచేతదగ్ధము లగుచున్నవో అట్టివానిని పండితుఁ డని బుధులు చెప్పుదురు."

శ్లో॥ యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః॥
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం త మాహుః పండితం బుధాః॥
భగవద్గీత-అధ్యా-4. శ్లో-19.

తత్త్వజ్ఞుఁడు చేయుపనులకు కామములు గాని వానికి మూలములైన సంకల్పములు గాని ప్రేరకములై యుండవు. ఉప న్యసించువాఁడు చేతులు త్రిప్పుట తలను కదల్చుట మొదలగు పనులు ఉద్దేశ్యము లేకయే యెట్లు చేయుచుండునో అట్లే తత్త్వ జ్ఞుఁడును సంకల్పము లేకయే ప్రారబ్ధవశమున పనిచేయుచుం డును. అతఁడు ప్రవృత్తి కలవాఁడైనచో లోకసంగ్రహము ముకొఱకు, నివృత్తియం దున్నచో జీవనమాత్రమునకు పనిచేయు చుండును. ప్రయోజనదృష్టి లేకపోవుటచే అతఁడు తనచేష్టలను కర్మలనుగా భావింపఁడు. తనవలన ఏకర్మలు జరుగుచున్నను

వానిని అతఁడు అకర్మలనుగానే భావించును. ఈ యకర్మదర్శనమే జ్ఞానము. ఈ జ్ఞానము అనునగ్నిచేత శుభములు అశుభములునైన కర్మలన్నియు దగ్ధములగును. అనఁగా అవి పుణ్యఫలములను పాపఫలములను కలిగింపవు. పుణ్యపాపములు లేకున్నచో జన్మము కలుగదు. అదియే ముక్తి. కావున అట్టి జీవన్ముక్తుని పండితుఁడని బ్రహ్మవేత్తలు చెప్పుదురు.

శ్రీరాముఁడు తత్త్వజ్ఞుఁ డని నారదమహర్షి యిందు సామాన్యముగ చెప్పి ఆలక్షణములను పెక్కింటిని ప్రధానముగ వ్యంగ్య మార్గముననే స్ఫురింపఁజేసెను. వాచ్యముగ చెప్పుటకన్న వ్యంగ్య మార్గమున స్ఫురింపఁజేయుటయే బలవత్తర మని వెనుకనే గ్రహించియుంటిమి. మఱియును నారదుఁడు కూడ తత్త్వమును సనత్కుమారునివలన ఈ మార్గమువలననే కదా గ్రహించినది. రామునిగుణములను పెక్కింటిని చెప్పుచు వానిలో "వేదవేదాంగ తత్త్వజ్ఞుఁడు, సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞుఁడు" అను రెండువిశేషములను పేర్కొనెను.

పెక్కుగుణములతో కలసిపోటచే వీని విశిష్టత సాధారణముగ మనస్సునకు రాదు. కొంచెము ఆలోచించినచో ఇవి అసాధారణ గుణములని గ్రహింపఁగలము. వేదములయొక్క వేదాంగముల యొక్క తత్త్వము నెఱింగిన వాఁడఁట రాముఁడు. వేదాధ్యయనము అందఱును చేయుదురు. కాని అందఱకును వేదార్థము తెలియదు. కొన్ని భాగములకు అర్థము తెలిసికొన్నవారును వేదములయొక్క తత్త్వమును అనఁగా పరమార్థమును గ్రహింపఁగలిగియుండరు. గ్రహింపఁగలిగినవారు కొందఱే యుందురు. శ్రీరాముఁ డట్టివాఁడు. వేదములకు వేదాంగములకు పరమార్థము బ్రహ్మజ్ఞానమే. కావున రాముఁడు వేదవేదాంగతత్త్వజ్ఞుఁ డన్నప్పుడు బ్రహ్మజ్ఞానము కల

వాఁడనియే మనము గ్రహింపవలసియున్నది. రెండవ విశేషణము చేతఁ గూడ నారదుఁడు ఈవిషయము దృఢ మొనర్చుచున్నాఁడు. రాముఁడు సకలశాస్త్రములయొక్క అర్థమును అనఁగా ప్రయోజనమును, తత్త్వమును అనఁగా సారాంశమును తెలిసికొన్నవాఁడు, సకలశాస్త్రములలో వేదాంతశాస్త్రము ముఖ్యమైనది. కావున రాముఁడు ఈఉపనిషత్తులలోని యర్థతత్త్వములను చక్కఁగా గ్రహించినవాఁ డనియే మనము నిశ్చయింప వలసియున్నది.

ఇంక ఈ దృష్టిలో నారదుఁడు చెప్పినరామునిచరిత్రమును గమనింపుఁడు, రాముఁడు యౌవనము నొందినప్పటినుండియు ప్రజలకు హితములైన కార్యములనే చేయుచుండెను. వారును అతఁడు రాజు కావలయు నని కోరుచుండిరి. దశరథుఁడు అది గమనించి సంతోషించి రామునకు యౌవరాజ్యపట్టాభిషేకము చేయఁగోరెను.

శ్లో॥ ప్రకృతీనాం హితై ర్యుక్తం ప్రకృతిప్రియకామ్యయా।
యౌవరాజ్యేన సంయోక్తుం ఐచ్ఛత్ ప్రీత్యా మహీ పతిః
బాల-సర్గ-1 శ్లో, 21

యౌవరాజ్యమును రాముఁడు కోరలేదు. దశరథుఁడే అందులకు ప్రయత్నించెను. తండ్రిమాటను రాముఁడు కాదన లేదు. దశరథుఁడు తన కిచ్చినవరములను కైకేయి నిర్దేశింపఁగా. రాముఁడు తల్లియొక్క ప్రీతికొఱకు, తండ్రియిచ్చిన మాటకొఱకు, మఱునాడే వనములకు బయలుదేరెను. ఇందును రాముని సంకల్పము లేదు. వనవాసమును సంకల్పించినది కైకేయి, ఆయన రాజ్యమును కాంక్షింపలేదు; వనవాసమును ద్వేషింపలేదు. వనములకు పోయి రాక్షసులను జయించి, రాజులు సహజముగ

కోరునట్లు, దిగ్విజయ మొనర్చి కీర్తిని సంపాదింపవలయు నను తలంపు కూడ ఆయనకు లేదు.

అడవులకు బయలుదేరినతరువాత కూడ అయన స్వతంత్రించి యేపనియు చేసినట్లు కన్పడదు. వనములందు ప్రవేశించి నంతనే అయన చేసినమొదటిపని పెద్దలను దర్శించుట. వనములలో కూడ ఒకానొక ప్రదేశమున నుండవలయు నని అయనకు సంకల్పములేదు; తాము ఎక్కడ నుండఁదగునో నిర్దేశింపుఁ డని తాను దర్శించుచుండిన మహర్షులనే యడుగుచుండెను. మొదట భరద్వాజునిశాసనమున అయన చిత్రకూటమున నివాస మేర్పఱచు కొనెను.

శ్లో॥ చిత్రకూట మనుప్రాప్య భరద్వాజస్య శాసనాత్॥
బాల—సర్గ-1. శ్లో॥ 31

భరతుఁ డచ్చటకి వచ్చి వెళ్ళినతరువాత, తన నివాసము తెలియుటవలన పౌరులు జానపదులును మాటిమాటికి అక్కడికి వత్తురేమోయని అప్రదేశమును వదలి దండకార్యమున ప్రవేశించెను.

శ్లో॥ రామ స్తు పున రాలక్ష్య నాగరస్య జనస్య చ।
తత్రాగమన మేకాగ్రో దండకాన్ ప్రవివేశ హ॥
బాల-సర్గ-1 శ్లో. 40

మహారణ్యమున ప్రవేశింపఁగనే విరాధుఁ డెదురై సీత నపహరింప ప్రయత్నించెను. రాముఁడు వానిని సంహరింప ప్రయత్నించెను, రాముఁడు వానిని సంహరించి శరభంగమహర్షిని దర్శించెను.

శ్లో॥ ప్రవిశ్య తు మహారణ్యం రామో రాజీవలోచనః।
విరాధం రాక్షసం హత్వా శరభంగం దదర్శ హ॥

బాల-సర్గ - శ్లో. 41

శరభంగాశ్రమమునం దుండఁగా మహర్షులు రాముని యొద్దకువచ్చి తమ్ము రాక్షసులనుండి కాపాడు మని ప్రార్థించిరి. క్షత్రియుఁడు కావున రాముఁడు వారిని కాపాడుటకై రాక్షసులను సంహరింతు నని ప్రతిజ్ఞచేసెను.

శ్లో॥ వసత స్తస్య రామస్య వనే వనచరై స్సహ॥
ఋషయోఽభ్యాగమన్ సర్వే వధా యాసురరక్షసామ్॥

బాల-సర్గ-1. శ్లో. 43. 44

ఆయనజీవితములో చాలగొప్పసంఘటనయై త్రిలోకపూజ్యతను కలిగించిన రాక్షససంహారమునకు కూడ సంకల్పమాయ నది కాదు. ప్రతిజ్ఞచేసిన తరువాత కూడ ఆయన రాక్షససంహారము నకై వెంటనే బయలుదేరలేదు. అగస్త్యమహర్షిని దర్శించి ఆయన మాటచొప్పున పంచవటియందు నివసించుచుండఁగా శూర్పణఖ చేత ప్రేరితులై ఖరదూషణాదిరాక్షసులు పదునాలుగువేలమంది దండెత్తిరాఁగా రాముఁడు వారి నందఱను ఆత్మరక్షణకై సంహరింపవలసివచ్చెను.

శ్లో॥ తత శ్శూర్పణఖావాక్యా దుద్యుక్తాన్ సర్వరాక్షసాన్।
ఖరం త్రిశిరసం చైవ దూషణం చైవ రాక్షసం॥
నిజఘాన రణే రామ స్తే షాం చైవ పదానుగాన్॥

బాల-సర్గ-1. శ్లో. 47, 48

గృహస్థునకు ఆత్మరక్షణమువలెనే, భార్యాపుత్రాదిరక్షణము కూడ శాస్త్రవిహితమైన ధర్మము. కావున రాముఁడు సీత నపహరించిన రావణుని శిక్షించి ఆమెను రక్షించుటకై పూని యందులకు సాధనముగా సుగ్రీవునిసఖ్యమును పొందెను. మిత్త్రదుఃఖనివారణము కూడ కర్తవ్యమే. కావున, వానిభార్యను హరించిన వాలిని సంహరించి, సుగ్రీవుని కష్టములనుండి ఆయన యుద్ధరించెను,

శ్లో॥ తత స్సుగ్రీవవచానాత్ హత్వా వాలిన మాహవే।
సుగ్రీవ మేవ తద్రాజ్యే రాఘవః ప్రత్యపాదయత్॥
బాల-సర్గ-1 శ్లో. 70

రావణుని సంహరించినంతనే రామునకు సీతావిషయము పెద్దసమస్య అయ్యెను. సంవత్సరకాలము రావణునియింట చెఱలో నుండిన యామెను మరల తాను భార్యగా పరిగ్రహించుట ధర్మమగునా? ఆయనకు ఆమె శీలమువిషయమున సందేహము లేదు. ఆంజనేయుఁడును ఆమె రావణునకు లోబఁడలేదనియే చెప్పియున్నాఁడు, అయినను ఆమెను రావణుఁడు చేతులతో గట్టిగా పట్టుకొని, ఒడియందుంచుకొని లంకకుతీసికొనిపోయె ననుటయు ప్రసిద్ధమే. అట్టియెడల, లోకులు ఏమనుకొన్నను సరే యని, ఆమెను పరిగ్రహించుట ధర్మము కాదు. అది ఆమెకును శుభమును సుఖమును కలిగింపదు. లోకులు పలువిధములుగా పలుకుచుండఁగా మహారాజపత్నియైన ఆమెమాత్రమెట్లు సుఖపడఁగలదు? ఆయన కేవలము శాస్త్రదృష్టితో ఆలోచించి ఆమెను నిరాకరించెను. తన పరిశుద్ధతను నిరూపించుకొనుబాధ్యతను ఆమెకే వదలివైచెను. అగ్నిపరీక్షచేఁ గాని శపథముచేఁ గాని ఆమె తనపవిత్రతను నిరూపించుకొని వెనుకటివలె గృహిణియై సుఖింపవలయు ననియే ఆయన యభిప్రాయము. తరువాత అగ్ని దేవునివచనప్రామాణ్యా

మున ఆయన ఆమెను స్వీకరించెను. ఇందును ఆయన సంకల్పము లేదు.

శ్లో॥ తా మువాచ తతో రామః పరుషం జనసంసది।
అమృష్యమాణా సా సీతా వివేశ జ్వలనం సతీ॥

ఆయనకు సీతయందు ప్రేమ లేదని ఎవరును అనలేరు. ఆయన ఆమెకొరకై పొందినదుఃఖము అమితము. అయినను ఆ దౌర్బల్యమునకు లోఁబడక కేవలధర్మదృష్టితో ఆమెను జనమధ్యమున పరుషముగా నిరాకరించి, ఆమె పవిత్రత లోకప్రసిద్ధమగుటకు మార్గ మేర్పరచిన శ్రీరాముని మహనీయత అసామాన్యము. ఇది రావణసంహారముకన్నను గొప్పకార్యము. కావుననే సీత అగ్నిపరీక్ష నొందినంతనే దేవతలు మహర్షులు ప్రత్యక్షమై సంతోషముతో ఆయన గావించిన పనిని ప్రశంసించి పూజించిరి. రావణుఁడు వధింపఁబడినవెంటనే ఎవరును ప్రత్యక్షము కాలేదు. అగ్నిపరీక్షవలననే రాముఁడు ధర్మమును, ఏ దౌర్బల్యమునకు లొంగక, అసిధారావ్రతముగా పాటించుచున్నాఁడని గ్రహించియే మహర్షులు దేవతలు సంతుష్టులైనా రని నారదమహర్షి స్పష్టమొనర్చుచున్నాఁడు.

శ్లో॥ కర్మణా తేన మహతా త్రైలోక్యం సచరాచరమ్॥
సదేవర్షి గణం తుష్టం రాఘవస్య మహాత్మనః।
బభౌ రామ స్సంప్రహృష్టః పూజిత స్సర్వదైవతైః॥
బాల-సర్గ-1-శ్లో. 84

దీనినిబట్టి రాముఁడు ప్రారబ్ధవశమున సంభవించుచున్న సన్నివేశములలో శాస్త్రవచనము, గురువచనము ప్రమాణముగా

గైకొని వర్తించెనే కాని, సాధారణమానవులవలె భోగములనో, కీర్తినో సంపాదింపవలెనను పూనికతో ఏ పనిని చేయలేదనుట స్పష్టము. అయనయందు ఏవిషయమునను కామము గాని, దాని కొఱకు సంకల్పము గాని కన్పింపదు, తత్త్వజ్ఞానిలక్షణమదియే కదా! ఈ లక్షణము తైత్తిరీయోపనిషత్తునందు మిగుల ప్రశంసింపఁ బడినది. కోరికలే పెక్కుదుఃఖములకు మూలము. కోరిక పుట్టి నంతనే దానిని తీర్చుకోవలయు నను తహతహవలన చిత్తశాంతి నశించును. కోరికలవలన దెబ్బనొందనివారు అనఁగా కామహ తులు కానివారు, చాల అఱుదుగా నుందురు. వేదవిహితములైన ధర్మములను పాటించుచు యజ్ఞయాగాదికర్మల నొనరించు శ్రోత్రి యులు కూడ చాలమంది ఈలోకముననో పరలోకముననో అభ్యు దయమునుకోరి నియమనిష్ఠలతో ఆయాకర్మలను నిర్వహించు చుందురు. కావున శ్రోత్రియులలో కూడ అకామహతులు అఱుదే. నిష్కాముఁడై శాస్త్రవిహితములైన కర్మలను నిర్వహించుచుండు వాఁడు అకామహతుఁడైన శ్రోత్రియుఁ డగును. ఇట్టి వానికి, "చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్ మాసాలపైఁ దేనియల్" అని ప్రవరుఁడు వరూధినితో అన్నట్లు స్వర్గలోకసుఖములు కూడ తుచ్ఛములుగనే తోఁచును. స్వారోచిష మనుసంభవకథలో అకా మహతుఁడైన శ్రోత్రియుఁ డెట్లుండునో నిరూపించుటయే ప్రవరా ఖ్యుని వృత్తాంతమును వర్ణించుటలో వ్యాసభగవానుని తాత్ప ర్యము; వరూధినివలపులోని విశేషమును వర్ణించుటకాదు. ఇట్టి యకామహతుఁడైన శ్రోత్రియునకు ఆత్మసాక్షాత్కారరూపమైన బ్రహ్మానందము లభించు నని శ్రుతిచెప్పుచున్నది.

బ్రహ్మానంద మెట్టిదో తైత్తిరీయములో ఆనందవల్లియందు వర్ణింపబడినది. అందు మొదటిమెట్టు మానుషానందమే, యువ

కుఁడు, సద్వర్తనుఁడు, కార్యకుశలుఁడు, దృఢతముఁడు, బలిష్ఠుఁడును అయినవానికి సకలసంపదలతో ఈభూమి యంతయు లభించినచో వానికిఁ గలుగునానందము మానుషానందము; అనఁగా గుణసంపన్నుఁడు, యువకుఁడునైన చక్రవర్తి యొక్క ఆనంద మన్నమాట. దీనికి నూఱురెట్లు మనుష్యగంధర్వానందము. దానికి నూఱురెట్లు దేవగంధర్వులయానందము. దానికి నూఱురెట్లు పితృదేవతలయానందము. దానికి నూఱురెట్లు అజాన దేవతల యానందము. దానికి నూఱురెట్లు కర్మదేవతలయానందము. స్వర్గమునందే పుట్టినవారు అజానదేవతలు. వారికి స్వర్గములోని భోగవిషయములు సుపరిచితములై యుండును. యజ్ఞయాగాది కర్మ లొనర్చి స్వర్గముకు పోవువారు కర్మదేవతలు. కర్మదేవతల యానందముకన్న నూఱురెట్లు హవిర్భుజులైన దేవతలయానందము. దేవత లందఱును హవిర్భాగములకు అర్హులు గారు. ఎనిమిదిమంది వసువులు, పదునొకండుగురు రుద్రులు, పండ్రెండుమంది యాదిత్యులు, ఇంద్రుఁడు, ప్రజాపతి అనువారు ముప్పదిముగ్గురే యజ్ఞయాగాదులలో హవిర్భాగములను స్వీకరించుచుందురు. కావున వారు దేవతలలో శ్రేష్ఠులు. హవిర్భుజులయానందముకన్న నూఱురెట్లు ఇంద్రునియానందము. దానికి నూఱురెట్లు బృహస్పతియొక్క ఆనందము. దానికినూఱురెట్లు ప్రజాపతియొక్క ఆనందము. దానికినూఱురెట్లు హిరణ్యగర్భునియానందము, మానుషానందమునుండి హిరణ్యగర్భునియానందము వఱకును, ప్రతిచోట "ఈయానందము అకామహతుఁడైన శ్రోత్రియునకును కలదు" అని మాటిమాటికి చెప్పబఁడినది. తుదకు హిరణ్యగర్భుఁడైన బ్రహ్మయొక్క ఆనందము కూడ అకామహతుఁడైన శ్రోత్రియుని యానందమునందు లేశమాత్రమే యని చెప్పఁబడినది.

ఇది శ్రీరామునియందు ఎట్లు సమన్వయించునో పరిశీలింప వలసియున్నది. శ్రీరాముఁడు తుదివఱకును యువకుఁడుగనే యుండెను. ఆయన పదునొకండువేలయేండ్లు పరిపాలించు నని నారదమహర్షి చెప్పెను. దశరథుఁడు అఱువదివేలయేండ్లు జీవించి వృద్ధుఁడై చనిపోయెను. ఆ లెక్కప్రకారము యౌవనము పదునైదువేలయేండ్లవఱకును ఉండు నని చెప్పవలసియున్నది. కనుక రాముఁడు తుదివఱకును యువకుఁడే. నారదమహర్షి పేర్కొన్న గుణములనుబట్టి ఆయన గుణసంపన్నుఁడు, దృఢతముఁడు. బలిష్ఠుఁడు అనుట స్పష్టము. ఆకాలమున రావణుఁడు బలశాలి. వానికన్నను బలవత్తరుఁడు వాలి. వీరి నిరువురిని సంహరించి భార్గవరాముని గూడ జయించుటచే రాముఁడు సకలభూమండలమున ఎదురులేనివాఁడై చక్రవర్తి యయ్యెను. కావున అయనకు శ్రుతి పేర్కొన్న మానుషానందము సిద్ధమే యనుట స్పష్టము. ఈ సార్వభౌమత్వమునందును ఆయనకు అభిలాష లేకుండుట గమనింపదగియున్నది. భరతునకు ఏమాత్రమైనను రాజ్యకాంక్ష యున్నచో రాజ్య మంతయు అతనికే యొసంగవలయు నని ఆయన తలంచెను. అందులకే అయోధ్యకు తిరిగివచ్చునప్పుడు ఆయన భరద్వాజాశ్రమములో ఆగి భరతుని యభిప్రాయమును కనుగొనుటకై అంజనేయుని నందిగ్రామమునకు పంపెను. ఇది రాముని యకామహతత్వమునకు గొప్పనిదర్శనము. కావుననే నారదమహర్షి సంక్షేపకథనమున, చిన్నవిషయ మని యుపేక్షింపక దీనిని స్పష్టముగ పేర్కొనెను.

శ్లో॥ భరద్వాజాశ్రమం గత్వా రామ స్సత్యపరాక్రమః।
భరతస్యాంతికం రామో హనుమంతం వ్యసర్జయత్॥

బాల-సర్గ-1 శ్లో. 87

అగ్నిదేవుఁడు సీతను సమర్పించు సందర్భమున సకల దేవతలును శ్రీరాముని పూజించి రని నారదమహర్షి చెప్పెను. సర్వదేవతలలో శ్రేష్ఠుఁడైన హిరణ్యగర్భుఁడును కలఁడు. ఆబ్రహ్మ దేవుఁడును రాముని స్తుతించి పూజించెను. అట్టియాధిక్యము వలన రామునకుఁ గలిగిన సంప్రహర్షము హిరణ్యగర్భునియానందమును మించియుండె ననుట స్పష్టము, హర్షమునకు మించినది ప్రహర్షము. దానికిని మించినది సంప్రహర్షము.

ఇచ్చట నొకసందేహము కలుగవచ్చును. సీత హరింపఁబడిన దని విని జటాయువు హతుఁడగుటను చూచి రాముఁడు శోకసంతప్తుఁడై ఇంద్రియములు కలఁతనొందగా విలపించెను" అని నారదమహర్షి యే చెప్పెను.

శ్లో॥ గృధ్రంచ నిహతం దృష్ట్వా హృతాంశ్రుత్వా చ మైథిలీమ్।
రాఘవ శ్శోకసంతప్తో విలాలపాకులేంద్రియః॥
బాల-సర్గ-1. శ్లో. 53,

ఇట్లు విలపించినరాముఁడు తత్త్వజ్ఞుఁడు బ్రహ్మానందము కలవాఁడును ఎట్లగును? ఇది పరిశీలింపవలసినదే. ఒకానొకఁడు ఎంతయో శ్రమించి ప్రజాసేవ జేసి ఎన్నికలలో పోటీచేసి ప్రధాన మంత్రిపదవిని పొందినచో వానికి అమితమైన సంతోషము కలుగును. కాని వానికి కూడ మిత్రవియోగమో బంధువియోగమో సంభవించినప్పుడు దుఃఖము కలుగును గదా! అతఁ డాదుఃఖమును పొందుచున్నంతమాత్రమున వానికి సిద్ధమైయున్న పదవికిఁ గాని దానివలన కలుగు అధికారమునకు ఆనందమునకుఁ గాని హాని కలుగదు. తాత్కాలికమైన యాదుఃఖము గడచిపోయి నంతనే మఱునాఁడే యతఁడు తనపదవిని అధికారమును ఆనంద

మును పొందుచునే యున్నాఁడు. అవి వాని కెప్పుడును సిద్ధములే. అట్లే తత్త్వజ్ఞుఁడు ప్రారబ్ధవశమున తాత్కాలికముగా నెప్పుడైన దుఃఖమునకు లోనైనను, అది తొలఁగినంతనే అతఁడు మరల తనకు సహజమైనయానందస్థితియందే యుండును. అట్లే రాముడును తాత్కాలికముగా సీతకొఱకు జటాయువుకొఱకును ఎంతగా విలపించినను, బ్రహ్మదేవునిచే పూజనందుకొన్న యౌన్నత్యమునకు, దానివలన కలుగునానందమునకు హాని కలుగదు.

ఇందు గమనింపవలసినయంశము మఱియొకటి కలదు, రాముఁడెంతగా దుఃఖించినను, ఆత్మానందమునకు హేతువులైన అకామహతత్వము శ్రోత్రియత్వము అను లక్షణములకు భంగమేమియును లేదు. తండ్రికి స్నేహితుఁడై తనకు ఉపకారము చేయుటకై పోరాడి మరణించిన జటాయువుకొఱకు రాముఁడు దాక్షిణ్యమువలన విలపించెను. అట్టిదాక్షిణ్యము మహాపురుషులకు సహజము. దానివలన వారిజ్ఞానమునకుఁ గాని గొప్పతనమునకుఁ గాని భంగము కలుగదు, తత్త్వజ్ఞుడైన వాని హృదయము ఱాయిగనో అప్పగనో అగు నని తలంపరాదు. భూతదయ తత్త్వజ్ఞులలక్షణములలో ముఖ్యము. అట్లే రాముఁడు సీతకొఱకై విలపించినప్పుడును దాక్షిణ్యమే కారణము గాని కామాసక్తి కాదు. లోకములో అందఱు భార్య కావలె నని ఒకానొకసుందరిని చూచి ఆసక్తితో వరించినట్లుగా రాముఁడు సీతను వరింపలేదనుట మొదట గమనింపవలసిన విషయము. విశ్వామిత్రునియాజ్ఞవలన రాఁముడు విల్లెక్కు పెట్టఁగా జనకుఁడు అతనికి సీత నిత్తు ననెను, అప్పుడును రాముఁడు తండ్రియభిప్రాయము ననుసరించి ఆమెను భార్యనుగా స్వీకరించి ప్రేమించెను. పదునాలుగేండ్లు వనములలో నుండఁదలఁ

ఆయన తలంపలేదు. ఆమెయే ఆయనను ఎంతో బలవంతపెట్టి వెన్నంటి బయలుదేరెను. ఆమె అయోధ్యలోనున్నచో ఆయన విరహము నొంది విలపించియుండునా? ఊర్మిళా స్మరణమే లేకుండలక్ష్మణుఁ డుండఁగ రాముఁడు సీతను వదలి యుండ లేఁడా? రావణుఁడు ఆమెను అపహరించినప్పుడు రాముఁడు అమితముగ విలపించుటకు కారణము దాక్షిణ్యమే కాని కామాసక్తి కాదు. తన్ను నమ్మి సేవించుచు అడవులకు వచ్చిన యాశ్రితురాలిని కాపాడుకొనలేకపోతిని గదా యని, ఆమె ఆ రాక్షసులవలన ఎట్టిబాధలు పొందుచున్నదో యని, ఆమెను రాక్షసులనుండి విడిపించి తెచ్చినను ఆమె భావిజీవితము ఏమి కానున్నదో యని, కారుణ్యాతిశయమువలన ఆయన దుఃఖించెను. లోకులకు భార్యలయందుండు కామాసక్తి ఆయనకు ఆమెయందు లేదు. కావుననే ఆమె అగ్నిప్రవేశము చేయుచున్నప్పుడు చూచుచు నూరకుండెను. తరువాత జనాపవాదము కలిగినప్పుడును, రాజ్యపాలనమను ధర్మనిర్వహణమునకై ఆమెను దూరమొనర్చుకొనెను. భార్యాకాముకుఁడు ఇట్లు చేయఁగల్గునా?

నారదమహర్షి ముగింపునందు రాముఁడు బ్రహ్మలోకమునకు పోవు నని రెండుశ్లోకములలో రెండుపర్యాయములు చెప్పెను. ఈరెండు శ్లోకములందును ఆయన రామునియందలియకామహతత్వము శ్రోత్రియత్వము అనురెండులక్షణములను బ్రహ్మలోకప్రాప్తికి హేతువులనుగా సూచించెను. ఈశ్లోకములను గమనింపుఁడు. "పెక్కుసువర్ణములను కోట్లకొలఁదిగోవులను దానమొనరించి వందలకొలఁది యశ్వమేధములను గావించి బ్రహ్మలోకమునకు పోగలఁడు." "పదునొకండువేలసంవత్సరములు రాముఁడు

శ్లో॥ అశ్వమేధశతై రిష్ట్వా తథా బహు సువర్ణకైః।
గవాం కోట్యయుతం దత్వా బ్రహ్మలోకం ప్రయాస్యతి॥

శ్లో॥ దశవర్షసహస్రాణి దశవర్ష శతాని చ।
రామో రాజ్య ముపాసిత్వా బ్రహ్మలోకం ప్రయాస్యతి॥
బాల-సర్గ-1. శ్లో. 95. 97

అశ్వమేధములనుగూర్చి చెప్పిన పిమ్మట రాముఁడు రాజ్యమునుపాసించి బ్రహ్మలోకమునకు పోఁగలడని చెప్పుట గమనింపదగియున్నది. శ్రోత్రియుఁడైన క్షత్రియునకు యజ్ఞయాగముల కన్నను రాజ్యపరిపాలన ధర్మమే ముఖ్యము. అదియే రాజులకు బ్రహ్మలోకప్రాప్తి హేతువనియు నారదమహర్షి సూచించుచున్నాఁడు, సీత భూమిలోనికి పోయిన తరువాత రాముఁడు మరల మఱియొక పత్నిని స్వీకరింపక బంగారుసీతతో యజ్ఞములను చేయుచు రాజ్యము నుపాసించెను, దీనివలన ఆయన అకామహతుఁడై శ్రోత్రియుఁడై తత్త్వజ్ఞుఁడై బ్రహ్మలోకము నొందెనని నారద మహర్షి వ్యంగ్యమార్గమున ప్రతిపాదించె ననుట స్పష్టము.

వాల్మీకిమహర్షియు తరువాతగ్రంథమునందు రామునిచరిత్రలో తత్త్వజ్ఞలక్షణములను ఇట్లే సూచించెను. కాని తత్త్వము నెచ్చటను భగవద్గీతాదులయందువలె వాచ్యముగ చెప్పలేదు. వాల్మీకియొక్క విద్యాసంప్రదాయమును ఇట్టిదే యైయుండునని మన మూహింపవచ్చును. వాల్మీకి భృగువంశసంజాతుఁడు; ప్రచేతసునకు పదియవపుత్రుఁడు. భృగువు తండ్రియైన వరుణుని వలన బ్రహ్మవిద్యోపదేశము నొందెను. ఈవృత్తాంతము తైత్తిరీయములోని భృగువల్లియందు కలదు. భృగువు తండ్రియొద్దకు

ప్రార్థించెను. అన్నము, ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు వాక్కు, బ్రహ్మమును పొందుటకు తగినస్థానము లని చెప్పి ఆయన మరల నిట్లనెను. "దేనినుండి యీభూతములు పుట్టు చున్నవో, పుట్టిన భూతములు దేనియందు జీవించుచున్నవో, నశించునప్పుడు అవి దేనియందు ప్రవేశించుచున్నవో, దానినిగూర్చి విశేషముగ తెలిసికొనఁ బ్రయత్నింపుము. అది బ్రహ్మము." అంతట భృగువు తండ్రి చెప్పినదానినిగూర్చి ఏకాగ్రముగ నాలో చించుచు తపస్సుచేసెను. అప్పుడు అన్నము బ్రహ్మము" అని తోఁచి ఆయన తండ్రి యొద్దకు వచ్చి "భగవంతుఁడా! నాకు బ్రహ్మమును బోధింపుము." అని మరల ప్రార్థించెను. ఆయన "తపస్సుచేత బ్రహ్మమును తెలిసికొనఁగోరుము. తపస్సు బ్రహ్మము" అని చెప్పెను. భృగువు మరల తపస్సుచేయఁగా ఆయనకు ప్రాణము బ్రహ్మమని తోఁచి మరల తండ్రియొద్దకు వచ్చి ప్రార్థించెను. ఆయన మరల వెనుకటిమాటనే చెప్పెను. భృగువు తపస్సుచేసి మనస్సును బ్రహ్మమునుగా తలంచి మరల వచ్చెను, తండ్రి వెనుకటిమాటనే చెప్పెను. భృగువు మరల తపస్సు చేసి విజ్ఞానమును బ్రహ్మముగా తలంచుచు తండ్రియొద్దకు వచ్చెను. తండ్రి మరల తపస్సుచేయు మనియే చెప్పెను. భృగువు అయిదవ పర్యాయము తపస్సుచేసి ఆనందము బ్రహ్మ మని తెలిసికొని సంతుష్టుఁ డయ్యెను. మరల తండ్రియొద్దకు రాలేదు. అనఁగా అప్పటి వఱకును ఆయనకు గలుగుచుండిన సంశయము లన్నియు తొలఁగి పోయి బ్రహ్మానందము కలిగినదన్న మాట. తండ్రి అత్యం తము ప్రియుఁడైన కుమారునకు తపస్వికి బ్రహ్మము నుపదేశిం చినప్రకార మిది. ఆయన బ్రహ్మ మనఁగా "ఇదిగో ఇట్టిది" అని

చెప్పలేదు. సాధనములను మాత్రము నిర్దేశించి వానివలన కుమారుఁడే బ్రహ్మమును స్వయముగా తెలిసికొనునట్లు చేసెను. ఆ సాధనములను కూడ ఆయన, అత్యంతశ్రద్ధతో జిజ్ఞాసతో వచ్చి భృగువు అడిగినప్పడే చెప్పెను కాని ముందుగా చెప్పలేదు. తెలిసికొనఁగోరువానికి ఇట్లు బోధించుటయే యుత్తమమైనపద్ధతి. ఈభృగువల్లిని ముగించుచు శ్రుతి ఇట్లుచెప్పినది." ఇది భార్గవియు,వారుణియునైనవిద్య. ఇది పరమమైన హృదయ గుహయందు ప్రతిష్ఠితమై యున్నది. ఎవఁడు ఈవిధముగా (తపస్సుచేత) తెలిసికొనుచున్నాఁడో వాఁడు బ్రహ్మమునందు ప్రతిష్ఠితుఁడగుచున్నాఁడు."

ఈ కథవలన గ్రహింపవలసిన యంశము లనేకములు కలవు. వాల్మీకినిగూర్చి భార్గవుఁడని ప్రాచేతసుఁడని రామాయణమునందే చెప్పఁబడియున్నది. కుశలవులు రామునితో, "తపస్వియైన భార్గవునిచేత ఈగ్రంథమున నూఱు ఉపాఖ్యానములు రచింపఁబడినవి" అని చెప్పిరి.

శ్లో॥ ఉపాఖ్యానశతం చైవ భార్గవేణ తపస్వినా।

ఉత్తర-సర్గ-94-శ్లో. 26

వాల్మీకి రామునితో, "నేను ప్రచేతసునకు పదియవపుత్రుడను; అనృతవాక్యమును స్మరింపను; వీరు (కుశలవులు) నీకుమారులు" అని చెప్పెను.

శ్లో॥ ప్రచేతసోఽహం దశమః పుత్రో రాఘవనందన।
న స్మరా మ్యనృతం వాక్య;మిమౌ తు తవ పుత్రకౌ॥

దీనినిబట్టి భృగువంశమునందు ప్రచేతసుఁడనుమహర్షికి వాల్మీకి పదియవపుత్రుఁడని గ్రహింపవలసియున్నది. కావున ఆయనకు వంశమునుబట్టి భార్గవుఁడని, తండ్రినిబట్టి ప్రాచేతసుఁడని వ్యవహార మేర్పడినది. ఇట్లే తపస్సు చేయునప్పుడు చుట్టును ఏర్పడిన వాల్మీకమునుండి (పుట్టనుండి) మరల జన్మించినట్లుగా వెలువడుటచే వాల్మీకి యనుపేరు రూఢమైనది. భృగువంశములోనివాఁడు గావున పైనపేర్కొనఁబడిన భార్గవీవిద్య, వాల్మీకికి వంశానుగతముగ ప్రాప్తమై యుండును. కావున ఆసంప్రదాయము ననుసరించియే గొప్పతపస్సు చేసి ఈయనయును ఆత్మసాక్షాత్కారము నొందియుండును. అందువలన ఈయన తనగ్రంథమున వేదాంతమునుగూర్చి చర్చలు చేయకుండ తత్త్వమును వ్యంగ్యమార్గమున సూచించెను. వేదాంతవాక్యములను విన్నంతమాత్రమున జ్ఞానము కలుగునని చెప్పఁజాలము. భగవద్గీతను సాక్షాత్తుగా శ్రీకృష్ణునివలననే విన్నయర్జునుఁడు, కొంతకాలమునకు దానిని మఱచిపోయి, మరల బోధింపుమని శ్రీకృష్ణుని కోరినాఁడు. ఆయన మరల అర్జునకు తత్త్వమును సారరూపమున నుపదేశించెను. దానికే అనుగీత యని పేరు. ఇట్లు రెండు పర్యాయములు భగవంతునివలన నుపదేశము నొందినను అర్జునుఁడు ధర్మరాజాదులతో స్వర్గమునకు పోయినట్లే వ్యాసభగవానుఁడు వర్ణించెను గాని, బ్రహ్మలోకమునకు పోయినట్లు చెప్పలేదు. కావున తత్త్వజ్ఞానవిషయమున సాధకునకు ఉపదేశము ఫలింపవలయునన్నచో చిత్తశుద్ధి అత్యంతము ఆవశ్యక మనుట, అది తపస్సుచేతనే సిద్ధించు

ఇట్లు సకలవేదములకు సారమైనధర్మానుశాసనమున ఉపాసనము, తత్త్వోపదేశము నిక్షేపింపఁబడియుండుటచే నారదమహర్షి చెప్పిన యీ సంక్షేపరామాయణము వేదములతో సమానమై పవిత్రము, పాపఘ్నము పుణ్యప్రదము అగుచున్నది. దీని కింతఫలముండునా యని శంకింపరాదు. మంత్రము చిన్నదైనను అనుష్ఠానబలముచేతనే మహాఫలము నొసఁగుచున్నది. వేదములను నియమపూర్వకముగా అధ్యయనము గావించినచో గొప్పఫలము కలిగినట్లే ఈసంక్షేపరామాయణమును గూడ నియమపూర్వకముగా పారాయణము గావించుచు అందలితాత్పర్యము నుపాసించుచున్నచో పైన పేర్కొన్నఫల మంతయు తప్పక సిద్ధించును.

## 3. కర్తవ్యపాలనము

వాల్మీకినారదులయొక్క ప్రశ్నసమాధానములవలన ఒక్క సందేహము కలుగుటకు అవకాశ మున్నది. శ్రీరాముఁడు సకలకళ్యాణగుణసంపన్నుఁ డని వాల్మీకికి తెలియదా? అసలు నారదునకన్న శ్రీరాముని గూర్చి ఎక్కువపరిచయము కలవాఁడు వాల్మీకియే, ఆయనకు శ్రీరామునితో చిత్రకూటమునందే పరిచయము కలిగినది. వనములకు వచ్చిన సీతారామలక్ష్మణులు చిత్రకూటమున వాల్మీకియాశ్రమమును చేరి కృతాంజలులై ఆయనకు అభివాదనము గావించిరి. ఆయన మిగుల సంతోషించి వారికి స్వాగతమును పలికి గౌరవించి "ఇచ్చట నుండుఁ డని యాదరించెను. అట్లేయని వారును పర్ణశాలను నిర్మించుకొని యచ్చట నుండిరి. భరతుఁ డచ్చటికే వచ్చెను. రాజ్య మక్కఱ లేదనుచు సోదరులిరువురు గావించినప్రసంగములను ఆయన వినుచునే యుండెను. పాదుకలను గైకొని భరతుఁడు వెళ్ళిన తరువాత

రాక్షసులవలన భయముతో ఋషు లందఱు చిత్రకూటమును వదలి వెళ్ళిరి. అప్పుడు వాల్మీకి తమసా తీరమునకు చేరి గంగా తమసాసంగమప్రదేశమున ఆశ్రమము నేర్పరచుకొనెను. లక్ష్మణుఁడు సీతాదేవిని తెచ్చి ఇచ్చుటనే వదలివెళ్ళెను. ఆమె ఆయాశ్రమమునందే కుశలవులను కనెను. కావున శ్రీరాముని గూర్చి వాల్మీకికి చక్కఁగా తెలియును. మఱి తెలిసినచో ఈప్రశ్న యెందులకు?

నారదుఁడు వాల్మీకియొద్దకు వచ్చినదినము చాల అసాధారణమైనది. ఆదినమున ప్రాతఃకాలమున వచ్చిన నారదుఁడు పదిగంటల వఱకు నుండె ననుకొన్నచో ఆయనవెడలిపోయిన తరువాత పదనొకండుగంటలప్రాంతమున వాల్మీకి మధ్యాహ్న స్నానమునకై తమసానదికి పోయియుండును. అక్కడ కిరాతుఁడు క్రౌంచములజంటలో మగపక్షిని సంహరింపఁగా ఆడుపక్షియొక్క ఆర్తనాదమువలన వాల్మీకి కరుణావేశము నొంది వానిని శపించెను. ఆశాపవాక్కులు శ్లోకరూపమున వెలువడి వాల్మీకికి కూడ ఆశ్చర్యమును కలిగించెను, ఆశ్రమమునకు మరలివచ్చి వాల్మీకి ఆసన్నివేశమును గూర్చి, ఆశ్లోకమునుగూర్చియే ఆలోచించుచుండఁగా బ్రహ్మదేవుఁడు సాక్షాత్కరించి రామాయణమును వ్రాయుమని చెప్పి వెడలి పోయెను. పిమ్మట, అనఁగా పండ్రెండుగంటల ప్రాంతమున వాల్మీకి రామాయణమును వ్రాయ నిశ్చయించెను. కావున ఒక్కదినముననే కొన్నిగంటలలో చాలముఖ్యములైన సంఘటనలు పరంపరగా సంభవించినవి. వాల్మీకిప్రశ్నలోని యభిప్రాయమును ఈసంఘటనాపరంపరయొక్క ప్రాముఖ్యమును గ్రహింపవలయునన్నచో అప్పటివఱకును జరిగిన రామునిచరిత్రలోని కొన్నివిశేషములను పరిశీలింపవలసియున్నది. ఈపరిశీలనమును మనము పట్టాభిషేకముతో ప్రారంభింపవచ్చును.

రావణవధానంతరము శ్రీరామచంద్రుఁడు అయోధ్యలో సీతతోఁ గూడ పట్టాభిషిక్తుఁ డయ్యెను. ఆనాఁడు మధ్యాహ్నమే అగస్త్యాది మహర్షులు వచ్చి శ్రీరాముని అభినందించిరి. మహా కార్యమును నిర్వహించినవానిని అభినందుంచుట ధర్మము. "అతఁడు తనకర్తవ్యమునే గదా నిర్వహించినాఁడు. అభినందింప వలసినదేమున్నది." అని యూరకుండరాదు. పిమ్మట రాముఁడు కోరఁగా అగస్త్యుఁడు రావణాదుల వృత్తాంతములను వివరించెను. రాముఁ డది విని "నేను చేయుయజ్ఞములకు తమరందఱును రావలయును" అని ప్రార్థించెను.

శ్లో॥ క్రతూ నహం కరిష్యామి ప్రభావాత్ భవతాం సతామ్॥

శ్లో॥ సదస్యా మమ యజ్ఞేషు భవన్తో నిత్య మేవ తు।
భవిష్యథ మహావీర్యా మమానుగ్రహకాంక్షిణః॥

శ్లో॥ త దాగన్తవ్య మనిశం భవద్భి రిహ సంగతైః॥
ఉత్తర-సర్గ-36, శ్లో, 57, 58, 60

సంధ్యాకాలము రాఁగానే ఋషులు వెడలిపోయిరి.

ధర్మముచేత విదితాత్ముఁడైనరాముఁడు అభిషిక్తుఁడు కాఁగా ఆరాత్రి పౌరులకు హర్షవర్ధనియై గడచె నని కవి వర్ణించెను.

శ్లో॥ అభిషిక్తే తు కాకుత్స్థే ధర్మేణ విదితాత్మని।
వ్యతీతా సా నిశా పూర్వా పౌరాణాం హర్షవర్ధనీ॥
ఉత్తర-సర్గ-37 శ్లో. 1

ఇందు రాముఁడు విదితాత్ముఁడు, అనగా ఆత్మను తెలిసి కొన్నవాఁడు, అని చెప్పబడినది. "ధర్మేణ" (ధర్మముచేత) అను పదమును "అభిషిక్తే", "విదితాత్మని" అనుపదములతో అన్వయింపవచ్చును. "ధర్మేణ అభిషిక్తే" అని అన్వయించినచో ధర్మముచేత అభిషిక్తుఁడు కాఁగా అనియర్థ మేర్పడును. పితృవాక్య పాలనము సత్యవ్రతము మొదలగు ధర్మము లేవియు భంగపడకుండ, పరాక్రమముతో అయోధ్యా రాజ్యము నాక్రమింపక కేవలము ధర్మము సాధనముగా రాముఁడు పట్టాభిషేకము నొందె నన్న మాట. "ధర్మేణ విదితాత్మని" అనప్పుడు ధర్మానుష్ఠానము సాధనముగా రాముఁడు ఆత్మ నెఱింగె నని యర్థము.

పట్టాభిషేకమహోత్సవములు ముగిసినవి. కాలము గడచుచున్నది. వచ్చినవారెవరును తమదేశములకు పోవలె నని తలంచుటలేదు. సీతారాములను నిత్యము చూచుచున్నవారికి హర్షపారవశ్యమున ఆదంపతులను వీడ్కొనవలయు నను తలంపే కలుగుట లేదు. వారి నందఱును స్వస్థానములకు పంపి ఆయాదేశములలో వారు ప్రజాపాలనాదికర్తవ్యములను నిర్వహించునట్లు చేయవలసినకార్యమును గూడ రాముఁడే చేయవలసియుండెను. మొట్టమొదట రాముఁడు జనకునితో నిట్లనెను. "తమరే మాకు దిక్కు, తమచేతనే మేము పాలింపఁబడితిమి, తమయొక్క ఉగ్రమైన తేజముచేతనే రావణుఁడు నాచే నిహతుఁడయ్యెను, నేనిచ్చు రత్నములనుగైకొని తమరింక మిథిలకు బయలుదేరుఁడు. భరతుఁడు మీ వెంట రాగలఁడు".

శ్లో॥ భవాన్ హి గతి రవ్యగ్రా, భవతా పాలితా వయమ్।
భవత స్తేజ సోగ్రేణ రావణో నిహతో మయా॥

శ్లో॥ తద్భవాన్ స్వపురం యాతు రత్నా న్యాదాయ పావర్థి।
భరత శ్చ సహాయార్థం పృష్టత శ్చానుయాస్యతి॥

ఉత్తర–సర్గ–37. శ్లో. 3, 5

రావణుని సంహారమునకు జనకుని తేజము కూడ కారణ మని రాముఁడు చెప్పుచుండుట గమనింపదగియున్నది. పెద్దల యనుగ్రహము లేక ఎవ్వరును మహాకార్యములను సాధింపలేరు. అది కార్య నిర్వహణమున అప్రత్యక్షసాధనము. దీనివలన రాముని వినయశీలము చక్కఁగా వ్యక్తమగుచున్నది. అంతట జనకుఁడు అకానుక లన్నియు సీతకే యొసంగి మిధిలకు పోయెను.

తరువాత రాముఁడు కైకేయితమ్ముఁడైన యుధాజిత్తు నిట్లే ప్రార్థించెను. ప్రయాణసమయమున రాముఁ డాయనకు ప్రదక్షిణము గావించి నమస్కరించెను. యుధాజిత్తు కూడ రామునకు ప్రదక్షిణ మాచరించి తన కిచ్చినకానుకలును అచ్చటనే యుంచి వెడలిపోయెను. లక్ష్మణుఁడు ఆయనవెంట సాగనంపుటకు పోయెను. మేనల్లునకు యుధాజిత్తు ఏల ప్రదక్షిణము గావించెను? చక్రవర్తి యనుగౌరవముతో రామునకు యుధాజిత్తు ప్రదక్షిణము గావించెనని వ్యాఖ్యాతలు చెప్పిరి. కాని యుధాజిత్తు రాముని మహత్త్వమును గాంచుచు పారవశ్యమున అట్లు చేసె ననుటయు సమంజసముగనేయుండును. కైకవలన రామాదు లందఱు పెక్కు కష్టములకు గుఱియైరి. అయినను అకుటుంబమున కౌసల్యా సుమిత్రలతో సమానముగనే కైకయు గౌరవింపఁబడుచుండినది. ఇది యసాధారణము, రామునియాజ్ఞ అట్టిది. జరిగినదాని నంతను పరిశీలించుచున్న యుధాజిత్తునకు రాముఁడు పరమేశ్వరుఁడే యను భక్తిభావము ఏర్పడుట అసంభవము కాదు.

పిదప రాముఁడు మిత్రుఁడైన ప్రతర్దనుఁడను కాశీరాజును, రావణునిపై దండయాత్రకై భరతుఁడు పిలిపించిన మూఁడువందల మంది రాజులను అభినందన పురస్సరముగా సాగనంపెను. రాముఁడు వారితో నిట్లనెను. "మహాత్ములైన మీయొక్క అనుభావముచేత, తేజస్సుచేతను దురాత్ముఁడైన రావణుఁడు హతుఁడయ్యెను. అందులకు నేను నిమిత్తమాత్రుఁడనే".

శ్లో॥ యుష్మాకం చానుభావేన తేజసా చ మహాత్మనామ్॥
శ్లో॥ హతో దురాత్మా దుర్బుద్ధీ రావణో రాక్షసాధమః॥
హేతుమాత్ర మహం తత్ర భవతాం తేజసా హతః॥
ఉత్తర—సర్గ-37. శ్లో॥ 23, 24

ప్రశంసించుట యందును రాముఁ డెంతటినిపుణుఁడో మనము గ్రహింపవచ్చును.

ఆ రాజులు తమనగరములకు చేరి యటనుండి పెక్కు కానుకలను రామునకు పంపిరి. వానిని రాముఁడు సుగ్రీవాదుల కొసంగి సత్కరించెను. వారందఱు అయోధ్యలో సకలసుఖముల ననుభవించుచుండఁగా సుమారు పండ్రెండుమాసములు నిమేషములవలె గడచిపోయెను, తనకు పరమోపకారులైన వీరిని వీడ్కొనుట రామునకు సులభము కాదు. కష్టమేయైనను అయన కర్తవ్యమును పాలించెను. రాముఁడు వారి నందఱును ప్రత్యేకముగా ప్రీతితో కౌఁగిలించుకొని కనుల నీరు నించుచుండఁగా సాగనంపెను అప్పు డాంజనేయుఁడు రామునకు ప్రణమిల్లి యిట్లు ప్రార్థించెను, "నీయందు నాకు పరమస్నేహ ముండునుగాక; భక్తియు భావమును మఱొకదానియందు ఉండకుండునుగాక! ఎంతకాలము భూమి

అయోధ్యనుండి వెడలిపోయిన యాంజనేయుఁడు శ్రీరాము నెట్లు ధ్యానించుచుండెనో శుకమహర్షి భాగవతమున ఇట్లువర్ణించెను.

"పరమభాగవతుఁడైన హనుమంతుఁడు కింపురుషులతోఁ గూడి కింపురుషవర్షమున లక్ష్మణాగ్రజుఁడు, సీతాభిరాముఁడు, భగవంతుఁడు ఆదిపురుషుఁడునైన రాముని తచ్చరణసన్నికర్షా భిరతుఁడై అవిచలితభక్తితో ఉపాసించుచుండును. 1

ఆర్ష్టిషేణునితో కూడ గంధర్వులచేత గానము చేయఁబడు చుండు పరమకళ్యాణియైన భగవత్కథను చక్కఁగా వినుచు, తానును స్వయముగా నిట్లు గానము చేయుచుండును. 2

ఉత్తమశ్లోకుఁడైన భగవంతునకు నమస్కారము. ఆర్యలక్షణ శీలవ్రతునకు నమస్సు, ఉపశిక్షాతాత్ముఁడైన వానికి నమస్సు, ఉపాసితలోకునకు నమస్సు, సాధువాదనికషణునకు నమస్కారము, బ్రహ్మణ్య దేవునకు, మహాపురుషునకు, మహారాజునకు నమస్కారము. 3

ఎవఁడు విశుద్ధానుభవమాత్రుఁడో, ఒక్కఁడుగ నుండునో, తన తేజస్సుచే నెవ్వఁడు గుణవ్యవస్థను ధ్వంసమొనరించునో, ఎవఁడు ప్రత్యగ్రూపుఁడో, ప్రశాన్తుఁడో, సుధీలభ్యుఁడో, నామ రూపములు లేనివాఁడో అహంకారరహితుఁడో అట్టివానిని అహం కారరహితుఁడనై పొందుచున్నాను. 4

భగవంతుఁడు కేవలము రాక్షసులను వధించుటకే కాక ఈలోకమున మానవులకు సద్వర్తనమును గఱపుటకై మర్త్యుఁడుగా అవతరించినాఁడు. లేకున్నచో ఆత్మరతుఁడైన యీశ్వరుఁడు సీతా నిమిత్తముగా కడగండ్లపా లగుటేమి? 5

ఆత్మవంతులకు సుహృత్తముఁడు; భగవంతుఁడు, ఆత్మ స్వరూపుఁడునైన వాసుదేవుఁడు ముజ్జగములయం దెందును సక్తుఁడు కాఁడు; స్త్రీనిమిత్తముగా దుఃఖమును లక్ష్మణవియోగ మును పొందఁదగఁడు. 6

గొప్పవంశమున జన్మము, సుభగత్వము, వాక్చాతుర్యము, బుద్ధి, శక్తి, సుందరాకృతియు ఆయనకు సంతోషమును కలిగించుటకు సాధనములు కావు; ఇవి యేవియును లేని వనచరుల మైన మాతో ఆలక్ష్మణాగ్రజుఁడు స్నేహ మొనర్చెను గదా! 7

కృతజ్ఞుఁడుగా, ఉత్తమపురుషుఁడుగా, రాముఁడుగా మనుజాకృతి నొందినయావిష్ణుదేవుని, ఉత్తరకోసల ప్రజలను స్వర్గమునకుఁ గైకొనిపోయినవానినే, దివిజుఁడు గాని, అసురుఁడు గాని, నరుఁడు గాని, వానరుఁడుగాని ఎవ్వడైనను సకలవిధముల భజింపవలయును. 8

శ్రీశుకః "కింపురుషే వర్షే భగవన్త మాదిపురుషం లక్ష్మణాగ్రజం సీతాభిరామం రామం తచ్చరణసన్నికర్షాభిరతః పరమభాగవతో హనుమాన్ సహ కింపురుషై రవిరతభక్తి రుపాస్తే॥

అర్ష్టిషేణేన సహ గంధర్వై రనుగీయమానాం పరమకళ్యాణీం భర్తృభగవత్కథాం సముపశృణోతి స్వయం చేదం గాయతి॥ 2

ఓం నమో భగవతే ఉత్తమశ్లోకాయ నమ ఆర్యలక్షణశీలవ్రతాయ నమ ఉపశిక్షితాత్మనే నమ ఉపాసితలోకాయ నమ స్సాధువాదనికషణాయ నమో బ్రహ్మణ్యదేవాయ మహాపురుషాయ మహారాజాయ నమ ఇతి॥ 3

శ్లో॥ య త్త ద్విశుద్ధానుభవైకమాత్రం
స్వతేజసా ధ్వస్తగుణవ్యవస్థమ్।
ప్రత్యక్ ప్రశాన్తం సుధియోపలంభనం
హ్యనామరూపం నిరహం ప్రపద్యే॥ 4

శ్లో॥ మర్త్యావతార స్త్విహ మర్త్యశిక్షణం
రక్షోవధాయైవ న కేవలం విభోః।
కుతోఽన్యథా స్యా ద్రమత స్స్వ ఆత్మని
సీతాకృతాని వ్యసనా నీశ్వరస్య॥ 5

శ్లో॥ న వై స ఆత్మాత్మవతాం సుహృత్తమః
సక్త స్త్రిలోక్యాం భగవాన్ వాసుదేవః।
న స్త్రీకృతం కశ్మల మశ్నువీత
న లక్ష్మణం చాపి విహాతు మర్హతి॥ 6

శ్లో॥ న జన్మ నూనం మహతో న సౌభగం
న వా న్న బుద్ధి ర్నాకృతి స్తోష హేతుః।
తై ర్య ద్విసృష్టా నపి నో వనౌకసః
చకార సఖ్యే బత లక్ష్మణాగ్రజః 7

శ్లో॥ సురోఽసురో వా ప్యథ వానరో నరః
సర్వాత్మనా య స్సుకృతజ్ఞ ముత్తమమ్!
భజేత రామం మనుజాకృతిం హరిం
య ఉత్తరా ననయత్ కోశలాన్ దివ మితి॥ 8

శ్రీమద్భాగవతే పంచమస్కంధే ఏకోనవింశాధ్యాయే।

ఇందు ఆంజనేయుఁడు శ్రీరాముని అద్వయపరతత్త్వము నుగా నెఱింగి భావించుచున్నను, ఆయనచరిత్రగానమునే యవలంబించి ఉపాసించుచుండుట గమనింపఁదగియున్నది.

బంధువులను మిత్రులను పంపినపిమ్మట రాముఁడు తమ్ములతో సుఖముగా నుండఁగా కుబేరునియొద్దనుండి పుష్పకము తిరిగివచ్చి, "నీవు రామునే సేవించుచుండు" మని తన్నుఁ కుబేరుఁ డాదేశించినట్లు రామునకు విన్నవించెను." అట్లయినచో నీకు స్వాగతము. కుబేరుని యానుకూల్యమువలన మాకు వృత్తదోషము కలుగదు." అని పలికి రాముఁడు దానిని లాజలతో పుష్పములతో అర్చించి, "నీ వింక యథేష్టముగ పొమ్ము; స్మరించి నప్పుడు రమ్ము" అని పంపెను.

పిమ్మట రాముఁడు సీతతో కూడ అశోకవనమున ప్రవేశించి క్రీడింపఁజొచ్చెను. ఇట్లు వారు సుఖముగా విహరించుచుండఁగా భోగప్రదమై శుభమైన శిశిరకాలము గడచెను.

శ్లో॥ తథా తయో ర్విహరతో స్సీతారాఘవయో శ్చిరమ్।
అత్యక్రామత్ శుభః కాలః శైశిరో భోగద స్సదా॥
ఉత్తర-సర్గ-24. శ్లో. 25

శుభకాలమున గడచె ననుటవలన అశుభము రాఁబోవుచున్న దని కవి సూచించుచున్నాఁడు. సుగ్రీవాదులను పంపినతరువాత నొక్క సంవత్సరము గడచె నన్నమాట. అభిషేకమునకు పిమ్మట రెండేండ్లు గడచినవి.

ఒకనాఁడు సాయంకాలము సీత తనయొద్దకు వచ్చినప్పుడు రాముఁ డామెయందు గర్భలక్షణములను గుర్తించి యభినందించి "ఏమి కావలయునో కోరుకోనుము" అని యడిగెను. ఆమె నవ్వి "గంగాతీరమందలి పుణ్యతపోవనములను దర్శింపఁగోరుచున్నాను; అచ్చట ఒక్కరాత్రియైనను వసింపవలయును; ఇది నాకు శ్రేష్ఠ మైనకోరిక" (ఏష మే పరమః కామః") అని పలికెను. "అట్లే; రేపుతప్పక పోఁగలవు; సందేహములేదు" అని పలికి రాముఁడు మిత్రులతోకూడ మధ్యకక్ష్యాంతరమునకు వచ్చెను.

అక్కడ విజయుఁడు, మధుమత్తుఁడు, కాశ్యపుఁడు, మంగళుఁడు. కులుఁడు. సురాజి, కాళియుఁడు, భద్రుఁడు, దంతవక్త్రుఁడు, సుమాగధుఁడు అనుమిత్రులు వినోదముగా ప్రసంగింపఁజొచ్చిరి. ఒకకథాసందర్భమున రాముఁడు భద్రుని జూచి, "నన్నుగూర్చి సీతాభరతశత్రుఘ్నాదులనుగూర్చి పౌరులు జానపదులను ఏ మనుకొనుచున్నారు?" అని అడిగెను. భద్రుఁడు రావణ వధాదిరామపరాక్రమప్రశంసలనుగూర్చి చెప్పుచుండఁగా రాముఁడు "శుభాశుభములను రెండింటిని చెప్పుము. నేను వానిని విని మంచిపనులను చేయుచు, చెడ్డపనులను మానుకొందును. ప్రజలు నన్ను గూర్చి ఎట్టిపాపపుమాటలు అనుకొనుచున్నను నీవు నిర్భయముగా చెప్పుము" అని పలికెను. అప్పుడు భద్రుఁడిట్లనెను. "రావణుని సంహరించినపిమ్మట రాముఁడు ఏవగింపు లేక సీతను రావణుఁడు ఒడిలో కూర్చుండఁబెట్టుకొని తీసికొనిపోయినదానిని మరల యింటికి తెచ్చుకొన్నాడు. ఆయనకు సీతాసంభోగము వలన సుఖ మెట్టిదో కదా! లంకలో అశోకవనమున రాక్షసులకు లోఁబడియున్న దానిని ఆయన ఎట్లు ఏవగించుకొనక ఉండఁ

గల్గుచున్నాఁడు? ఇట్టిది మనభార్యలయందును మనము కూడ సహింపవలసినదే, రాజు ఎట్లుచేయునో అట్లుకదా ప్రజ లతని ననుసరించి వర్తింతురు అని యిట్లు బహువిధముల అయోధ్యలో, ఇతరనగరములలో సకలజనపదములయందును ప్రజలు చెప్పు కొనుచున్నారు." అది విని రాముఁడు పరమదుఃఖితుఁడై తక్కిన వారిని చూచి ఇది యేమి? మీరు చెప్పుఁడు" అని అడిగెను. వా రందఱు నేలపై సాగిలఁబడి ప్రణమిల్లి "ఇది యిట్లే, సంశ యము లేదు." అని పలికిరి. అంతట రాముఁడు వారిని పంపి వేసెను

శ్లో॥ హత్వా చ రావణం సంఖ్యే సీతా మాహృత్య రాఘవః।
అమర్షం పృష్ఠతః కృత్వా స్వవేశ్మ పున రానయత్॥

శ్లో॥ కీదృశం హృదయే తస్య సీతాసంభోగజం సుఖమ్।
అంక మారోప్య తు పురా రావణేన బలాద్ధృతామ్॥

శ్లో॥ లంకా మపి పురా నీతా మశోకవనికాం గతామ్।
రక్షసాం వశ మాపన్నాం కథం రామో న కుత్స్యతి॥

శ్లో॥ అస్మాక మపి దారేషు సహనీయం భవిష్యతి।
యథా హి కురుతే రాజా ప్రజా త మనువర్తతే॥

శ్లో॥ ఏవం బహువిధా వాచో వదన్తి పురవాసినః
నగరేషు చ సర్వేషు రాజన్ జనపదేషు చ॥

శ్లో॥ తస్యైవం భాషితం శ్రుత్వా రాఘవః పరమార్తవత్
ఉవాచ సుహృద స్సర్వాన్ కథ మేత ద్వదన్తు మామ్॥

శ్లో॥ సర్వే తు శిరసా భూమా వభివాద్య ప్రణమ్య చ।
ప్రత్యూచూ రాఘవం దీన మేవ మేత న్న సంశయః॥

ఉత్త-రసర్గ-43-శ్లో. 16—12

పిమ్మట రాముఁడు కర్తవ్యమును నిశ్చయించుకొని ద్వారపాలకుని పంపి తమ్ములను పిలిపించి వారితో నిట్లనెను. "నరేశ్వరులారా। మీరే నాకు సర్వస్వము; మీరే నాకు జీవితము, మీరు శాస్త్రార్థముల నెఱింగినవారు; బుద్ధిచేత పరినిష్ఠితులు; మీరందఱును నాకార్యమును సాధింపవలె".

శ్లో॥ భవన్తో మమ సర్వస్వం భవన్తో జీవితం మమ।
భవద్భిశ్చ కృతం రాజ్యం పాలయామి నరేశ్వరాః॥

శ్లో॥ భవన్తః కృతశాస్త్రార్థా బుద్ధ్యా చ పరినిష్ఠితాః!
సంభూయ చ మదర్థోఽయ మన్వేష్టవ్యో నరేశ్వరాః॥
ఉత్తర-సర్గ-44—శ్లో. 19. 20

ఆమాటలు విని వారు ఆయన ఏమి చెప్పునో యని యుద్విగ్నులైరి. రాముఁడు ముఖము ఎండిపోవుచుండఁగా మరల నిట్లు పలికెను. "పౌరులయందు నన్నుగూర్చి సీతావిషయముగా ఎట్టి కథ పైకివచ్చినదో వినుఁడు, బీభత్సమైన యీజనాపవాదము నామర్మములను భేదించుచున్నది. నేను మహాత్ములైన యిక్ష్వాకుల యింట జన్మించితిని. సీతయును మహనీయులైన జనకులయింట జన్మించినది. లక్ష్మణా! దండకలో లంకలో జరిగినది నీకు తెలియును. లంకలోనున్న సీతను అయోధ్య కెట్లు గొనిపోవుదు నను సందేహము నాకప్పుడే కలిగినది. ఎల్లరకును విశ్వాసము కలిగించుటకే అప్పుడు సీత అగ్నిలో ప్రవేశించినది. నీవు చూచుచుండఁగనే అగ్నిదేవుఁడు దేవతలయొక్క మహర్షులయొక్క సమక్షమున, "సీత పాపరహిత" అని పలికెను. వాయువు చంద్రాదిత్యులును మెచ్చిరి. అప్పుడు ఇంద్రుడు సీతను నా కర్పించెను ఆమె పరిశుద్ధురాలని నాయంతరాత్మయు నెఱుంగును.

శ్లో॥ అంతరాత్మా చ మే వేత్తి సీతాం శుద్ధాం యశస్వినీమ్॥
ఉత్తర-సర్గ-1. 45-శ్లో 10

ఇప్పు డీమహాపవాద మేర్పడినది. హృదయమును శోక మాక్రమించుచున్నది. ఎవనియొక్క అపకీర్తి లోకమున ప్రసరించుచుండునో వాఁడు పతితుఁడగును, మహాత్ములందఱును కీర్తి కొఱకు ప్రయత్నించుచుందురు. అపవాదభీతుఁడనైన నేను జీవితమును గాని మిమ్మెనను పరిత్యజింపఁగలను; జానకిసంగతి చెప్ప వలసిన దేమున్నది? శోకసాగరమున పడియున్ననన్ను జూడుఁడు. ఇంతకుమించి దుఃఖమును ముందెన్నఁడును నేను పొందియుండ లేదు. లక్ష్మణా! రేపు ఉదయము సీతను రథముపైఁ గొనిపోయి మనరాజ్యమున కావల వదలిపెట్టుము. గంగకు అవ్వలియొడ్డున తమసా నదీతీరమున వాల్మీకియాశ్రమము కలదు. అచ్చట విజన దేశమున ఆమెను వదలి నీవు త్వరగా తిరిగి రమ్ము. నాకు బదులు చెప్పకుము. ఇంతకుముందే ఆమె గంగాతీరమందున్న యాశ్రమములను చూడవలెనని నన్ను కోరియున్నది. ఆమెకోరికగా ఇది జరుగునుగాక". ఇట్లు పలికి రాముఁడు కన్నీరు స్రవించుచుండఁగా నిట్టూర్చుచు సోదరులను పంపివైచి లోనికిపోయెను.

శ్లో॥ అప్యహం జీవితం జహ్యాం యుష్మాన్ వా పురుషర్షభాః॥
శ్లో॥ అపవాదభయా ద్భీతః కిం పున ర్జనకాత్మజామ్।
తస్మా ద్భవన్తః పశ్యన్తు పతితం శోకసాగరే॥
శ్లో॥ న హి పశ్యా మ్యహం భూతం కించి ద్దుఃఖ మితోఽధికమ్
శ్వ స్త్వం ప్రభాతే సౌమిత్రే సుమంత్రాధిష్ఠితం రథమ్॥
శ్లో॥ ఆరుహ్య సీతా మారోప్య విషయాన్తే సముత్సృజ।
గంగాయా స్తు పరే పారే వాల్మీకే స్తు మహాత్మనః॥

శ్లో॥ ఆశ్రమో దివ్యసంకాశః తమసాతీర మాశ్రిత!
తత్రైతాం విజనే దేశే విసృజ్య రఘునన్దన॥

శ్లో॥ శీఘ్ర మాగచ్ఛ సౌమిత్రే కురుష్వ వచనం మమ!
న చాస్తి ప్రతివక్తవ్యం సీతాం ప్రతి కథంచన॥

శ్లో॥ పూర్వ ముక్తోఽహ మనయా గంగాతీరేఽహ మాశ్రమాన్
పశ్యేయ మితి,తస్యా శ్చ కామ స్సంవర్త్యతా మయమ్॥
ఉత్తర–సర్గ–4.5 శ్లో. 14, 15, 16, 17, 18, 19, 23.

సీత అపహరింపఁబడినప్పుడు రాముఁడు పంచవటియందును. కిష్కింధదాపున ప్రస్రవణగిరియందును శోకించినట్లు ఇప్పుడు అవశుఁడై విలపింపకుండుట గమనింపఁదగియున్నది. అపహరణముకన్నను ఈపరిత్యాగమే అధికదుఃఖమును కలిగించుచున్నదని ఆయనయే చెప్పెను. అనఁగా ప్రయత్నపూర్వకముగా దుఃఖమును నిగ్రహించుచున్నాఁ డన్నమాట. విలపించుటకును వీలులేని దుస్థ్సితి అది.

రామునకు కలిగినయీదుస్థ్సితి యెట్టిదో మనము చక్కఁగా విమర్శించి గ్రహింపవలసియున్నది. రాముఁడు గావించినయీనిర్ణయము సమంజసము కాదని తలంచువారును కొందఱు కలరు. ఇది నృశంసముగానున్నదని లక్ష్మణుఁడే, సీతను వదలిపెట్టి తిరిగివచ్చునప్పుడు, సుమంత్రునితో నిట్లు చెప్పెను. "వెనుక తండ్రిగారివచనమున రాముఁడు పదునాలుగేండ్లు అడవులలో ఉండుటకన్నను ఇది దుఃఖతరముగా నున్నది. ఇప్పుడు పౌరులమాటలనుబట్టి సీతను పరిత్యజించుట నృశంస మనియే నాకు తోఁచు

చున్నది. అర్థహీనముగా ప్రల్లదములాడు పౌరులకొఱకు ఆయన మైథిలిని నిర్వాసితను గావించినాఁడు గదా! ఈ యశోహరమైన కార్యమువలన ఆయన సంపాదించిన ధర్మసంచయ మేమి?"

శ్లో॥ పురా రామః పితృవాక్యాత్ దండకే విజనే వనే।
ఉషిత్వా నవవర్షాణి పంచ చైవ మహావనే॥

శ్లో॥ తతో దుఃఖతరం భూయః సీతాయా విప్రవాసనమ్।
పౌరాణాం వచనం శ్రుత్వా నృశంసం ప్రతిభాతి మే॥

శ్లో॥ కో ను ధర్మాశ్రయ స్సూత కర్మణ్యస్మిన్ యశోహరే।
మైథిలీం సమను ప్రాప్తః పౌరైర్హీనార్థవాదిభిః॥
ఉత్తర-సర్గ-50. శ్లో. 6. 7, 8.

[శ్లో. 8. తిలకటీక - హీనార్థవాదిభిః, న్యాయహీనార్థవాదిభిః; పౌరైః, హేతుభిః, మైథిలీంప్రతి; యశోహరే, సాధ్వీం వనే విసృష్టవాన్ ఇతి అయశస్కరే; అస్మిన్ కర్మణి, సీతాపరిత్యాగకర్మణి అనుష్ఠితేసతి; కో ను ధర్మాశ్రయః, ధర్మపరిగ్రహః, సంప్రాప్తో రామేణ.]

లక్ష్మణునకే యట్టియభిప్రాయ మున్నప్పుడు ఇతరుల కుండుటలో ఆశ్చర్యము లేదు. కాని లక్ష్మణుఁడు అట్టియభిప్రాయమునే ఇంత కన్నను తీవ్రముగా, కైకవరములకొఱకు అడవులకు బయలుదేరునపుడు రాముని ప్రతిఘటించుచు వ్యక్తపఱచినాఁడు. అప్పుడు లక్ష్మణుఁడే కాదు కైకతప్ప తక్కినవారు కౌసల్య, దశరథుఁడు, భరతుఁడు మొదలుగా అందఱును రామునకు అడ్డుపడినవారే. ఇప్పుడు సీతనుగూర్చి రాముని నిందింపుచుండ

ప్రజలే ఆనాఁడు అడవికి పోవల దని రాముని వెంబడించి ప్రార్థించిరి. అంతమాత్రమున వారు చెప్పినవి ధర్మ మని, రాముఁడు కావించినది అధర్మ మని నిశ్చితము కాలేదు. ఆనాఁడు వారికి కావలసినది ధర్మాధర్మముల నిర్ణయము కాదు. రాముఁ డెట్లయిను పట్టాభిషేకము నొందవలయు ననుటయే వారియాకాంక్ష. ఆనాఁడు రాముఁడు వారియాకాంక్షకు లొంగి అడవులకు పోకుండ నున్నచో, తరువాత వారే రాముని ధార్మికునిగా భావించియుందురా? ఆ కరుణోద్వేగము గడచిన పిమ్మట వారే, రాముఁడును మనవంటి యవకాశవాదియే కాని నిజముగా ధార్మికుఁడు కాఁడని చెప్పుకొనియుందురు. కావున తాత్కాలికములైన యావేశములతో సంచలించుచిత్తవృత్తులుగల సామాన్యులమాటలనుబట్టి ధర్మమును నిశ్చయించుటకు వీలు లేదు. ధర్మమునకు శాస్త్రమే ప్రమాణము. శాస్త్రము ననుసరించి ప్రశాంతచిత్తులైన మహర్షులే ధర్మమును నిశ్చయింపఁగలరు. కావుననే చిత్రకూటమున భరతుఁడు రాముని యెదుట ప్రత్యుపవేశము కాంచినప్పుడు దివ్యులైన మహర్షులు దిగివచ్చి, కైకవిషయమున దశరథునిఋణమును దీర్చుటకై రాముఁడు వనవాసమును గావించుట ధర్మమే యని నిశ్చయించి చెప్పిరి. అట్లు ధర్మమును నిశ్చయించుకొని దానిని అసిధారావ్రతముగ పాటించుటవలననే శ్రీరాముఁడునాఁటినుండి నేఁటివఱకును ధర్మమూర్తిగా పూజింపబడుచున్నాఁడు. ఇట్లే సీతాపరిత్యాగవిషయమునఁగూడ తనకు తనవారికిని ఎంత దుఃఖము కలుగుచున్నను రాముఁడు శాస్త్రము ననుసరించియే తన కర్తవ్యమును నిశ్చయించుకొనెను.

ఆయననిర్ణయమునకు హేతువులను మనమిట్లు గ్రహింపవచ్చును. లంకనుండి అయోధ్యకు సుమారు రెండువేలమైళ్ళ

దూరమున్నది. అంతదూరమున జరిగిన సీతయొక్క అగ్నిప్రవేశ వృత్తాంతమును ప్రజలు నమ్మలేకపోయిరి. సీత అగ్నియందు ప్రవేశించినప్పుడు చూచిన వారు రామలక్ష్మణులే తప్ప అయోధ్యావాసు లింకెవ్వరును లేరు. సీతయందలి ప్రేమచే రామలక్ష్మణులు అగ్నిప్రవేశవృత్తాంతమును కల్పించి ఆమెను తీసికొనివచ్చి రని వారు భావించిరి. వానరులు రాక్షసులు సీతనుకొనియాడుచున్నప్పుడు, వారంతఱును రామునివలన ఉపకారము పొందినవారు కావున రామునకు ప్రియముగా ఆ కల్పనమును సమర్థించి రనియే ప్రజలు భావించిరి. పట్టాభిషేకమహోత్సవములు ముగిసి రాజులు వానరులు రాక్షసులు వెళ్లిపోయినతరువాత ప్రజలు బాహాటముగా చెప్పుకొనుటకు వీలులేక మనస్సులలో పెట్టుకొన్నసందేహములను రహస్యముగా నొకరికొకరు చెప్పుకొనఁ జొచ్చిరి. అది క్రమముగా పెరిగి పెద్దప్రమాద మయ్యెను. ఈసందేహము సాధారణ ప్రజలయందే కాక భద్రుఁడు మొదలగు రామునియాంతరంగికమిత్రులయందును ఏర్పడియున్నది. అప్పుడు ప్రజలను గాని మిత్రులను గాని నమ్మించుటకు మార్గ మేదియును లేదు. తటస్థముగ ఉపేక్షించి యూరకుండుటను వీలులేదు. ప్రజలు రాజుయొక్క ధర్మవృత్తిని శంకింపమొదలిడినచో వారివర్తనమునందు అధర్మమున కవకాశ మేర్పడవచ్చును. "ఇట్టిది మనభార్యలయందును మనము కూడ సహింపవలసినదే. రాజు ఎట్లు చేయునో అట్లు కదా ప్రజలు అతని ననుసరించి వర్తింతురు! అని ప్రజలు చెప్పుకొనుచున్నట్లు భద్రుఁడే చెప్పినాఁడుకదా! అపవిత్ర యైనను భార్యను వదులుకొనలేక ఆమెయందు తాను అసక్తుఁడై యుండె నను ప్రజలయభిప్రాయము నిరాధార మని రాముఁడు నిరూపింపవలసి యుండెను. అందులకు సీతను దూరముగా నుంచుట తప్ప రామునకు మార్గాంతరము కన్పింపలేదు. అందువలన, రాజకుటుంబమును అంతః

పురమునుండి దూరముగా నుంచవలసివచ్చినప్పుడు మహర్షుల యాశ్రమములలో నుంచవచ్చు ననునాచారమును అనుసరించి రాముఁడు సీతను వాల్మీకియాశ్రమప్రాంతమునకు చేర్చుమని లక్ష్మణునకు ఆదేశించెను. మహర్షి తప్పక ఆమెను ఆదరించు ననియే రాముఁడు నిశ్చయించుకొనెను.

రాముఁడు తనకీర్తిని, ప్రజానురంజనము ను తనకర్తవ్యమును మాత్రమే దృష్టిలో నుంచుకొని ఈనిర్ణయముచేసి సీతకు అన్యాయముఁ గావించెనని కొందఱు తలంతురు. కాని ప్రజానురంజనమున రామునకు ఎట్టి బాధ్యత యున్నదో, ఆయనతోపాటు పట్టాభిషేకము నొందిన రాణిగా సీతకును అట్టిబాధ్యతయే యున్నది" "రాముఁడు లేనప్పుడు అతని రాజ్యమును పాలించునధికారము ఆతనిపత్నియైన సీత కున్న" దని వసిష్ఠమహర్షి సీతారాములు వనములకు బయలుదేరునపు డుద్ఘాటించెను. "పరిగ్రహింపఁబడిన భార్యలు పురుషులకు ఆత్మవంటివారు. ఈమె రామునకు ఆత్మ, కావున రాజ్యమును పాలింపఁగలదు."

శ్లో॥ ఆత్మా హి దారా స్సర్వేషాం దారసంగ్రహవర్తినామ్।
ఆత్మేయ మితి రామస్య పాలయిష్యతి మేదినీమ్॥
అయోధ్య-సర్గ-37-శ్లో. 24

అధికారముతోపాటు బాధ్యతయు నుండును. కావున ప్రజానురంజనము సీతకును కర్తవ్యమే, అట్లే భర్తయొక్క కీర్తిని కాపాడుటయు తనకు కర్తవ్యమే యని ఆమెయు అంగీకరించినది. లక్ష్మణునితో రామునకు సందేశ మంపుచు ఆమె యిట్లన్నది. "అపవాదమువలన నీకుఁ గలిగిననిందను నేను కూడ తొలగింపవలసియే

యున్నది. నాకు నీవే కదా పరమగతి! "మఱియును ఈవార్తను ఆమె కూడ వినుట కొన్నాళ్ళకు సంభవింపక తప్పదు. అప్పుడామె అపవాదముతో, భర్తకు దిగులు కలిగించుచు అంతఃపురములో సుఖముగా నుండఁగలదా? ఆమె యైనను జనాపవాదమును ఎట్లు ఉపేక్షింపఁగలదు? అప్పుడైనను ఆమె తనకు తానుగా పౌరులకు దూరముగా ఏయాశ్రమములోనో ఉండవలయు నని తలంపక తప్పదు. అందువలననే ఆమె రామునిపై కోపింపలేదు; తన దుర్దైవమునే నిందించుకొన్నది.

ఇంతకఠినమైన నిర్ణయమును గావించుచున్నప్పుడు రాముఁడు సీతతో ముందుగా చెప్పియుండవలసిన దని కొంద అందురు. రాముఁడు అంతఃపురముననే ఈవిషయమును చెప్పినచో ఆమె విలపించుట మూర్ఛిల్లుటయు సంభవించును. అప్పుడు పరిజనమున కీవిషయము తెలియక తప్పదు. వెంటనే ఈవార్త నగర మంతయు వ్యాపించును, గర్భిణియైన భార్యను జనాపవాదము నకై రాముఁడు పరిత్యజించుచున్నాఁడని తెలిసినంతనే ప్రజలం దఱు గుంపులు కూడి తాత్కాలికమైన కారుణ్యోద్రేకముతో రథమున కడ్డుపడుటయు సంభవించును. వారు అడ్డుపడినారుకదా యని ఆమెను మరల అంతఃపురములోనే యుంచినచో, రాముఁడు తమ్ము బేలుపుచ్చుటకై యొక నాటక మాడె ననియే తరువాత వారు తలంతురు కాని సీత పవిత్రురా లని నమ్మరు. అందువలననే రాముఁడు ఈకార్యమును రహస్యముగా నిర్వహింపఁజేసెను.

మఱునాఁడు ఉదయము లక్ష్మణుఁడు సీతయొద్దకుపోయి "నీవు కోరినట్లుగా నిన్ను గంగాతీరమున ఆశ్రమములందు అరణ్యమున నేను వదలవలసియున్నది." అని పలికెను. ఆమె

సంతోషించి మునులకు మునిపత్నులకు ఇచ్చుటకై మంచి వస్త్రములు, రత్నములు, ఆభరణములును గైకొని బయలుదేరెను. రథము కదలినంతనే యశుభశకునములను చూచి ఆమె కలవరపడి రామునకు పురమునకు జనపదమునకు స్వస్తియగును గాకయని దేవతలను ప్రార్థించెను. లక్ష్మణుఁ డామాటలకు హృదయమునతపించుచు ఆమెకు నమస్కరించుచు "మంగళము" అని పలికెను.

ఆ రాత్రికి గోమతీరమున ఒకయాశ్రమమున బసచేసి మఱునాఁడు ఉదయము బయలుదేరి వారు మధ్యాహ్నమునకు గంగను చేరిరి. గంగను చూఁడగానే లక్ష్మణుఁడు పెద్దగా విలపించెను. సీత విస్మయము నొంది యిట్లనెను. "ఏల ఏడ్చెదవు? ఈగంగా తీరమును చేరినందులకు నేను సంతోషించుచుండఁగా నన్నేల కలఁతపెట్టెదవు? రామునకు దూరమై రెండు రాత్రులు ఉండవలసివచ్చినందులకే దుఃఖించుచున్నావా? నాకును రాముఁడు ప్రాణాధికుఁడు గదా! అయినను నేనిట్లునగచుటలేదే! నీవిట్లుబాలునివలెవర్తింపకుము గంగను దాటింపుము. మహర్షులకువస్త్రాదికము లొసంగి యభివాదనము గావించి యొకరాత్రిమాత్రము అచ్చట నుండి రేపే నగరమునకు పోవుదము. నాకును పద్మదళాయతాక్షుఁడైన శ్రీరాముని చూడవలయునని మనస్సు తొందరపెట్టుచున్నది."

వెంటనే లక్ష్మణుఁడు కనులు తుడుచుకొని నావికులను పిలిచి సుమంత్రుని ఉత్తర తీరముననే ఉండుమని చెప్పి, సీతతో కూడ ఓడ నెక్కి గంగను దాటెను.

దక్షిణతీరమునకు చేరినంతనే లక్ష్మణుఁడు సీతకు నమస్కరించి "రాముఁడు నాకు నియమించిన యీకృత్యమువలన లోకనిందితుఁడ నగుచున్నాను; హృదయమున శల్యము గ్రుచ్చినట్లున్నది.

ఇప్పుడు మూర్ఛయో మృత్యువో వచ్చిన నెంత బాగుండును? ఇంతగా లోకనింద్యమైన కార్యమునందు నియోగింపఁబడవలసిన వాఁడను గాను. అమ్మా! అనుగ్రహింపుము. నాయందు తప్పు లేదు'' అని విలపించుచు నేలపైఁ గూలబడెను.

శ్లో॥ శ్రేయో హి మరణం మే ఽద్య మృత్యుర్వా యత్పరం భవేత్
న చాస్మి న్నీదృశే కార్యే నియోజ్యో లోకనిందతే॥

శ్లో॥ ప్రసీద చ న మే పాపం కర్తు మర్హాసి శోభనే।
ఇత్యంజలికృతో భూమౌ నిపపాత స లక్ష్మణః॥

ఉత్తర-47-సర్గ-శ్లో.5 6

మృత్యువును గోరుకొనుచు విలపించుతున్న యతనిని జూచి సీత యావేగముతో,ఏమిది?నాకేమియు అర్థ మగుట లేదు. యథార్థ మును చెప్పుము. నీవు స్వాస్థ్యముతో నున్నట్లు లేదు. రాజునకు క్షేమమే కదా! ఆజ్ఞాపించుచున్నాను. జరిగిన సంగతిని చెప్పుము" అని పలికెను.

శ్లో॥ రుదన్తం ప్రాంజలిం దృష్ట్వా కాంక్షన్తం మృత్యుమాత్మనః॥
మైథిలీ భృశ సంవిగ్నా లక్ష్మణం వాక్య మబ్రవీత్॥

శ్లో॥ కిమిదం నావగచ్ఛామి, బ్రూహి తత్త్వేన లక్ష్మణ।
పశ్యామి త్వాం న చ స్వస్థం, అపి క్షేమం మహీపతేః॥

లక్ష్మణుఁడు గద్గదకంఠుఁడై యిట్లు చెప్పెను: "పురమున జనపదమునందును నిన్ను గూర్చి దారుణమైన యపవాదమును సభామధ్యమున విని రాముఁడు సంతప్తుఁడై అవిషయమును నాకు తెలిపి యింటి కరిగెను. ఆయనకు తాపమును కలిగించిన యా మాటలు నీయెదుట చెప్పఁదగినవికావు. ఏమైన నేమి? నీవు నిర్దోష

వయ్యును రాజుచేత నాసమక్షమున పరిత్యక్తవైతివి పౌరాపవాద భీతియే యిందులకు కారణము. నీవు అన్యథా తలంపకుము. రాజు యొక్క శాసనమును పాటించి నీవు గర్భిణీ సహజముగ కోరిన కోరికను అనుసరించి నిన్ను ఇచ్చట ఆశ్రమప్రాంతమున వదలిపెట్టి వెళ్లవలసియున్నది. ఇది జాహ్నవీతీరమున బ్రహ్మర్షులతపోవనము, పుణ్యము రమణీయమునైనది. విషాదము నొందకుము. పరమ కారుణికుఁడైన వాల్మీకి మహర్షి మాతండ్రిగారికి ఇష్టసఖుఁడు. ఆమహనీయుని పాదములయొద్ద ఉపవాసపరాయణవై రాముని ధ్యానించుచు నుండుము. అది నీకు పరమశ్రేయస్సు కలిగించును.

శ్లో॥ సా త్వం త్యక్తా నృపతినా నిర్దోషా మమ సన్నిధౌ।
పౌరాపవాదభీతేన గ్రాహ్యం దేవి న తేఽన్యథా
ఆశ్రమాంతేషు చ మయా త్యక్తవ్యా త్వం భవిష్యసి॥

శ్లో॥ రాజ్ఞ శ్శాసన మాదాయ తథైవ కిల దౌర్హృదమ్!
తదేత జ్జాహ్నవీతీరే బ్రహ్మర్షీణాం తపోవనమ్॥

శ్లో॥ పుణ్యం చ రమణీయం చ;మా విషాదం కృథా శ్శుభే।
రాజ్ఞో దశరథ స్యైవ పితు ర్మే మునిపుంగవః॥

శ్లో॥ సఖా పరమకో విప్రో వాల్మీకి స్సుమహాయశాః!
పాదాచ్ఛాయా ముపాగమ్య సుఖ మస్య మహాత్మనః॥
ఉపవాసపరైకాగ్రా వస త్వం జనకాత్మజే॥

శ్లో॥ పతివ్రతాత్వ మాస్థాయ రామం కృత్వా సదా హృది,
శ్రేయ స్తే పరమం దేవి తథా కృత్వా భవిష్యతి॥

ఉత్తర-సర్గ_47-శ్లో. 14, 15, 16, 17, 18

ఆమాటలను విని సీత దుఃఖపరవశయై నేలపై వ్రాలెను కొంతసేపటికి తెప్పరిల్లి ఆమె లక్ష్మణునితో ఇట్లనెను. "నాయీ శరీరము బ్రహ్మచేత దుఃఖముకొఱకే సృష్టింపబడినది. కావుననే ఆదుఃఖము యొక్క మూర్తి యంతయు ప్రదర్శింపఁబడుచున్నది. నేను పూర్వ జన్మములో ఏమి పాపము చేసితినో, ఎవఁడు నావలన భార్యా వియోగమును పొందెనో, నేనిప్పుడు పతివ్రత నయ్యును పతిచే విడువఁబడితిని. వెనుక రాముని పాదములను ఆశ్రయించుకొని యుండుటచే తపోవనములలో నుండఁగలిగితిని. కాని యిప్పుడు రాముఁడు లేకుండ, ఇష్టజనులకు దూరమై ఎట్లు ఆశ్రమములలో నుండఁగలను?"ఏమి తప్పు చేసితివి? నిన్నుభర్త ఎందులకు పరిత్య జించినాడు?" అని తాపసులు అడిగినచో ఏమి చెప్పుదును?లక్ష్మణా ఈజాహ్నవీజలమున నే నేల జీవితమును త్యజింపరాదు? అట్లయి నచో నాకు భర్తయైన రాజుయొక్క వంశము విచ్ఛిన్నమై పరిహాస పాత్రమును అగును. సరే! నీవు రాజాజ్ఞను నెరవేర్చి నన్ను వదలి పెట్టిపోయి ఆయనకు లోఁబడి యుండుము. నాయీమాటను వినుము. నీవు నాకు మాఱుగా అత్తల కందఱకు ఆరాజునకును ప్రణమిల్లి కుశలమడుగుము. ఆ రాజుతో ఇట్లు చెప్పుము. "సీత పవిత్రురాలని, నీయందు పరమభక్తిని కలిగినదని నీహితమును కోరునదియని, నీవునిజముగా నెఱుంగుదువు. అపకీర్తికి భయపడు చున్న నీచేత నేను అరణ్యమునందు వదలిపెట్టఁబడితిని. నీకు కలిగిననిందను నేను కూడ తొలగింపవలసియే యున్నది. నాకు నీవేకదా పరమగతివి. తమ్ములయందు ఎట్లు వర్తింతువో అట్లే పౌరులయందును వర్తింపుము. పౌరులను న్యాయముతో పాలించుట వలన కలుగుధర్మమే శ్రేష్ఠమైనది. దాని వలన కలుగు కీర్తియు ఉత్తమము. పౌరాపవాదమునుగూర్చి నేను బాధపడుచున్నంతగా నాశరీరమును గూర్చి బాధపడుటలేదు. స్త్రీకి పతియే బంధువు,

గురువు, దేవతయును అగును. కాఁబట్టి భర్తయొక్క కార్యము స్త్రీకి ప్రాణములకన్నను ప్రియమైనది. ఇట్లు సంగ్రహముగా నామాటగా రామునకు చెప్పుము. నేనిప్పుడు గర్భవతినై యున్నాను. నన్ను చూచి పొమ్ము."

సీతఇట్లు పలుకుచుండఁగా లక్ష్మణుఁడు దీనుఁడై ఏమి చెప్పుటకును నోరురాక పెద్దగా విలపించుచు ఆమెకు ప్రదక్షిణము చేసి నిట్టూర్చుచు నిలిచి "అమ్మా! ఏమనుచున్నావు? ఇంతకు పూర్వము నీరూపమును నేనెప్పుడును చూడలేదు; పాదములు మాత్రమే చూచియుంటిని. ఇప్పుడు రాముఁడు లేకుండ వనములో నిన్నెట్లు చూడఁగలనమ్మా" అనిపలుకుచు ఆమెకు నమస్కరించి యోడనెక్కి వెనుకకు తిరిగి చూచుచు అవ్వలితీరమునకు చేరెను.

శ్లో॥ మామికేయం తను ర్నూనం సృష్టా దుఃఖాయ లక్ష్మణ।
ధాత్రా యస్యా స్తథా మేఽద్య దుఃఖమూర్తిః ప్రదృశ్యతే॥

శ్లో॥ కిం ను పాపం కృతం పూర్వం కో వా దారై ర్వియోజితః॥
యాఽహం శుద్ధసమాచారా త్యక్తా నృపతినా సతీ॥

శ్లో॥ పురాహ మాశ్రమే వాసం రామపాదానువర్తినీ।
అనురుధ్యాపి సౌమిత్రే దుఃఖే చ పరివర్తినీ॥

శ్లో॥ సా కథం హ్యాశ్రమే సౌమ్య వత్స్యామి విజనీకృతా।
ఆఖ్యాస్యామి చ కస్యాహం దుఃఖం దుఃఖపరాయణా॥

శ్లో॥ కింను వక్ష్యామి మునిషు కర్మ చాసత్కృతం ప్రభో।
కస్మిన్ వా కారణే త్యక్తా రాఘవేణ మహాత్మనా॥

శ్లో॥ న ఖ ల్వద్యైవ సౌమిత్రే జీవితం జాహ్నవీజలే।
త్యజేయం; రాజవంశ స్తు భర్తు ర్మే పరిహాస్యతే॥

శ్లో॥ యథాజ్ఞం కురు సౌమిత్రే త్యజ మాం దుఃఖభాగినీమ్॥
నిదేశే స్థీయతాం రాజ్ఞః శ్రుణు చేదం వచో మమ॥

—: రామునితో చెప్పుమన్న మాటలు :—

శ్లో॥ జానాసి చ యథా శుద్ధా సీతా తత్త్వేన రాఘవ।
భక్త్యా చ పరయా యుక్తా హితా చ తవ నిత్యశః॥

శ్లో॥ అహం త్యక్తా చ తే వీర అయశో భీరుణా జనే।
యచ్చ తే వచనీయం స్యా దపవాదసముత్థితః॥
మయా చ పరిహర్తవ్యం; త్వం హి మే పరమా గతిః॥

శ్లో॥ యథా భ్రాతృషు వర్తేథాః తథా పౌరేషు నిత్యదా।
పరమో హ్యేష ధర్మ స్తే తస్మాత్ కీర్తిరనుత్తమా॥

శ్లో॥ యత్తు పౌరజనే రాజన్ ధర్మేణ సమవాప్నుయాత్।
అహం తు నానుశోచామి స్వశరీరం నరర్షభ॥

శ్లో॥ యథాపవాదః పౌరాణాం తథైవ రఘునన్దన।
పతి ర్హి దేవతా నార్యాఃపతి ర్బంధుః పతి ర్గురుః॥

శ్లో॥ ప్రాణై రపి ప్రియం తస్మా ద్భర్తుః కార్యం విశేషతః।
ఇతి మద్వచనా ద్రామో వక్తవ్యో మమ సంగ్రహః॥

శ్లో॥ నిరీక్ష్య మా ద్య గచ్ఛ త్వ మృతుకాలాతివర్తినీమ్।
ఏవం బ్రువన్త్యాంసీతాయాం లక్ష్మణో దీనచేతనః॥

శ్లో॥ శిరసా వంద్య ధరణీం వ్యాహర్తుం న శశాక హ।
ప్రదక్షిణం చ తాం కృత్వా రుదన్నేవ మహాస్వనః॥

శ్లో॥ ధ్యాత్వా ముహూర్తం తామాహ కిం మాం వక్ష్యసి శోభనే!
దృష్టపూర్వం న తే రూపం పాదౌ దృష్టౌ తవానఘే॥

శ్లో॥ కథ మత్ర హి పశ్యామి రామేణ రహితాం వనే।
ఇత్యుక్త్వాతాం నమస్కృత్య పున ర్నావ ముపారుహత్॥

ఉత్తరకాండ-48వసర్గ-శో. 3, 4, 5, 6, 7, 8, 9, 12, 13, 14, 15, 16, 17, 18, 19, 20, 21, 22.

సీతయొక్క దుస్థితి యూహింపవలసినదే కాని, వాక్కునకు అందునది కాదు ఆమె కిప్పుడు తన సంగతియే కాక, తన సంతానము సంగతి కూడ సమస్యగనే పరిణమించినది, ఆమెకు గర్భము కలిగిన విషయము వ్యక్తమైనంతనే రాముఁడు ఆ విషయమును గ్రహించి అభినందించుట, ఆమె కోర్కెను తీర్తునని చెప్పుట, వెంటనే ఆమె వనమున పరిత్యజింపఁబడుటయు సంభవించెను. అందువలన అంతఃపురములో అందరకును ఈవిషయము తెలియుటకు అవకాశములేదు. కావున ప్రజలకు అసలే తెలియదు. ఇట్టిపరిస్థితియందు ఆమె అడవిలో లేదా ఆశ్రమములో ప్రసవించినచో ఆ సంతానము రాముని బిడ్డలే యగుదురా, అని ప్రజలు మరల సంశయింపవచ్చును. సీతయొక్క శీలమును శంకించుచున్న యా ప్రజలు, ఆమెబిడ్డలను రాజకుమారులుగా అంగీకరింతురా యన్నది సందేహాస్పద మగువిషయమే. అందువలననే తాను అంతఃపురమునం దున్నప్పుడే గర్భము ధరించి యున్నందులను సాక్షిగా లక్ష్మణుఁడు తన్ను చూడవలయునని ఆమె కోరినది ఏ స్త్రీకైనను ఇంతకన్నను దుస్థితి యేమున్నది. కాని, లక్ష్మణుని పరిస్థితి యింతకన్నను శోచనీయముగానున్నది. అంతకష్టస్థితిలో ఆమహా పతివ్రత కోరిన యింత చిన్నసాయమును కూడ చేయలేని స్థితిలో ఆయన యున్నాఁడు. ఇంతకన్నను ఆయనకు పరితాపకారణమేమున్నది? ఆయన ధర్మమునకు బద్ధుఁడు. ఆయన ఇంతకాలమును ఆమెను చూడనేలేదు. వనములలో నున్నప మనాలుగేండ్లు

కూడ, నమస్కరించునప్పుడు పాదములు మాత్రమే చూచెను కాని ఆమె ముఖమువంక చూడలేదు. మఱి యిప్పుడు రాముఁడులేనిచోట నిర్జన ప్రదేశమున ఆమెను ఎట్లు అయన చూడఁగలఁడు? ఇంత మహోన్నతమైనశీలము, ఇట్టిదుస్థితియును మానవచరిత్రయందే చాల యఱుదని చెప్పవచ్చును.

ఇంత దుఃఖమునందు కూడ సీత ధర్మమును విస్మరింప కుండుట గమనింపదగియున్నది. భర్తకు కలిగిననిందను పరిహరించుట తనకుకూడ కర్తవ్యముగనే ఆమె భావించినది. భర్తయు తానును వేఱు కాదు. భర్తకు కలిగిన యపకీర్తి తనకును అపకీర్తియే. దానిని తొలగించుకొనుట అయనకు ఎంతకర్తవ్యమో తనకును అంతే కర్తవ్యము. భర్త స్వార్థపరుఁడై కీర్తి కొఱకు తన్ను త్యజించెనని ఆమె తలంపలేదు. తనకు కలిగినకష్టమునకు కారణము తన పూర్వజన్మదుష్కృతమే అని భావించినది. అది పతివ్రత లక్షణము.

లక్ష్మణుఁడు వెళ్ళినపిదత సీత పెద్దగా విలపింపఁజొచ్చెను. ఆమె రోదనమును విని మునిబాలకులు ఆమెచెంతకు వచ్చి చూచి విస్మితులైపోయి వాల్మీకితో చెప్పిరి. అయన తపోదృష్టితో జరిగినది తెలిసికొని అర్ఘ్యమును గైకొని సీతయొద్దకు వచ్చి మధురముగా నిట్లుపలికెను. "నీవు దశరథుని కోడలవు; రాముని పట్టమహిషివి. జనకుని కూతురవు. ఓ పతివ్రతా! నీకు స్వాగతము. తపోదృష్టిచే నీవు ఇచ్చటికి వచ్చిన కారణమును, నీపరిశుద్ధతను తెలిసికొంటిని. నీవిప్పుడు నారక్షణమందున్నావు; మమ్ము విశ్వసించి నిర్భయముగా నుండుము. ఈయాశ్రమమునకు సమీపమున తపస్సు చేసికొనుచున్న తాపసస్త్రీలు కలరు, వారునిన్ను బిడ్డలవలె ఎల్లప్పుడును చూచుకొందురు. అర్ఘ్యమును గ్రహింపుము; సొంతయింటికి వచ్చినట్లే తలంపుము; దుఃఖింపకుము,"

శ్లో॥ స్నుషా దశరథస్య త్వం రామస్య మహిషీ ప్రియా।
జనకస్య సుతా రాజ్ఞః స్వాగతం తే పతివ్రతే॥

శ్లో॥ ఆయాన్తీ చాసి విజ్ఞాతా మయా ధర్మసమాధినా।
కారణం చైవ సర్వం మే హృదయేనోపలక్షితమ్॥

శ్లో॥ అపాపాం వేద్మి సీతే తే తపోలబ్ధేన చక్షుషా।
విస్రబ్ధా భవ వైదేహి సాంప్రతం మయి వర్తసే॥
("సీతే త్వామ్"ఇతి రామాయణతిలకపాఠః)

శ్లో॥ ఆశ్రమ స్యావిదూరే మే తాపస్య స్తపసి స్థితాః।
తా స్త్వాం వత్సే యథా వత్సంపాలయిష్యన్తి నిత్యశః॥
ఉత్తరకాండ-49 వ సర్గ శ్లో. 7, 8, 10, 11.

అంతట సీత ఆయనపాదములకు ప్రణమిల్లి ఆయనవెంట బయలుదేరెను. ఆయన ఆమెను తాపసస్త్రీలున్న తావునకుఁగొని పోయెను. ఆస్త్రీలందఱును ఆయనకు స్వాగతమును పలికి, ''ఏమి చేయు మందురు" అని యడిగిరి. ఆయన వారితో నిట్లనెను. "ఇదిగో సీత వచ్చినది. ఈమె రామునకు పత్ని, దశరథునకు కోడలు, జనకుని కూతురు, పవిత్రురాలు. ఈమె పతివ్రత యయ్యును భర్తచే విడువఁబడినది. నాకు నిత్యము రక్షింపఁదగినది. ఈమెయందలి గౌరవమున నామాటవలనను మీరీమెను పరమ స్నేహముతో చూచుకొనుఁడు. మీ కీమె మిక్కిలి పూజ్యురాలు." ఇట్లు సీతనుగూర్చి మాటిమాటికి చెప్పుచు అప్పగించి వాల్మీకి శిష్యులతో కూడ ఆశ్రమమునకు తిరిగివచ్చెను.

శ్లో॥ సీతేయం సమనుప్రాప్తా పత్నీ రామస్య ధీమతః।
స్నుషా దశరథ స్యైషా జనకస్య సుతా సతీ।
అపాపా పతినా త్యక్తా పరిపాల్యా మయా సదా॥

శ్లో॥ ఇమాం భవత్యః పశ్యన్తు స్నేహేన పరమేణ హి।
గౌరవా న్మమవాక్యా చ్చ పూజ్యా వోఽస్తు విశేషతః॥
ఉత్తరకాండ—సర్గ.49- శో. 16, 17, 18.

సీతవృత్తాంతమును వాల్మీకి ధర్మసమాధిచే తెలిసికొనెను. వేద విహితమైన ధర్మము ననుష్ఠించుటవలన సమాధిస్థితియు దానివలన ఇట్లు తెలిసికొనుశక్తియు కలుగునని దీనివలన వ్యక్తమగుచున్నది. ఆయన ఇట్లు తెలిసికొని ఆమెను ప్రశంసించి స్వాగతము పలుకుటవలన, సీతకు తన్నుగూర్చి చెప్పుకొని రక్షణముకొఱకై ప్రార్థింపవలసిన దైన్యము లేకుండఁజేసెను.

ఆయన, "నీ విప్పుడు నారక్షణమందున్నావు" (సాంప్రతం మఱు వర్తసే) అని సీతతో చెప్పుటయే గాక తాపసస్త్రీలతో, "ఈమె నాకు ఎల్లప్పుడును రక్షింపఁదగినది;" (పరిపాల్యా మయా సదా) అని పలుకుట గమనింపఁదగి యున్నది. వాల్మీకి దశరథునకు మిత్రుఁడు. మిత్రునియొక్క కొడుకులు కోడండ్రును తనకును అట్టివారే యగుదురు. విధివశమున కోడలు భర్తకు దూరమైనచో ఆమెయొక్క రక్షణమును మామగారు వహింపవలయును. కావున దశరథునకు మాఱుగా ఆయన కోడలియొక్క రక్షణభారమును, మైత్రీ ధర్మము ననుసరించి, తాను వహింపవలసియున్న దని వాల్మీకి స్పష్ట మొనరించుచున్నాఁడు. అదియును గాక సమర్థులగువారు ధార్మికులకు కష్టము కలిగినపుడు శక్తికొలఁది వారిని ఆదుకొనవలయును. మనకెందులకని తొలఁగఁద్రోసికొని

పోవుట ధర్మముకాదు. కావున వాల్మీకి సీతారక్షణభారమును తన ధర్మమునుగా భావించెను. దీని నుద్దేశించియే రాముఁడు కూడ సీతను ఎచ్చటనో వనములో వదలిపెట్టు మని చెప్పక వాల్మీకి యాశ్రమప్రాంతముననే విడిచిరమ్మని లక్ష్మణునకు నిర్దేశించెను. అచ్చట తప్పక వాల్మీకియొక్క రక్షణము సీతకు లభించు నని ఆయన తలంచెను. అట్లే జరిగెను.

వాల్మీకి సీత నప్పగించుచు తాపసస్త్రీలతో "ఈమె మీకు విశేషముగా పూజ్యురా లగునుగాక!" (పూజ్యా వోఽస్తు విశేషతః అనుటలో ఆజ్ఞ ఇమిడియున్నది. ఆమెయొక్క ప్రత్యక్షమునఁ గాని పరోక్షమున గాని పరిత్యాగమునకు సంబంధించిన ప్రసంగములు ఎప్పుడును ఎవ్వరును చేయ రాదనియు, ఆమెను మహారాణివలె లేక దేవతనువలె పూజింపవలయు ననియు, ఆ తాపస స్త్రీలను ఆయన శాసించె నన్నమాట. సీతకు ఏమాత్రమును మనఃక్లేశమును కలుగుకుండుటకై ఆయన యిట్లు జాగరూకత వహించెను.

## 4. రామ దుఃఖోపశమనము

సీతను వాల్మీకిమహర్షి గొనిపోవుటను ఉత్తరపుగట్టుననుండి లక్ష్మణుఁడు చూచుచు దుఃఖితుఁడై సుమంత్రునితో నిట్లనెను. "సీతావియోగము వలన రామునకు కలిగిన దుఃఖమును చూడుము. పతివ్రతయైన భార్యను విడనాడవలసివచ్చుటకన్న అధికమైన దుఃఖ మే మున్నది? ఇది యంతయు దైవికమే. దైవము దాట రానిది. ఎవఁడు కోపించినచో దేవగంధర్వాసురులను హతమొన ర్పఁగలఁడో అట్టిరాముఁడు దైవము నుపాసించుచున్నాఁడు."

శ్లో॥ వ్యక్తం దైవా దహం మన్యే రాఘవస్య వినా భవమ్।
వై దేహ్యా సారథే నిత్యం దైవం హి దురతిక్రమమ్॥

శ్లో॥ యో హి దేవాన్ సగంధర్వాన్ అసురాన్ సహరాక్షసైః
నిహన్యా ద్రాఘవః క్రుద్ధః స దైవం పర్యుపాసతే॥

అప్పుడు సుమంత్రుఁ డిట్లనెను. "మైథిలినిగూర్చి దుఃఖిం పకుము. ఇది యంతయు ఇట్లు జరుగునని ముందుగనే విప్రులచే చూడఁబడినది. రాముఁడు కొంతకాలమునకు నిన్ను శత్రుఘ్నుని భరతుని త్యజించి దుఃఖవశుఁ డగును. నీ వీసంగతి ఎవరికిని చెప్పవద్దు. మీతండ్రిగారు ఇది రహస్య మనిచెప్పినారు. అయినను నీ కీవిషయమున శ్రద్ధయున్నచో చెప్పెదను." లక్ష్మణుఁడు చెప్పు మనఁగా సుమంత్రుఁడు మరల నిట్లు చెప్పెను. "ఒకప్పుడు చాతు ర్మాస్యదీక్షకై దుర్వాసోమహర్షి వశిష్ఠుని యాశ్రమమునకు వచ్చి యుండెను. అప్పుడు మీతండ్రిగారు అచ్చటికిపోయి ఆమహర్షుల నిరువురను దర్శించిరి. అంతట ప్రసంగవశమున మీనాయనగారు నావంశ మెంతకాలము జరుగును? మా రామున కాయుః ప్రమాణ మెంత? వాని కెందఱు కుమారులు కలుగుదురు? చెప్పు" మని దుర్వాసుని ప్రార్థించిరి. అప్పుడు మహర్షి ఇట్లు చెప్పెను. "పూర్వము దేవాసురసంగ్రామమున దైత్యులు పారిపోయి భృగు పత్నిని ఆశ్రయించిరి. ఆమె వారికి అభయ మొసంగెను. అందు లకు విష్ణువు క్రుద్ధుడై చక్రమున ఆమెతలను ఖండించెను. అప్పుడు భృగుమహర్షి కుపితుఁడై "క్రోధమూర్ఛితుండవై అవధ్యురాలైన నాపత్నిని వధించితివి; కావున నీవు మనుష్యలోకమున జన్మించి పెక్కేండ్లు పత్నీవియోగ మనుభవింపుము" అని శపించెను. పిమ్మట ఆమహర్షి పశ్చాత్తప్తుఁడై విష్ణుదేవు నర్చించెను. భక్తవత్స

లుండైన యాదేవుఁడు, లోకములప్రియముకొఱకు శాపము నాకు గ్రాహ్యమే యగును" అని పలికెను. ఇప్పు డావిష్ణువే రాముఁడు గా నీకు జన్మించియున్నాఁడు. అతఁ డయోధ్యాధిపతియై భృగు శాపఫలము ననుభవించుచు పదు నొకండువేల సంవత్సరములు పాలించును. అనేక అశ్వమేధములను గావించుచు రాముఁడు రాజ్యమునుపాసించి బ్రహ్మలోకమున కేగును. అతనియనుచరు లందఱు సమృద్ధారులై సుఖులై యుందురు. అనేకరాజవంశము ముల నతఁడు స్థాపించును. అతనికి సీతయందు ఇరువురు కుమా రులు కలుగుదురు; అయోధ్యలో కాదు. రాముఁడు కుమారులను అయోధ్యలో కాకుండ మఱొకచోట పట్టాభిషిక్తులను చేయును. మునివచనము అట్లున్నది. నీవు ఇంక దుఃఖింపకుము''

శ్లో॥ తత స్తాం నిహతాం దృష్ట్వా పత్నీం భృగుకులోద్వహః।
శశాప సహసా క్రుద్ధో విష్ణుం రిపుకులార్దనమ్॥

శ్లో॥ యస్మా దవధ్యాం మే పత్నీం అవధీః క్రోధమూర్ఛితః।
తస్మా త్త్వం మానుషే లోకే జనిష్యసి జనార్దన॥

శ్లో॥ తత్ర పత్నీవియోగం తం ప్రాప్స్యసే బహువార్షికమ్।
శాపాభిహతచేతా స్తు స్వాత్మనా భావితోఽభవత్॥

శ్లో॥ అర్చయామాస తం దేవాం భృగు శ్శాపేన పీడితః।
తప సారాధితో దేవో హ్యబ్రవీత్ భక్తవత్సలః॥

శ్లో॥ లోకానాం సంప్రియార్థం తు తం శాపం గ్రాహ్య ముక్తవాన్।
ఉత్తరకాండ-సర్గ. 51 - శ్లో 13, 14, 15, 16, 17.

తిలకటీక:— శాపాభిహతచేస్తు – ధర్మపక్షాశ్రయ దేవానుగ్రహాయ ప్రవృత్తః ఈశ్వరః,స్వోపాస్యః,మయా త్వ్యభిమానేన (స్త్రీఅభిమా

నేన) శప్తః। ఈశ్వరత్వాత్ యది తం నిరస్యేత్, తదా మిథ్యావచన త్వే నరక ప్రాప్తిః స్యాత్ ఇతి పశ్చాత్తాపపరీతచిత్తః। స్వాత్మనా అంతర్యామిణా భావితః స్వశాపస్వీకారార్థం ఈశ్వరం ప్రతి తపశ్చరణార్థం ప్రేరితః।

విష్ణుదేవుని శపించినభృగుమహర్షి పశ్చాత్తప్తుఁ డగుట యెందులకు? విష్ణుదేవుఁడు లోకములకు స్థితికర్త. లోకస్థితి ధర్మముపై ఆధారపడియున్నది. రాక్షసులు ధర్మపరులైన దేవతలను హింసింపఁజొచ్చిరి. ధర్మపరులను రక్షించుట విష్ణువునకు కర్తవ్యము. కర్తవ్యనిర్వహణమునకు భృగుపత్ని రాక్షసులకు అభయమొసంగి అడ్డుపడినది. కర్తవ్యనిర్వహణమున విష్ణువు ఆమెను సంహరించుట తప్పు కాదు. దుఃఖావేశమున మహర్షికి ఈవిషయము స్ఫురింపలేదు. దుఃఖము తగ్గినతరువాత స్ఫురించినది. అప్పుడాయన పశ్చాత్తాపము నొందెను. అంతే కాదు విష్ణుదేవుఁడు తపస్సంపన్నుఁడు. ఆయన తపస్సామర్థ్యముచేత తన శాపమును త్రోసివేసినచో తనవాక్య మసత్యమగునని భృగువునకు భయము కూడ కలిగెను. అందువలన ఆయన విష్ణుదేవునిగూర్చి తపస్సు చేసి తనమాటను నిలువఁబెట్టుమని ప్రార్థించెను. విష్ణువు అందులకు అంగీకరించెను. దీనినిబట్టి దుఃఖక్రోధముల యావేశమున ఎంతటిమహర్షికైనను ధర్మము స్ఫురించుట దుర్ఘట మని స్పష్టమగుచున్నది. అంతే కాదు. మహర్షులు సత్యవాక్యపాలనమునకు ఎంత ప్రాముఖ్యము నొసంగుచుండిరో వ్యక్త మగుచున్నది.

ఇట్లు వారు మాటాడుకొనుచుండఁగా సూర్యాస్తమయము ఆయెను. అప్పుడు వారు కేశినీనదీతీరమున వసించిరి. అచ్చట రాత్రి గడపి మఱునాఁడు మధ్యాహ్నమునకు లక్ష్మణుఁడు హృష్టపుష్టజనాకీర్ణమైన యయోధ్యను ప్రవేశించి పరమదైన్యముతో రాజ

భవనములోనికి పోయి అచ్చట కనుల నీరు గార్చుచు దీనుఁడై కూర్చున్నరాముని జూచి నమస్కరించి ఇట్లు పలికెను. "నీయాజ్ఞ ను అనుసరించి అనుకొన్నవిధముగా గంగాతీరమున వాల్మీకియాశ్ర మముచెంత సీతను విడిచి వచ్చితిని. నీవు దుఃఖింపకుము. కాలగతి యిట్టిదే. నీవంటి బుద్ధిమంతులు శోకింపరు. సమకూర్పఁ బడిన వన్నియు క్షీణింపక తప్పదు. ఉన్నత స్థితులన్నియు పత నముతో ముగియవలసినవే. సంయోగములకు వియోగమే ముగింపు. జీవితమునకు మరణమే అంతము. కావున ధనదారమిత్రపుత్రులందు సంగమును పెంచుకొనరాదు. వారి వలన వియోగము ఎప్పటికైనను తప్పదు. నీవు నీయంతఃకరణ ముచేత లోకములను నీమనస్సును కూడ శిక్షింపఁగలవు. నీకు నిగ్రహించుట ఎంతపని? నీవు శోకమును నిగ్రహింపకున్నచో "పరుని గృహమందున్న భార్యను వదలిపెట్టి మరల కాముకుఁడై ఆమెనుగూర్చియే ఈ రాముఁడు శోకించుచున్నాఁడు" అను పౌరా పవాదము మరల బయలుదేరును. కావున ఈ దుర్బలమైన బుద్ధిని త్యజించి సంతాపమును వీడుము.''

శ్లో॥ ఆర్యస్యాజ్ఞాం పురస్కృత్య విసృజ్య జనకాత్మజామ్।
గంగాతీరే యథోద్దిష్టే వాల్మీకే రాశ్రమే శుభే॥ 8

శ్లో॥ తత్ర తాంచ శుభాచారాం ఆశ్రమాన్తే యశస్వినీమ్।
పున రప్యాగతో వీర పాదమూల ముపాసితుమ్॥ 9

శ్లో॥ సర్వే క్షయాన్తా నిచయాః పతనాన్తా స్సముచ్ఛ్రయాః
సంయోగా విప్రయోగాన్తాః మరణాన్తం చ జీవితమ్। 11

శ్లో॥ తస్మాత్ పుత్రేషు దారేషు మిత్రేషు చ ధనేషు చ।
నాతిప్రసంగః కర్తవ్యో విప్రయోగో హి తైర్ధ్రువమ్॥ 12

శ్లో॥ శక్త స్త్వ మాత్మ నాత్మనాం వినేతుం మనసా మనః॥
లోకాన్ సర్వాన్చకాకుత్థ్స కిం పునశ్శోక మాత్మనః॥ 13

శ్లో॥ నేదృశేషు విముహ్యన్తి త్వద్విధాః పురుషర్షభాః।
అపవాదః స కిల తే పున రేష్యతి రాఘవ॥ 14

శ్లో॥ యదర్థం మైథిలీ త్యక్తా అపవాదభయా న్నృప।
సోఽపవాదః పురే రాజన్ భవిష్యతి న సంశయః॥ 15

శ్లో॥ స త్వం పురుషశార్దూల ధైర్యేణ సుసమాహితః।
త్యజేమాం దుర్బలాం బుద్ధిం సంతాపం మా కురుష్వహ॥ 16
ఉత్తరకాండ సర్గ-52

ఆమాటలకు రాముఁడు సంతోషించి "నీవు చెప్పినది నిజమే. మధురములైన నీ మాటలచేత ఊరట నొందినాను; సంతాపము పోయినది; శాంతియును కలిగినది. నీవు నాయనుశాసనమును నిర్వహించుట వలన నాకు సంతోషము కలిగినది'' అని పలికెను.

శ్లో॥ ఏవ మేత న్నరశ్రేష్ఠ యథా వదసి లక్ష్మణ।
పరితోష శ్చ మే వీర మమ కార్యానుశాసనే॥ 18

శ్లో॥ నివృత్తి శ్చాగతా సౌమ్య సంతాప శ్చ నిరాకృతః।
భవద్వాక్యై స్సురుచిరై రనునీతోఽస్మి లక్ష్మణ॥ 1۔

తరువాత రాముఁడు మరల ఇట్లనెను. "నాలుగుదినములుగా నేను పౌరకార్యములను చూచుట లేదు. అది మర్మభేదకముగా నున్నది. మంత్రులను పురోహితుని ప్రజలను కార్యార్థులైన పురుషులను స్త్రీలను పిలువుము. దినదినము ఎవఁడు పౌరకార్యములను తీర్పకుండునో అట్టి రాజు అన్నిప్రక్కలను మూయఁబడినదైన ఘోరమైన నరకమునందుపడును. సంశయము లేదు.''

శ్లో॥ చత్వారో దివసా స్సౌమ్య కార్యం పౌరజనస్య చ।
అకుర్వాణస్య సౌమిత్రే తన్మే మర్మాణి కృన్తతి॥

శ్లో॥ అహూయన్తాం ప్రకృతయః పురోధా మన్త్రిణ స్తథా!
కార్యార్థినశ్చ పురుషాః స్త్రియశ్చ పురుష ర్షభ॥

శ్లో॥ పౌరకార్యాణి యో రాజా న కరోతి దినే దినే।
సంవృతే నరకే ఘోరే పాత్యతే నాత్ర సంశయః॥

ఉత్తరకాండ-సర్గ 53-శ్లో. 4, 5, 6,

పిదపరాముఁడు నృగమహారాజుకథను నిమివృత్తాంతమును, యయాతి చరిత్రను దృష్టాంతములుగా చెప్పెను. వారట్లు మాట్లాడుచుండఁగా వాసంతికమైన రాత్రి వచ్చెను. శ్రీరాముడు సీతను వదలిపెట్టినది వసంతారంభమునందే.

మఱునాడు రాముఁడు పౌరులకు దర్శనమిచ్చుటకై, బయలుదేరుచుండఁగా సుమంత్రుఁడువచ్చి చ్యవనమహర్షిని పురస్కరించుకొని యమునాతీరవాసులైన మహర్షులువచ్చిరనిచెప్పెను. వెంటనే రాముఁడు వారిని ప్రవేశపెట్టుమనెను. అప్పుడు నూఱు మందికిపైగా మహర్షులు లోనికి వచ్చిరి. రాముఁడు వారికి నమస్కరించి అర్ఘాసనములందు కూర్చుండుఁ డని ప్రార్థించెను. వారు తాము తెచ్చిన తీర్థోదకములను ఫలమూలములను రామునకు బహూకరించిరి. రాముఁడు వానిని స్వీకరించి "తమరు వచ్చిన కార్యమేమి? నేను సమాహితుఁడనైయున్నాను; ఏమి చేయవలయునో అజ్ఞాపింపుడు; నేను మహర్షులకు సర్వకామకరుఁడను" అని పలికెను.

చ్యవన మహర్షి ఇట్లుచెప్పెను. "కృతయుగమునందు లోలాపుత్రులలో అగ్రజుఁడైన మధువను దైత్యుఁడు బ్రహ్మణ్యుఁడై

యుండెను. అతఁడు మహేశ్వరునిగూర్చి తపస్సుచేసెను. ఆమహా దేవుఁడు ప్రీతుఁడై తన శూలమునుండి మఱియొక శూలమును సృష్టించి "నీపైకి ఎవఁడు వచ్చునో వానిని ఇది భస్మ మొనర్చి మరల నీచేతికి వచ్చును. ఎంతవఱకు నీవు దేవతలకు విప్రులకు విరోధముగా వర్తింపవో అంతవఱకు నీయొద్ద నుండును." అని చెప్పి యొసంగెను. అప్పుడు మధువు పరమేశ్వరుని స్తుతించి ఆశూలము శాశ్వతముగా తనవంశమున నుండునట్లు వరమొసంగుమని ప్రార్థించెను. పరమేశ్వరుఁడు "అట్లు వీలులేదు; కాని నీప్రార్థనము వ్యర్థమగుట నాకిష్టములేదు; దీనిని నీపుత్రుఁడు ధరించి నప్పుడు సర్వభూతములకు అవధ్యుఁడగును." అని పలికెను. మధువుభార్య కుంభీనసి. ఆమె మాల్యవంతుని పుత్రికయైన అనల యొక్క కూఁతురు. మాల్యవంతుఁడు రావణునకు మాతామహుడు. అందువలన ఆమె రావణునకు చెల్లెలు. మధువునకు కుంభీనసి యందు జన్మించిన లవణుఁడు దుష్టుడయ్యెను. తండ్రి యనంతరము వాఁడు శూలముయొక్క ప్రభావముచేత లోకకంటకుఁడై తాపసులను భాధింపఁ జొచ్చెను. ఋషులు ప్రార్థింపఁగా పెక్కురు రాజులు పూనుకొని వానిని సంహరింపలేకపోయిరి. నీవు రావణుని సంహరించితివని తెలిసి, ఈ లవణాసురునికూడ నీవేసంహరింపఁ గలవని నిన్ను ప్రార్థించుటకు వచ్చితిమి.

దీనినిబట్టి రావణ శూర్పణఖాదులు కృతయుగములోని వారని లక్షలయేండ్ల వయస్సు కలవారిని గ్రహింపవలసియున్నది. అప్పుడు రాముఁడు "వాని యాహారమేమి.? ఆచార మెట్టిది ? ఎక్కడ నున్నాడు? అని యడిగెను. "సర్వజంతువులును వానికి ఆహారమే; వాఁడు విశేషించి తాపసులను భక్షించును; నిత్యరౌద్ర

వర్తనమే వాని యాచారము; వాఁడు మధువనమునందుండును, అని మహర్షులు చెప్పిరి.

"సరే వానిని తప్పక సంహరింపఁజేయుదును. మీకు భయములేదు" అని రాముడు ప్రతిజ్ఞయొనర్చెను. అప్పటికి లక్ష్మణాదులైన సోదరులును వచ్చియుండిరి. రాముఁడు వారిని జూచి "లవణుని చంపునది ఎవరు? ఆ కార్యమును ఎవనిపాలుగా నొసంగుదము. భరతునకా? శత్రుఘ్నునకా?" అని యడిగెను. భరతుఁడు "నేను లవణుని సంహరింతును, వానిని నాభాగముగా నొసంగుఁడు" అని పలికెను. శత్రుఘ్నుడు లేచి నమస్కరించి, "ఆర్యుఁడు ఇంతకు పూర్వము నందిగ్రామమున వ్రతధారియై యుండి రాజ్యమును పాలించి శ్రమించియున్నాఁడు. అదియును గాక నేను చిన్నవాఁడనై పంపఁదగినవాఁడనై యుండగా అయన బయలుదేరుట ఎందులకు?" అని పలికెను. భరతుఁడేమియు మాటాడలేదు. రాముఁడు "అట్లయినచో మంచిదే. నిన్ను మధుపు నగరమునకు రాజునుగా అభిషేకింతును, నీవు లవణుని సంహరించి ఆ రాజ్యమును తీర్చిదిద్ది పాలింపుము. ఒకరాజును సంహరించినతరువాత ఆరాజ్యమునందు మఱియొక రాజవంశమును ఏర్పఱుపనివాఁడు నరకము నొందును. కావున నీవు నామాటకు అడ్డుచెప్పక లవణుని సంహరించి ఆ రాజ్యమును పాలించుచుండుము' అని పలికెను.

శత్రుఘ్నుఁడు సిగ్గుపడి మెల్లగా ఇట్లనెను. "ఆర్యా! ఇది యధర్మమని తలంతును. పెద్దవా రుండఁగా చిన్నవాడు పట్టాభిషిక్తుఁడగుటయెట్లు? కాని నీ శాసనము దురతిక్రమము. నేను లవణుని సంహరింతు నని ఆర్యుఁడు చెప్పుచుండగా నేను అయనకు అడ్డము చెప్పి యుండరాదు. ఆ దురుక్తికి ఫలముగా అన్నను

అతిక్రమించి రాజ్యాభిషేకము నొందుట అను దుర్గతి కలిగినది. ఇంక మరల నీమాటకు బదులుచెప్పినచో ఏమి దండము సంభవించునో యని భయపడుచున్నాను. నీవు నన్ను నీయిష్టము వచ్చినట్లు అజ్ఞాపింపుము; నాకు అధర్మము లేకుండునట్లు చేయుము''

ఆదినముననే రాముఁడు శత్రుఘ్నుని మధువన రాజ్యమునకు ప్రభువునుగా అభిషేకించెను. కౌసల్య మొదలైన రాజాంగనలు మంగళములను గావించిరి. యమునాతీరవాసులైన ఋషులు లవణుఁడు హతుఁడైనట్లే భావించిరి. రాముఁడు శత్రుఘ్నునకు మహావిష్ణువుచే నిర్మింపబడిన యొకమహాస్త్రము నొసంగి. ''లవణుడు ఆహారము కొఱకు వనమునకు పోవునప్పుడు శూలమును తీసికొనిపోఁడు. వాఁడు తిరిగి వచ్చునప్పుడు నగరద్వారమున ధనుర్ధరుఁడవై వేచియుండి వానిని లోనికి పోనీయక అచ్చటనే వానితో యుద్ధమొనర్చి సంహరింపుము. నాలుగువేల గుఱ్ఱములు, రెండువేల రథములు నూఱుగజములు పణ్యద్రవ్యములు బేహారులు, నటనర్తకులు, చాలినంతగా ధనము వాహనములనుగైకొని పొమ్ము. ముందుగా సైన్యమును పంపి తరువాత నీవు బయలు దేరుము. నీవు యుద్ధమునకు వచ్చునట్లు వానికి శంక కలుగకుండ ప్రయాణముచేయుము మహర్షులను పురస్కరించుకొని నీ సైనికులు గ్రీష్మావసానమున గంగను దాటుదురు. వర్షాకాలముననే నీవు లవణుని సంహరింపఁగలవు'' అని పలికెను. గ్రీష్మమునందు దండయాత్రాభయమున వాఁడు శూలమును ధరించియే తిరుగుచుండునని రాముని యభిప్రాయము. ఆ విషయమును గమనించి మహర్షులు రామునితో చెప్పియుందురు.

సైన్యమును ముందుగా పంపి శ్రావణ మాసారంభమున శత్రుఘ్నుఁడు పెద్దలకు నమస్కరించి రామునకు ప్రదక్షిణ మొనర్చి బయలుదేరెను. మూఁడవదినమునకు శత్రుఘ్నుఁడు సపరివారముగా వాల్మీకియాశ్రమమునకు చేరెను. ఆరాత్రియే సీతాదేవి పుత్రులను ఇర్వురను కనెను. అర్ధరాత్రి సమయమున మునిబాలకులు వచ్చి సీత ప్రసవించె నని ప్రియవార్తను వాల్మీకికి చెప్పిరి. వెంటనే వాల్మీకి ప్రసవగృహమునొద్దకు పోయి, వృద్ధస్త్రీలు శిశువులను వెలికిఁదెచ్చి చూపఁగా, బాలచంద్రులవలెనున్న యాబిడ్డలను చూచి రక్షావిధానముగా కుశలయొక్క అగ్రభాగములతో జ్యేష్ఠుని, లవములు అను నదోభాగములతో రెండవవానిని మార్జన మొనర్పవలసినదని వారికి వానినొసంగెను. "కుశలచే మార్జనము నొందినవాఁడు కుశుఁడని, లవములచే మార్జనము నొందినవాఁడు లవుఁడని" ఆయన వారికి నామములను ఏర్పఱచెను. అవృద్ధ స్త్రీలు అట్లే ఆ శిశువులకు భూతవినాశినియైన రక్షను గావించుచు ఆ శిశువుల గోత్రమును నామములను సీతారాములను ప్రశంసించుచుండిరి శత్రుఘ్నుఁడు అమాటలను విని ప్రసవ గృహమునకు దాపునకు పోయి ''అమ్మా! భాగ్యముచేత సంతతి కలిగినది'' అనియనుకొనెను,

శ్లో॥ యామేవ రాత్రిం శత్రుఘ్నః పర్ణశాలా ముపావిశత్।
తామేవ రాత్రిం సీతాపి ప్రసూతా దారకద్వయమ్॥

శ్లో॥ కుశముష్టి ముపాదాయ లవం చైవతు సద్విజః।
వాల్మీకిః ప్రదదౌ తాభ్యాం రక్షాం భూతవినాశినీమ్॥

రామాయణ తిలకటీక:- కుశముష్టిం లవం చ ఉపాదాయ రక్షాం ప్రదదే। లూనకుశానాం అగ్రభాగః కుశముష్టి రిత్యుచ్యతే, తేషా మధో భాగః లవ ఇతి। తత్ర కతిపయ సాగ్ర కుశా

గృహీత్వా మధ్యే ద్విధా ఛిత్వా తదగ్ర అధో భాగాభ్యాం క్రమాత్ జ్యేష్ఠ కనిష్ఠయోః ప్రమార్జన ఫలకం తద్రూపం రక్షాదానం వృద్ధానాం స్త్రీణాం హస్తే ఇతి బోధ్యమ్.

[స్వాగ్రములైన కుశలను నడుమకు ఖండించినప్పుడు అగ్ర భాగములను కుశముష్టి యని అధోభాగములను లవమనియు చెప్పుదురు. ఆయన కుశముష్టితో పెద్దవానికి, లవముచేత చిన్నవానికి వృద్ధ స్త్రీలచేత మార్జనము చేయించెను, అది రక్షోవినాశినియైన రక్ష]

శ్లో॥ అర్ధరాత్రే తు శత్రుఘ్నః శుశ్రావ సుమహత్ ప్రియమ్।
పర్ణశాలాం తతో గత్వా మాత ర్దిష్ట్యేతి చాబ్రవీత్॥

శ్లో॥ తదా తస్య ప్రహృష్టస్య శత్రుఘ్నస్య మహాత్మనః॥
వ్యతీతా వార్షికీ రాత్రి శ్శ్రావణీ లఘువిక్రమా॥

సర్గ-66-శ్లో. 1,6,12,13.

వాల్మీకియే సూతికాగృహములోనికిపోకుండ వృద్ధస్త్రీలచే రక్షకావించు చుండఁగా శత్రుఘ్నుఁడు లోనికిపోవుట అసంభవము. వాల్మీకి శత్రుఘ్నునకు అవిషయము చెప్పలేదు; అయనయును అడుగలేదు. అందువలన ఆయన వదినగారిని పిల్లలను చూడ లేదు. అన్నగారు ఆమెను వదలిపెట్టినతరువాత ఆకుటుంబమునకు ఆమెతో సంబంధము లేనట్లే. అందువలన అతఁడు ఆమెను చూచుటకు సాహసింపలేదు. కావున అతఁడు ఆమె ప్రసవించిన పర్ణశాలయొద్దకు వచ్చి అక్కడనున్నవారికి కన్పింపకుండ దూరముననే నిలిచి ''మాత ర్దిష్ట్యా'' అని తనలో అనుకొనె నన్నమాట. ఆ వాక్యమునకు శేషముగా అయనభావ మేమొ తెలియదు, ''మాతః దిష్ట్యా అర్యస్య వంశః ప్రతిష్ఠితః''(అమ్మా! భాగ్యవశ

మున అన్నగారివంశము నిలిచినది) అని ఆయన భావించియుండ వచ్చును.

అట్లు శత్రుఘ్నుఁడు హర్షము నొందుచుండఁగా శ్రావణ మాసపురాత్రి త్వరగా గడిచిపోయెను, అనఁగా సీతాదేవి శ్రావణ మాసమున ప్రసవించిన దన్నమాట. ఆమెకు కార్తికమాసమున గర్భ మారంభమైనచో వసంతారంభమున ఆమె వాల్మీకి యాశ్రమ మునకు చేరునప్పటికి ఆఱవనెల వచ్చియుండును.

తెల్లవారినతరువాత శత్రుఘ్నుఁడు వాల్మీకియొద్ద సెలవు గైకొని పశ్చిమముగా ఏడురోజులు ప్రయాణమొనర్చి అక్కడక్కడ ఋషుల యాశ్రమములో బసచేయుచు యమునాతీరమునకు చేరెను. ఆరాత్రి చ్యవనమహర్షి శత్రుఘ్నునకు ఇక్ష్వాకువంశ ములో యవనాశ్వునిపుత్రుఁడైన మాంధాతకూడ లవణుని పైకి పోయి వానిశూలముచే హతుఁడైన వృత్తాంతమును చెప్పెను. దీనిని బట్టి లవణుఁడు, రావణుఁడు లక్షలయేండ్లు జీవించినవా రనుట స్పష్టము. ప్రభాతమున శత్రుఘ్నుఁడు మహర్షులతో యమునను దాటి మధుపురము నొద్దకు వచ్చెను.

లవణుఁడు ఉదయమే బయలుదేరి ఆహారము కొఱకు వన మునకు పోయెను. శత్రుఘ్నుఁడు ధనుష్పాణియై నగరద్వారము నొద్ద నిలిచియుండెను. మధ్యాహ్నమునకు లవణుఁడు వేలకొలది జంతువుల శరీరములను మోసి తెచ్చుకొనుచు వచ్చి శత్రుఘ్నుని చూచి పరిహసించుచు, ''ఈ ధనుస్సుతో ఏమిచేయుదువు? సాయు ధులైన నీవంటివారిని వేలమందిని భక్షించితిని. నీకు కాలము దాపురించినది'' అని పలికెను. లవణుఁడు వృక్షములను పెఱికి శత్రుఘ్నునిపై విసరఁజొచ్చెను. శత్రుఘ్నుఁడు బాణవర్షమును

కురిపించెను. వాఁడు వ్యథనొందక ఒకపెద్దవృక్షముతో శత్రుఘ్నుని తలపై మోదెను. శత్రుఘ్నుఁడు మూర్ఛిల్లెను. అతఁడు హతుఁడయ్యె నని తలంచి లవణుఁడు, అవకాశము దొఱకెనని లోనికిపోయి శూలమును తెచ్చుకొనక, క్రిందపడిన జంతు శరీరములను ప్రోవుచేసికొనఁజొచ్చెను. శత్రుఘ్నుఁడు తెప్పరిల్లి ధనువు గైకొని లవణుఁని యుద్ధమున కాహ్వానించెను. అప్పుడు శత్రుఘ్నుఁడు ఇట్లనుకొనెను. "స్వయముగా వచ్చిన శత్రువును బుద్ధిమంతుఁడు విడిచిపెట్టరాదు. బుద్ధిహీనతచేత శత్రువు ప్రసరించుటకు అవకాశము నొసంగువాఁడు కాపురుషునివలె నశించును"

శ్లో॥ స్వయమే వాగత శ్శత్రుః నమోక్తవ్యో కృతాత్మనా।
యో హి విక్లబయా బుద్ధ్యా ప్రసరం శత్రవే దిశేత్।
స హతో మందబుద్ధి స్స్యాత్ యథా కాపురుషస్తథా॥
సర్గ. 69-శ్లో. 19.

శత్రువు ప్రసరించుటకు అవకాశ మొసంగకుండుట రాజనీతిలో ముఖ్యమైన యంశము. ఎదుటవాని యెత్తుగడలను ఊహించి వానికిఁదగిన ప్రతిక్రియలను నిశ్చయించుకొనుట బుద్ధిప్రసరణము. నిశ్చయించుకొనిన వానిని ఆచరణలోనికి తెచ్చుట కార్యప్రసరణము. ప్రజలను హింసించు దుండగులు ప్రభువులకు సహజశత్రువులు. వారిని దండించుట ప్రభుత్వమునకు ప్రథమ కర్తవ్యము. అపరాధి బలవంతుఁడై దండనమునకు లోఁబడక యున్నప్పుడు వానిని ఎట్లైనను శిక్షించి ప్రజలకు వానివలన కలుగుచున్న కష్టములను రాజులు తొలఁగింపవలె. అట్టి యపరాధుల విషయమున వీరధర్మము యుద్ధధర్మము మొదలగు వానిని పాటింపరాదు. ప్రజారక్షణము కొఱకు వారి నెట్లైనను సంహరించుటయే

ప్రభువులకు పరమధర్మము. తనబాణవర్షమును లెక్కచేయక వృక్షములను పెకలించి విసరుచున్న లవణుని శ్రీరాముఁ డిచ్చిన యస్త్రముతో శత్రుఘ్నుఁడు వెంటనే సంహరించియుండవలసినది. వాఁడు పెద్దచెట్టును పెకలించి పరువెత్తుకొని దగ్గరకువచ్చి తలపై మోదునంతవఱకు శత్రుఘ్నుఁడు అవకాశము ఇచ్చియుండరాదు. వాఁడు పెద్దచెట్టును పెకలించినంతనే వానిని శత్రుఘ్నుడు దివ్యాస్త్రముచేత సంహరించియుండవలె. అట్లు వానికి అవకాశ మొసంగుటవలన పెద్దప్రమాదము సంభవించెను. అదృష్టవశమున శత్రుఘ్నునకు మూర్ఛ మాత్రమే సంభవించినది. అట్లుకాక మరణమే సంభవించినచో గతియేమి? లేదా వాఁడు ఆసమయములో మూర్ఛిల్లినవానినిపట్టి భక్షించియుండవచ్చును. లేదా నగరములోనికిపోయి శూలమునైన తెచ్చికొని యుండవచ్చును. రాముఁ డొసంగిన దివ్యాస్త్రమును లవణుఁడు పెద్దవృక్షమును పెకలించినంతనే శత్రుఘ్నుఁడు ప్రయోగించియున్నచో ఇట్టి యవకాశమే ఏర్పడియుండదు. కావున శిక్షార్హులైన యపరాధుల విషయమున ఇట్టి యవకాశము నొసంగుట అత్యంతము అనుచితము. ఈనీతిని ధర్మమును చక్కఁగా గ్రహింపని కారణముననే బందిపోటు దొంగలవలె వచ్చిపైఁబడిన విదేశీయుల విషయమున పృధ్వీరాజు మొదలైన హిందూరాజులు తాము సర్వనాశమై ప్రజలను విపత్సముద్రమున ముంచి ఈదేశమున విదేశీయులు ప్రభువు లగుటకు అవకాశ మొసంగిరి. మహమ్మద్‌గోరి గజనీవంటివారు యుద్ధమున ఓడిచిక్కినప్పుడు, వారు శరణుకోరినంతనే క్షమించి వదలుటలో హిందూరాజులు ధర్మమునకు ప్రజలకు ద్రోహమునే కావించిరి. అద్దములోనైనను పద్మినిని చూడవలయునని పట్టుపట్టిన అల్లాఉద్దీన్ ఖిల్జీని లక్ష్మణసింహుఁడు అంతఃపురమునందే అంతము

కావింపకుండుటకన్న అన్యాయమేమున్నది? పద్మినిని చూచినంతనే తిరిగిపోవుదునని చెప్పిన అల్లాఉద్దీన్ ఆమాటపై నిలిచినాఁడా? వెంటనే చిత్తూరును ముట్టడించినాఁడుకదా: అట్టి ధర్మద్రోహులను వీలు కలిగినంతనే సంహరింపవలె కాని వీరిని ధర్మమని విడిచిపెట్టి సర్వనాశము నొందుటకన్న బుద్ధిహీనత యేమున్నది?

మఱి రావణుఁడు యుద్ధరంగమున ఓడి చిక్కినప్పుడు రాముఁడు వానిని విశ్రాంతినొంది మరల రమ్మని పంపినాఁడు కదా! అట్లే బలరామకృష్ణులుకూడ జరాసంధుని అనేకపర్యాయములు విడిచిపెట్టినారుకదా! రావణుఁడు, జరాసంధుఁడు ధర్మద్రోహులేకదా! శ్రీరాముఁడు శ్రీకృష్ణుడునుచేసినది ధర్మమెట్లైనది? వారు శత్రువులనేకాక వారికి సహాయులైనవారి నందఱను నిర్మూలింపవలయునను పథకములో ఒకభాగముగానే రావణజరాసంధులను విడిచిపెట్టిరి. మొదటిసారి జరాసంధుఁడు ఓడిపోయి చిక్కినప్పుడు బలరాముఁడు వానిని సంహరింపనుండఁగా శ్రీకృష్ణుఁడు అన్నను వారించి, "వీనిని ఇప్పుఁడు సంహరించినచో వీనికి సహాయులైనవారందఱు పారిపోయి గూఢముగ నుండి మనకు చిక్కరు. వీనిని వదలినచో వీఁడుపోయి ఆ సహాయుల నందఱను ప్రోవుచేసికొని మరల రాఁగలఁడు. ఆ విధముగ సహాయుల నందఱను సంహరించినతరువాత వీనిని సులభముగా నిర్మూలింపవచ్చు"నని చెప్పెను. శ్రీకృష్ణుఁడు ఉపాయముచేత కాలయవనుని, మాఱువేషములో భీమార్జునులతోకూడపోయి జరాసంధుని సంహరింపఁ జేయుట గమనింపఁదగియున్నది. కాలయవనుని విషయమున శ్రీకృష్ణుడు పారిపోవుటకుకూడ సంకోచింపలేదు. శిక్షార్హులైన యపరాధులవిషయమున వీరధర్మము ఋజుత్వము. మొదలగువానిని పాటింపకుండ ఎట్లైనను వారిని నిర్మూలించుటయే పరమధర్మమని

శ్రీకృష్ణుఁడు అనేకపర్యాయములు స్పష్టమొనర్చెను. ఇటీవల చరిత్రలో ఈ ధర్మమును గుర్తించి శత్రువుల నిర్మూలించుచు నిలువఁగలుఁగుటవలననే శివాజీమహారాజు, స్వయముగా స్థాపించి పాలించినరాజ్యము చిన్నదే అయినను- చరిత్రలో పెద్దస్థానమును పొందెను.

లవఁణుడు జాఱిపడిన జంతువుల శరీరములను ప్రోవుచేసికొనుచుండఁగా శత్రుఘ్నుఁడు లేచి వానిని యుద్ధమునకు ఆహ్వానించి వాఁడు పైకివచ్చుచుండఁగా రాముఁడిచ్చిన యస్త్రమును ప్రయోగించి వానిని సంహరించెను. వెంటనే వాని యింటనున్న శూలము అందఱు చూచుచుండఁగా ఎగిరిపోయి రుద్రుని చేరెను. అప్పుడు దేవతలు ప్రత్యక్షమై శత్రుఘ్నుని వరము కోరుకొమ్మనిరి. శత్రుఘ్నుఁడు. "ఈ మధుపురము రాజధానికి తగినట్లుగా దేవనిర్మితమై మథురానగర మగును గాక" అని కోరెను. దేవతలు "అట్లే యిది రమ్యమై శూరసేనము అగును" అని పలికి వెడలిపోయిరి, అందువలన ఆ ప్రాంతమునకు శూరసేనము అను పేరుకూడ ప్రసిద్ధమయ్యెను. వెంటనే శత్రుఘ్నుని సేనలు అచ్చటికి వచ్చి శ్రావణమాసముననే నివేశనమును ( Dwelling ) అరంభించెను. యమునా తీరమున అర్ధచంద్రాకారముతో చత్వరములు, ఆపణములు, చాతుర్వర్ణ్యగృహములు వీథులుమొదలగువానితో మథురానగరము శోభించెను.

శత్రుఘ్నుఁడు అక్కడ రాజ్యమును సువ్యస్థితము చేయుచుండఁగా పదునొకండు సంవత్సరములు గడిచెను. పండ్రెండవ సంవత్సరముయొక్క అరంభమునందు, అనగా శ్రావణమాసమున అయనకు రామపాదములను దర్శింపవలయునని కుతూహలము కలిగెను. అయన వెంటనే బయలుదేరి అయోధ్యకు పోవుచు దారిలో

వాల్మీకి యాశ్రమమున బసచేసెను. ఆరాత్రి ఆయన అచ్చట భుజించి విశ్రమించి యుండఁగా మధురమైన రామాయణ గానము వినిపించెను. అప్పటికి వాల్మీకి రామాయణమును రచించె నన్న మాట.

కుశలవులకు ఆయన గర్భైకాదశమునందు, అనఁగా గర్భము మొదలైనప్పటినుండి తొమ్మిదినెలలు కలుపుకొని లెక్కింపగా పదునొకండవసంవత్సరము వచ్చినప్పుడు, గ్రీష్మర్తువులో ఉపనయనము కావించియుండును.

శ్లో॥ తస్య బుద్ధి స్సముత్పన్నా నివేశ్య మధురాం పురీమ్।
రామపాదే నిరీక్షేఽహం వర్షే ద్వాదశ ఆగతే॥ సర్గ 70-16
స భుక్త్వా న్నరశ్రేష్ఠో గీతమాధుర్య ముత్తమమ్।
శుశ్రావ రామచరితం తస్మిన్ కాలే యథాకృతమ్॥ సర్గ 71-14
("యథా క్రమమ్'' — గోవిందరాజపాఠము)

వసంతే బ్రాహ్మణ ముపనయీత। గ్రీష్మే రాజన్యగ్ం
శరది వైశ్యం। గర్భాష్టమేషు బ్రాహ్మణం। గర్భైకాదశేషు
రాజన్యం। గర్భద్వాదశేషు వైశ్యం॥ 3
అపస్తంబ గృహ్యసూత్ర—చతుర్థః పటలః- దశమః ఖండః

పుట్టినప్పటినుండి లెక్కించినచో వారికి శ్రావణ మాసమున తొమ్మిదిసంవత్సరములు నిండును. తరువాత వచ్చిన జ్యేష్ఠ మాసమున ఆయన వారికి ఉపనయనము చేసియున్నచో అప్పటికి వారికి తొమ్మిది సంవత్సరముల పదినెలలు అగును. గర్భము కలిగినది మొదలుగా ప్రసవపర్యంతము గడచిన తొమ్మిది నెలలను కలుపుకొన్నచో అప్పటికి వారివయస్సు పది సంవత్సరముల ఏడు నెలలు అగును. అప్పటివఱకు శ్రీరాముఁడు పత్ని విషయము

గాని పుత్రుల విషయమునగాని స్వీకరించుటకు ప్రయత్నమేమైన చేయునేమో యని వాల్మీకి వేచియుండెను. కుశలవులు జన్మించి నప్పుడు శత్రుఘ్నుఁడు ఆశ్రమములో ఉండికూడ ఆవిషయమును ప్రస్తావింపకయే మధుపురమునకు వెడలిపోయెను. ఎవరును కుశ లవుల సంగతి అనుకొనకపోవుటవలన వాల్మీకియే తగిన సమయ మున ఉపనయనముగావించి వేదాధ్యయనముచేయించియుండును.

మహారాజవైభవముతో అయోధ్యలో జరుగవలసిన యుప నయనము తండ్రి లేకుండ కనీసము ఒక్కబంధువైనను లేకుండ, ఉత్సవరహితముగా జరుగుచున్నప్పుడు సీత ఇతరతాపస స్త్రీలును ఎంతో దుఃఖించియుండురు. పిల్లలుకూడ తండ్రివిషయమును అడు గుచు నుండవచ్చును. అట్టి సందర్భములతో ఏమి చెప్పుటకును తోఁచక వాల్మీకి మొదలుగా మహర్షులు సైతము దుఃఖాక్రాంతులై యుందురు. రాముఁడు బిడ్డలనుకూడ వదలివేసినట్లేనా? వారిభవి ష్యత్తు ఏమి? ఇది పెద్దసమస్యయై వాల్మీకి మనస్సును సంక్షోభ పెట్టుచుండియుండును. అప్పుడాయనకు రాముని ధార్మికత్వము నందు, కారుణికత్వమునందును సందేహమేర్పడి, దానివలన ఉద్వే గము కలుగుచు నుండియుండవచ్చును. ఒకస్థితిలో సీతను కుశల వులను గైకొనిపోయి నిండుసభలో ఈ విషయమై రాముని ప్రశ్నింపవలయునను తలంపు కూడ కలిగియుండును. ఈ పరి స్థితినే "కుందమాల" యను నాటకమునందు దిఙ్నాగుఁడు తుది యంకమున చిత్రించినాఁడు. సీతను వదలిపెట్టిపోవుచున్నప్పుడు లక్ష్మణుఁడు ఎంత వ్యథను పొందెనో చూచితిమి.

ఎట్లయినను ఆ యుపనయన సందర్భమున వాల్మీకి మహ ర్షికి మనస్సు సంక్షోభించియుండుననుట నిస్సంశయము. ఆ సంక్షో భమును నివారించుటకే చతుర్ముఖుఁడు ఆయన యొద్దకు నారద

మహర్షిని పంపెను. ఆయనను చూడఁగానే వాల్మీకి రాముని మనస్సులో నుంచుకొని, "'ఇప్పుడు ఈ లోకములో గుణవంతుఁడెవఁడు? ధర్మజ్ఞుఁడు కృతజ్ఞుఁడును అయినవాఁ డెవఁడు?" అని ప్రశ్నలవర్షమును కురిపించెను. నారదమహర్షి వాల్మీకి యొక్క ఆవేదనను గమనించి శ్రీరాముఁడు సకలకళ్యాణగుణపూర్ణుఁడేఅని అయన చరిత్రమును సంగ్రహముగా చెప్పుచు అయనయందు ధర్మవ్యతిక్రమము అసంభవమని సీతాదేవికి కుశలవులకు కష్టములు కలిగినచో వానిని పూర్వకర్మకు ఫలములనుగా భావింపవలయునే కాని రాముని వర్తనము అధర్మమని భావించుటకు వీలు లేదని సూచించెను.

రాముఁడు సీతను పరిత్యజించినతరువాత మరల ఆమెను గూర్చిగాని ఆమెసంతతినిగూర్చిగాని విచారింపఁదలంచుట కేవలము అసమంజసము అగును. అట్లు అయనగాని ఆయన తమ్ములుగాని విచారింప మొదలుపెట్టినచో అది ప్రజలకు తెలియకుండనుండదు. అప్పుడు మరల వారు "రాముఁడు లోకమును వంచించుటకై సీతను దూరముగా ఉంచినాఁడే కాని నిజముగా ఆమెను ఆయన వదలలేదు. ఎంతో కష్టపడి రాక్షసులను జయించి తెచ్చుకొన్న భార్యను వదలుకొనుట అంత సులభమా" అని అపవాదమును ప్రబలఁజేయఁగలరు. కావుననే అయనగాని ఆయన తమ్ములుగాని సీతనుగూర్చి కుశలవులనుగూర్చి పట్టించుకొనక ఏమియు తెలియనట్లే యుండిరి. సీతాదేవినిగూర్చి విలపించుచున్నను ప్రజలు రాముని దౌర్బల్యమునుగూర్చి చెప్పుకొనుచు మరల అపకీర్తిని కలిగింతురని లక్ష్మణుఁడు హెచ్చరించుట గమనింపఁదగి యున్నది.

ఆమెను పరిత్యజించుటలో రాముఁడు మఱియొక ధర్మసంకటమునుకూడ ఎదుర్కొనవలసివచ్చెను. ఈపరిత్యాగము తప్ప

చేసిన భార్యను భర్త వదలిపెట్టుటవంటిది కాదు. తప్పు చేయ లేదు, రాజకీయ కారణములకై ఆమెను దూరముగా ఉంచవలసి వచ్చినది. అట్టియెడల ఆమెను తప్పుచేసిన దానినివలె ఘోరా రణ్యమున విడిచిపెట్టుటకు వీలులేదు. ఆమె భద్రముగా జీవించు టకు తగిన ఏర్పాటును తప్పక చేయవలె. రాజ్య విప్లవము మొద లగునవి సంభవించినపుడు రాజులు తమ కుటుంబములను మహ ర్షుల యాశ్రమములయందు నుంచు నాచారము కలదు. దీని నను సరించియే కాళిదాసు శాకుంతలమున దుష్యంతుఁడు శకుంతలను స్వీకరించుటకు ఇష్టపడనప్పుడు పురోహితునియింట నుంచుటకు నిశ్చయించెను. ఈ యాచారము ననుసరించి లక్ష్మణుఁడు వాల్మీకి యాశ్రమమునందేయుండు మని సీతకు స్పష్టముగా చెప్పెను. కాని ఆమెను వాల్మీకి యొద్దకు తీసుకొనిపోయి ఆయనకు అప్పగింపక లక్ష్మణుఁడు ఆశ్రమ ప్రాంతముననే వదలిపెట్టి వెడలిపోయెను. శ్రీరాముఁడు ఆమెను వాల్మీకికి అప్పగింపు మని లక్ష్మణునకు చెప్పలేదు. ఎందువలన? ''జనాపవాదమునకు భయపడి నాభార్యను వదలిపెట్టుచున్నాను; ఆమెను ఆమె సంతతిని పోషించి రక్షించు భారమును మీరు వహింపుఁడు" అని రాముని మాటగా లక్ష్మ ణుఁడు వాల్మీకికి విన్నవింపవలె. ఇతరులను రక్షింపవలసిన క్షత్రి యుఁడు, అందును పరిపాలకుఁడైనరాజు, తన కుటుంబభారమును మఱియొకనికి అప్పగించుట తగదు. ఆ భారము మహర్షిపైపడకుండ కుటుంబ భరణమునకు కావలసిన వస్తుసామగ్రులను పరిచారకు లను ఆశ్రమమునకు పంపినచో అదియును జనులు శంకించుటకు అవకాశమును కలిగించును. కావున రాముఁడు గత్యంతరములేక కేవలము వాల్మీకియొక్క దాక్షిణ్యమునే ఆశ్రయించెను. భర్తచే పరిత్యజింపఁబడిన స్త్రీ అనాథయగును. అనాథయైన పతివ్రత ఆశ్రయములేక తనయాశ్రమముచెంతనున్నప్పుడు ధర్మాత్ముఁడైన

మహర్షి యుపేక్షింపఁడు. ముందు ఆమెకు ఆయన ఆశ్రయమిచ్చి తీరవలె. ఇది సాధారణ ధర్మము. కాని యిందు వాల్మీకికి విశేషమైన బాధ్యత కలదు. ఆయన దశరథునకు మిత్రుఁడు. మిత్రుని కోడలు ధర్మముచేత ఆయనకును కోడలే యగును. ఆమె దుస్థితి యందున్నప్పుడు ఆమెను ఆదుకోవలసిన బాధ్యత దశరథునకు ఎట్లుండునో వాల్మీకికిని అట్లేయుండును. "అయ్యో తండ్రీ! దశరథ! ఇప్పుడు నీవు చచ్చిపోయితివి'' (హా తాత!దశరథ! అద్య ఉపరతోఽసి) అని పరిత్యాగసందర్భమున సీత దశరథుని స్మరించి విలపించినట్లు కుందమాల నాటకమునందు చిత్రించుచు దిఙ్నాగుఁడు ఈ భావమునే స్పష్టమొనరించెను. కావున దశరథునకు జనకునకు మాఱుగా వాల్మీకి ఆమెయొక్క బాధ్యతను వహింపవలసివచ్చెను. అందువలన భర్తచేత విడిచిపెట్టఁబడి పుట్టింటికి చేరిన పుత్రిక విషయమున తండ్రికివలెనే వాల్మీకికిని నిరంతరమైన చింత ఏర్పడెను. సీతను కుశలవులను రామునకు అప్పగించుటకు ఉపాయము తోఁచక రాముఁడావిషయముననే పట్టించుకొనుట లేదని వాల్మీకి మిగుల ఉద్వేగమును పొందుచుండఁగా నారద మహర్షివచ్చి "రాముఁడు సకలకళ్యాణగుణసంపన్నుఁడు. సీత విషయమున ఆయన చేసిన తప్పేమియు లేదు. సీతవలెనే ఆయన కూడ ఎంతో బాధపడుచున్నాఁడు. ఆయన స్థితియు దయనీయమే" అని సూచించి కొంతవఱకు ఉద్వేగమును శమింపఁజేసి వెడలిపోయెను. రామునియందు తప్పులేని మాట నిజమే. జనాపవాదము తొలఁగించుటకు ఉపాయ మేదియు వాల్మీకికి తోఁచుటలేదు. అందువలన ఆయన మనస్సు సంక్షుభితముగానే యుండెను. అప్పుడే క్రౌంచమిథున వృత్తాంతము సంభవించినది.

# 6. కవిత్వావిర్భావము

నారదమహర్షి వెడలిపోయిన తరువాత వాల్మీకి భరద్వాజుఁ డను శిష్యునితోఁగూడ గంగకు దాపున నున్న తమసాతీరమునకు మధ్యాహ్న స్నానమునకైపోయెను. అచ్చటనిర్మలముగనున్న యొక రేవును జూచి ఆయన శిష్యునితో "భరద్వాజా! బురదలేక సన్మనుష్యుని మనస్సువలె ప్రసన్నమైన జలముతో రమణీయముగ నున్న యీతీర్థమును జూడుము. ఆ కలశమట నుంచి నాకు వల్కలము నిమ్ము; ఈ తీర్థమునందే స్నాన మొనర్తును" అని పలికెను.

శ్లో॥ అకర్దమ మిదం తీర్థం భరద్వాజ నిశామయ।
రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా॥ 5
బాల - (సర్గ - 2)

ఇట్లనుటవలన "సీతకై యపవాదమును ప్రసరింపఁజేయుచున్న జనుల మనస్సు లెంత పంకిలమైనవో కదా! ఆమె శీలము యొక్క మహత్త్వమును గుర్తింపఁగలిగిన యుత్తమసంస్కారము గలిగినవారు సన్మనుష్యు లెవరైన నున్నారా! అట్టివారు తీర్థసదృశులు గదా! అను వేదన ధ్వనించుచున్నది. ఆరోగ్యవంతుఁడై ఆరోగ్యవంతుల మధ్యలోనున్న వానికి ఆరోగ్యమునుగూర్చి యాలోచింపవలసిన యక్కఱ యుండదు. రోగము వచ్చినప్పుడే ఆరోగ్యమునుగూర్చి ఎవఁడైనను ఆలోచించుచుండును. అట్లే సీతారాముల విషయమున అపప్రసంగములను గావించుచున్న ప్రజలనుగూర్చి వాల్మీకి ఆలోచించుచున్నప్పుడు వారి మనస్సులు పంకిలములైన జలములవలె నున్నట్లు ఆయనకు తోఁచియుండును. వారి మనస్సులు సకర్దమము అప్రసన్నము అరమణీయమునైన వర్షాకాలపు బురదనీటివలె ఉన్న వన్నమాట.

పిమ్మట భరద్వాజుఁడిచ్చిన వల్కలముఁ గైకొని వాల్మీకి విపులమైన యావనము నంతను జూచుచు నటనట చరింప జొచ్చెను. కావుననే యొకచోట మనోహరముగ కూజితము నొనర్చుచు కూడియున్న క్రౌంచములజంటను అయన చూచెను. ఆయన చూచుచుండఁగనే వైరనిలయుఁడు పాపనిశ్చయుఁడునైన కిరాతుఁ డొకఁడు ఆ జంటలో మగపక్షిని గొట్టెను. ఒడలంతయు రక్తమున తడియఁగా నేలఁబడి పొరలుచున్న భర్తను జూచి, భార్య సకరుణముగా కూయఁజొచ్చెను. కామమోహితమైయున్న పక్షిని అట్లు నిషాదుఁడు పడఁగొట్టుట చూచినంతనే ధర్మాతుఁడైన యాఋషికి కారుణ్యము కలిగెను. ఏడ్చుచున్న క్రౌంచిని జూచి కారుణ్యవశమున ''ఇది యధర్మ''మని అయన నిషాదునితో ఇట్లు పలికెను. "క్రౌంచములజంటలో కామమోహితమైన యొకపక్షిని జంపితివి. కావున నీవు చిరకాలము మనుగడనొందవు."

శ్లో॥ తస్యాభ్యాశే తు మిధునం, చరన్త మనపాయినమ్।
దదర్శ భగవాం స్తత్ర కౌంచయో శ్చారునిస్వనమ్॥ 9

శ్లో॥ తస్మాత్తు మిధునా దేకం, పుమాంసం పాపనిశ్చయః।
జఘాన వైరనిలయో, నిషాద స్తస్య పశ్యతః॥ 10

శ్లో॥ తం శోణితపరీతాంగం, చేష్టమానం మహీతలే।
భార్యా తు నిహతం దృష్ట్వా రురావ కరుణాం గిరమ్॥ 11

శ్లో॥ వియుక్తా పతినా తేన, ద్విజేన సహచరిణా।
తాంమ్రశీర్షేణ మత్తేన, పత్రిణా నిహతేనవై॥ 12

శ్లో॥ తథావిధం ద్విజం దృష్ట్వా, నిషాదేన నిపాతితమ్।
ఋషే ర్ధర్మాత్మన స్తస్య కారుణ్యం సమపద్య చ॥ 13

శ్లో॥ తతః కరుణవేదిత్వా దధర్మోఽయ మితి ద్విజః।
నిశామ్య రుదతీం క్రౌంచీం, ఇదం వచన మబ్రవీత్॥ 14

శ్లో॥ మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః।
యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్॥ 15

బాలకాండ - సర్గ - 2.

ఇట్లు పలుకుచుండఁగనే ఆయనకు శంక కలిగెను. వెంటనే ఆయన తన హృదయమును పరిశీలించుకొనుచు "పక్షియొక్క శోకముచే ఆర్తుఁడనైన నేను, ఇది యేమి యిట్లు పలికితిని'' అను చింత నొందెను. ఆ మహాప్రాజ్ఞుఁడు ఆలోచించి యొక నిశ్చయ మొనర్చి "పాదములతోఁ గూర్పఁబడినది, ప్రతిపాదమునందును సమానమైన యక్షరసంఖ్య గలది, తంత్రులపై లయయుక్తముగా గానముచేయఁదగినదియునై శోకార్తుఁడనైన నానుండి వెలువడిన యీ వాక్ప్రసారము శ్లోకమే యగును. మఱొకటికాదు.'' అని శిష్యునితో చెప్పెను.

''శోకార్తుని నుండి సాధారణముగా వెలువడునది విలాపము. ఇది మాత్రము శ్లోకమే కాని విలాపముకాదు" అని మహర్షి వ్యక్త మొనర్చినాఁడు.

శ్లో॥ తస్యేత్థం బ్రువత శ్చిన్తా బభూవ హృది వీక్షతః।
శోకార్తే నాస్య శకునేః కిమిదం వ్యాహృతం మయా॥ 16

శ్లో॥ చిన్తయన్ స మహాప్రాజ్ఞ శ్చకార మతిమాన్ మతిమ్।
శిష్యం చై వాబ్రవీ ద్వాక్యం ఇదం స మునిపుంగవః॥ 17

శ్లో పాదబద్ధోఽక్షరసమ స్తంత్రీలయ సమన్వితః।
శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా॥ 18

బాలకాండ - సర్గ - 2

ఆ వాక్యమును భరద్వాజుఁడు సంతోషముతో పరిగ్రహించెను. అందులకు వాల్మీకియు సంతుష్టుఁడయ్యెను. తరువాత అచ్చట స్నానమొనర్చి జరిగినదానినే ఆలోచించుచు వాల్మీకి యాశ్రమమునకు తిరిగివచ్చెను. భరద్వాజుఁడును జలకలశమును గైకొని యాయన వెంట వచ్చెను. ఆశ్రమములో కూర్చుండి వాల్మీకి పైవృత్తాంతమునే ధ్యానించుచు శిష్యునితో ఆయా కథలనుగూర్చి ప్రసంగింపఁజొచ్చెను.

అప్పుడు లోకకర్తయైన చతుర్ముఖుఁడు ఆ మునిపుంగవుని జూడవచ్చెను. వాల్మీకి బ్రహ్మదేవుని జూచి పరమవిస్మితుఁడై వెంటనే లేచి పాద్యార్ఘ్యాసనవందనములతో పూజించి ప్రణమిల్లెను. అంతట పరమేష్ఠి ఉత్తమాసమున కూర్చుండి వాల్మీకిని గూడ కూర్చుండుమనెను. వాల్మీకియు కూర్చుండి ఆ లోక పితామహుని సన్నిధానమునకూడ, "అట్టి చారురవమైన క్రౌంచమును అకారణముగా చంపి ఆనిషాదుఁడెంత క్రూరమైన పనిని చేసెను అని యావృత్తాంతమునే ధ్యానించుచు ఆ శ్లోకమునే మరల మనస్సులో పఠింపఁజొచ్చెను. బ్రహ్మదేవుఁ డామునిని జూచి నవ్వుచు "నీచేతఁ గూర్పబడినది శ్లోకమే; విచారింపవలసినపని లేదు; నాయభిప్రాయము ననుసరించియే నీనుండి సరస్వతి యిట్లు ప్రసరించినది; ధర్మాత్ముఁడు భగవంతుఁడునైన రాముని చరిత్ర మంతయును నారదునివలన విన్నప్రకారమున రచింపుము; రాముఁడు సౌమిత్రి సీత రాక్షసులు మొదలుగా నెల్లవారియొక్క ప్రకాశములైనవే కాక రహస్యములైనవికూడ సకల వృత్తాంతములు నీకు విదితము లగును, ఈకావ్యమునందు నీవాక్కు ఏదియును అనృతము కాదు; పుణ్యమైన రామకథను శ్లోకబద్ధముగా మనోహరముగా రచింపుము; మహీతలమున నెంతకాలము కొండలు నదులు

నుండునో అంతకాలము రామాయణకథ లోకములందు ప్రసరించుచుండును; అంతవఱకు ప్రశస్తుఁడవై యీలోకముననేగాక అనంతరము నాలోకములయందును ఉండఁగలవు"అని పలికి యచ్చటనే యంతర్హితుఁడయ్యెను

శ్లో॥ బ్రహ్మణా సమనుజ్ఞాతః సోఽప్యుపావిశ దాసనే।
ఉపవిష్టే తదా తస్మిౝ సాక్షా ల్లోకపితామహే॥ 27

శ్లో॥ తద్గతేనైవ మనసా వాల్మీకి ర్ధ్యాన మాస్థితః।
పాపాత్మనా కృతం కష్టం వైరగ్రహణబుద్ధినా॥ 28

శ్లో॥ యత్తాదృశం చారురవం క్రౌంచం హన్యా దకారణాత్ ।
శోచన్నేవ పునః క్రౌంచీ ముపశ్లోక మిమౌ జగౌ ॥ 29

శ్లో॥ పున రంతర్గతమనా భూత్వా శోకపరాయణః।
త మువాచ తతో బ్రహ్మా ప్రహసన్ మునిపుంగవమ్॥ 30

శ్లో॥ శ్లోక ఏవ త్వయా బద్ధో నాత్రకార్యా విచారణా।
మచ్ఛందా దేవ తే బ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ॥ 31

శ్లో॥ రామస్య చరితం కృత్స్నం కురు త్వం ఋషిసత్తమ।
ధర్మాత్మనో భగవతో లోకే రామస్య ధీమతః॥ 32

శ్లో॥ వృత్తం కథయ ధీరస్య యథా తే నారదా చ్ఛ్రుతమ్!
రహస్యం చ ప్రకాశం చ యద్వృత్తం తస్య ధీమతః॥ 33

శ్లో॥ రామస్య సహ సౌమిత్రే రాక్షసానాం చ సర్వశః
వైదేహ్యాశ్చైవ యద్వృత్తం ప్రకాశం యది వా రహః 34

శ్లో॥ తచ్చా ప్యవిదితం సర్వం విదితం తే భవిష్యతి।
న తే వా గనృతా కావ్యే కాచి దత్ర భవిష్యతి॥ 35

శ్లో॥ కురు రామకథాం పుణ్యాం శ్లోకబద్ధాం మనోరమామ్।
యావ త్స్థాస్యన్తి గిరయః సరిత శ్చ మహీతలే॥ 36

శ్లో॥ తావ ద్రామాయణకథా లోకేషు ప్రచరిష్యతి।
యావ ద్రామస్య చ కథా త్వత్కృతా ప్రచరిష్యతి॥ 37

శ్లో॥ తావ దూర్ధ్వ మధ శ్చ త్వం మల్లోకేషు నివత్స్యసి।
ఇత్యుక్త్వా భగవాన్ బ్రహ్మ తత్రైవాంతరధీయత॥ 38

బాల. - సర్గ. 2

వాల్మీకి శిష్యులును విస్మితులైరి. అనంతరము శిష్యులందఱును ప్రీతితో నాశ్లోకమును మాటిమాటికి పాడుకొనుచు "సమాక్షరములైన నాల్గుపాదములతో మహర్షిచే శోక మతిశయించినంతనే పలుకఁబడుటవలన ఆ తీవ్రమైన శోకమే శ్లోకముగానయ్యె"నని చెప్పుకొనఁజొచ్చిరి. జరిగిన దాని నంతను భావించుచున్న యామహర్షికి "రామాయణ కావ్యము నంతను ఇట్టి శ్లోకములతో రచింతునుగాక'' యను తలంపు కలిగెను,

శ్లో॥ తస్య శిష్యా స్తత స్సర్వే జగు శ్శ్లోక మిమం పునః।
ముహుర్ముహుః ప్రీయమాణాః
ప్రాహు శ్చ భృశవిస్మితాః॥ 39

శ్లో॥ సమాక్షరై శ్చతుర్భి ర్యః పాదైర్గీతో మహర్షిణా।
సోఽనువ్యాహరణా ద్భూయః శోక శ్శ్లోకత్వ మాగతః॥ 40

శ్లో॥ తస్య బుద్ధి రియం జాతా మహర్షే ర్భావితాత్మనః।
కృత్స్నం రామాయణం కావ్య మీదృశైః
కరవా ణ్యహమ్॥ 41

బాల. సర్గ. 2

ఈ ఘట్టము చాల ముఖ్యమైనది. ఇందు మానవలోకమున తొలుతగా వాల్మీకి మహర్షియందు ఛందోబద్ధమైన శ్లోకముతో

కవిత్వావిర్భావము జరుగుట వర్ణింపఁబడినది. అంతకుపూర్వము ఛందస్సులు లేకపోలేదు. వేదములలో ఎన్నో ఛందస్సులు కలవు. వేదములకు ఛందస్సులనియే పేరు. (ఛందాంసి యస్యపర్ణానికి గీత) కాని అవి అపౌరుషేయములు; ఈశ్వరదత్తములు· వానికి భిన్నముగా ఛందోబద్ధముగా శ్లోకరచనము జరుగుట ''మానిషాద' అనుశ్లోకముతోనే యారంభమైనది. అప్పటికి మానవభాషా వ్యవహారములో ఇట్టి శ్లోకరచనములేదు. అట్టి రచనమే యున్నచో వాల్మీకి, భరద్వాజుఁడు విస్మయము నొందనక్కఱలేదు. "శోకార్తుఁడైన నానుండి వెలువడిన యీ వాగ్వృత్తి శ్లోకమేకాని యన్యము కాదు'' అని యాలోచించి వాల్మీకి నిశ్చయించి చెప్పవలసిన యక్కఱయు నుండదు. బ్రహ్మదేవుఁడు ప్రత్యక్షమై "నీచే కూర్పబడినది శ్లోకమే. సందేహములేదు; నా సంకల్పమువలననే నీయందు సరస్వతి ప్రసరించినది'' అని చెప్పుటయు అనావశ్యకమే యగును, కావున పై సందర్భమును పరిశీలించినచో మానవలోకమున ఛందోబద్ధమైన కవిత్వావిర్భావము ''మా నిషాద"యను శ్లోకముతోనే యారంభమైన దనుట స్పష్టము, కాని యంతకు పూర్వము అయోధ్యలో వధూ నాటక సంఘములున్నవని, రామాయణకథలో ప్రస్తావింపఁబడినది కదా!

శ్లో॥ వధూనాటకసంఘైశ్చ సంయుక్తాం సర్వతః పురీమ్॥
బాల-సర్గ. 5-శ్లో 12.

ఆ నాటకములలో గీతములలో కవిత్వములేదా? వానియందే కవిత్వ మున్నచో వాల్మీకి ఆదికవి యగుట యెట్లు సంభవించును.? అప్పటికీ గీతములు నృత్యములు నాటకములు ఉన్నను, అవి యన్నియు జానపదములైన పాటలతో వచనములతో కూడినవే కాని నియతములైన పద్యఛందస్సులలో నిబద్ధమైనవి కావు. తెలుఁ

గులో స్త్రీలపాటలకు జానపదగేయములకు నన్నయభట్టారకుని పద్యరచనకు ఎంత భేదము కలదో అట్టి భేదమే వాల్మీకికి పూర్వమున్న సాహిత్యమునకు "మానిషాద'" అను శ్లోకముతో నారంభమైన పద్యకావ్య సాహిత్యమునకును గలదు, కావున ఛందోనియమబద్ధమైన కావ్యసాహిత్యము ''మానిషాద'' అను శ్లోకముతోనే యారంభమయ్యె ననుట స్పష్టము.

బ్రహ్మదేవుని సంకల్పమువలన మానవలోకమున తొలుతగా మహర్షియందు ఆవిష్కృతమైన శ్లోకము శాపరూపముగనుండుట యేమి? ఈ సమస్యను పరిష్కరించుటకు వ్యాఖ్యాత లందఱు పెక్కువిధముల ప్రయత్నించిరి. అందు శ్రీ గోవిందరాజస్వామి యొక్క వివరణము సాంప్రదాయికులకు అందఱకును సమ్మతమైనది. ''చతుర్ముఖుని ప్రసాదమువలన వాల్మీకిముఖమునుండి తొలుతగా వెలువడిన శ్లోకము కేవలము శాపపరము కాఁజాలదు. భగవంతునకు మంగళాశాసనము గావించుచు నిది మంగళాచరణరూపమైన శ్లోకమే యగునని పూర్వాచార్యులు చెప్పుచున్నారు. 'మా' అనఁగా లక్ష్మి. 'నిషాద' మనఁగా నివాసము. మానిషాదుఁడనఁగా శ్రీనివాసుఁడు. మానిషాదఅనఁగా ఓశ్రీనివాస! అని సంబోధనము. క్రుంచ గతికౌటిల్యాల్పభావయోః అనుధాతువుయొక్క అర్థమువలన (క్రౌంచౌ కుటిలౌ కుటిలవర్తనౌ రాక్షసౌ తన్మిథునాత్') మండోదరీరావణరూపమైన రాక్షసమిథునమునుండి కామమోహితుఁడైన రావణుని సంహరించితివి; కావున నీవు చాల సంవత్సరములు కీర్తిప్రతిష్ఠ నొందుము. ఇట్లు ఈ శ్లోకముచేత ఇష్టదేవతా స్మరణరూపమైన మంగళ మాచరింపఁబడినది."

6) "కొందఱచే నాందియందే కావ్యార్థసూచనము గావింపఁబడును'' అనులక్షణము ననుసరించి గోవిందరాజస్వామి ఈ శ్లోక

మున ఏడుకాండలకథయును, ఎట్లు చూపింపఁబడినదో వివరింపఁ బ్రయత్నించినాఁడు "మానిషాద" యను సంబోధమునకు శ్రీనివాస యనునది యర్థమగుటచే, లక్ష్మీరూపిణి సీత రాముని జేరుట చెప్పఁబడుటచే, ఆమాటచే బాలకాండకథ సూచింపఁబడుచున్నది. 'ప్రతిష్ఠాం త్వం అగమః ప్రతిష్ఠను నీవు పొందితివి అనుమాటచేత, పితృవచన పరిపాలన రూపమైన ధర్మప్రతిష్ఠ చెప్పఁబడుటచే, అయోధ్యాకాండకథ సూచిత మగుచున్నది. శాశ్వతీ స్సమాః'' శాశ్వతములైన వత్సరములు అనుమాటచేత దండకారణ్యవాసులైన మహర్షులకు రాక్షసవధ గావింతు నని రాముఁడు ప్రతిజ్ఞచేసి దానిని నిర్వహించి శాశ్వతకీర్తి నందిన వృత్తాంతముగల అరణ్యకాండకథ సూచిత మగుచున్నది. "క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్" అనుమాటలచేత క్రౌంచమిథున మనఁగా తిర్యక్కులైన తారా వాలిమిథునమునందు వాలిని జంపుట అనునర్థమును గ్రహించినచో కిష్కింధాకాండకథ సూచితమగుచున్నది. క్రౌంచమిథున మనఁగా కృశించిన మిథునము, అనఁగా సీతారాములు అని గ్రహించినచో సుందరకాండకథ వ్యక్తమగును. క్రౌంచమిథున మనఁగా మండోదరీ రావణమిథునమును గ్రహించినచో యుద్ధకాండకథ సూచింపఁబడును. కామమోహితమ్ అను పదముచేత ఋషిపత్నీ దర్శనాభిలాషచే మోహితయైన సీతయొక్క వృత్తాంతమును గ్రహించినచో ఉత్తరకాండకథ కూడ సూచితమగును.'' ఇది సంప్రదాయ వివరణము.

ఈశ్లోకము రామాయణమునకు ''నాంది" యని గాని మంగళాచరణ మని గాని చెప్పుటకు ప్రతిబంధకము లనేకములు కలవు. ఈశ్లోక మావిర్భవించునప్పటికి వాల్మీకికి కావ్యరచనము చేయవలయునను సంకల్పములేదు. బ్రహ్మదేవుఁడు వచ్చి రామునిచరి

త్రమును రచింపు మని చెప్పినప్పుడుకూడ వాల్మీకి అట్లే చేయుదు ననియైన చెప్పలేదు. పరమేష్ఠి అంతర్హితుఁడైన పిమ్మట శిష్యులు అశ్లోకమును మాటిమాటికి చదువుచుండఁగా ఇట్టి శ్లోకములతో రామాయణ కావ్యమును రచింతునను సంకల్పము ఆయనకు కలిగెను. కావున రచనా సంకల్పమునకు ముందెప్పుడో ఆవిర్భవించిన శ్లోకము తరువాత రచింపఁబడిన కావ్యమునకు "నాంది" యగు ననుట అసంగతము. ఏ కవియైనను కావ్యరచనకు సంకల్పించిన తరువాతనే మంగళాచరణము కావించును. కావున ఇది నాంది యని గాని మంగళాచరణ మని గాని చెప్పుటకు వీలులేదు.

ఇది రామాయణ కావ్యమునకు నాంది కాకపోయినను మానవ లోకమున కవిత్వా విర్భావమునకు ప్రథమ శ్లోక మనుట మాత్రము తప్పదు. మఱి కవిత్వా విర్భావమున ఈ తొలి శ్లోకమును పరమేష్ఠి శాపరూపమున ఏల వెలయించినాఁడు? అను సమస్య యుండనే యున్నది. వాల్మీకినుండి యిట్టి శ్లోకమును వెలువరించుటలో ఆయన తలంపు ఏమైయుండును!

ఆయన తలంపును ఇట్లు గ్రహింపవచ్చును. సీతాదేవి యొక్క శోకమును జూచి యార్తుఁడైన యా మహర్షి యందు శ్రీరామునిగూర్చి యుద్వేగము పొంగుచుండఁగా ఆయన నారదుని పంపి రాముని ధార్మికత్వము నుద్బోధించి, రాముని విషయమున వాల్మీకియొక్క మనస్సు ప్రసన్నమగునట్లు చేసెను. రాముని విషయమున వాల్మీకి మనస్సు ప్రసన్నమైనను, సీతాకుశలవుల భవిష్యత్తునకు దిక్కుతోఁచక పోవుటచే ఆయుద్వేగము సీతపై అపవాదమును ప్రబలఁజేసిన ప్రజలవైపునకు ప్రసరించెను. తమసానదీ తీర్థమును చూచి ఆమహర్షి దాని ప్రసన్నత్వమును సన్మనుష్యుని మనస్సుయొక్క నిర్మలత్వముతోపోల్చి భావించుటవలన ప్రజలపై

ఆయనకు గల యావేదన, సీతాదేవియొక్క శీలమాహాత్మ్యమును గుర్తింపగలిగిన సన్మనుష్యులు, తీర్థసదృశు లెవరైన నున్నారా అను భావము స్పష్టమగుచున్నవి. అట్టిపరిస్థితియందు పరమేష్ఠియే బోయవాడు చంపజూచుచున్న క్రౌంచమిథునము నొద్దకు వాల్మీకిని నడిపించెను. బోయవాడు క్రౌంచమిథునమున మగపక్షిని కొట్టుట సీతారాముల సందర్భమునకు సదృశముగనే యున్నది. నిషాదునివలె కఠినచిత్తులైన ప్రజలనుండి ప్రసరించిన యుపవాదము రాముని హృదయమున బాణమువలెనే తాకినది. రాముడు క్రౌంచమువలెనే వేదనతో నాల్గుదినములు గిలగిల తన్నుకొనెను. ఆయన పౌరకార్యములను చూడలేకపోయెను. అది ఆయన మర్మములను భేదించుచుండెను. సీతకూడ తన దుస్స్థితికేగాక రాముని యవస్థకును శోకించుచుండెను. ఇట్టి క్రౌంచసన్నివేశమును చూడగనే వాల్మీకి హృదయమున ప్రజల నిష్ఠురత్వమునుగూర్చి పొంగుచున్న యావేదన క్రౌంచీ విలాపము నిమిత్తముగా బోయవానిపై శాపరూపమున ప్రసరించినది శోకము కలిగినప్పుడు ఏడ్పువలన కోపమువచ్చినప్పుడు తిట్టుటవలన మనస్సు తేలికపడును. అట్లే శాపరూపమున ఆవేదన బయల్పడుటవలన వాల్మీకి మనస్సు కొంత వఱకు తేలికపడినది. అప్పుడామహర్షికి "ఈ క్రౌంచియొక్క శోకమువలన అర్తుడనై నేనేల యిట్లు శపించితిని? బోయవానికి పక్షులను చంపుట సహజముకదా! పక్షులను హింసింపరాదను సంస్కారము వాని కెట్లుండును? అని యాలోచన మారంభమైనది. ఈయాలోచనా క్రమముననే ఆయన ప్రజలనుగూర్చి సానుభూతితో ఆలోచింప మొదలిడెను. సామాన్యమైనప్రజానీకము సీతగావించిన యగ్ని ప్రవేశమును నమ్మలేకున్నచో ఆప్రజలపై ఆక్రోశమునొందుటలో అర్థమేమున్నది ? అని తన్ను తాను సమాధానపఱచుకొని, "సీతాకుశలవుల విషయమున వారి సుకృత మెట్లున్న అట్లు

జరుగును, నేనేల యావేగము నొందవలె" అని యాయన తలంచుట కవకాశ మేర్పడెను. అట్లు ఆయనమనసంతయు క్రౌంచ వృత్తాంతము నందును హఠాత్తుగా ఆవిర్భవించిన శ్లోకమునందును నిమగ్నమైయున్నప్పుడు చతుర్ముఖుఁడు ప్రత్యక్షమై ఆయన మనస్సును క్రౌంచ వృత్తాంతమునుండి రామాయణ కావ్య రచనము వైపునకు మరలించెను. కావున ఆపితామహుని దృష్టియందు వాల్మీకిమనస్సు రామునిగూర్చి ప్రజలనుగూర్చి కలిగినయుద్వేగమునుండి నిర్ముక్తమై తేలికపడుట ఆవశ్యకము. కథానాయకునియెడల, కావ్య శ్రోతలైన ప్రజలయెడల ప్రసన్నమైన చిత్తము లేకున్నచో కావ్యరచనము పొసఁగదు. అందువలన ఆ లోకపితామహుఁడు క్రౌంచ వృత్తాంతము నిమిత్తముగా శాపరూపమున వాల్మీకి మనస్సులోని యావేగమును తొలఁగించి ప్రసన్నమగునట్లుచేసి మహాకావ్యనిర్మాణమునకు అర్హమగునట్లు చేసినాఁడన్నమాట.

మహాకావ్య నిర్మాణమునకు కవియందు ప్రసన్న చిత్తత ఆవశ్యకమని దీనివలన స్పష్టమగుచున్నది. కామ క్రోధ పరాయణులైన వారు మహాకావ్య నిర్మాణమునకు అర్హులు కారనుటయు స్పష్టము. ఒకవేళ అట్టివాఁడు ప్రతిభాపాండిత్యములబలముతో అట్టి నిర్మాణమును కొనసాగించినను అట్టికావ్యములు సకల జనులకు పవిత్ర గ్రంథములుగా ఆరాధ్యములు కాఁజాలవు. దేశ భాషలతో రామాయణ మహాభారత భాగవతాది గ్రంథములను నిర్మించిన తులసీదాసస్వామి, కంబమహాకవి, కవిత్రయమువారు, పోతనామాత్యుఁడు మొదలగువారందఱు ధర్మనిష్ఠచేత భగవద్భక్తిచేత మహర్షులతో సమానులలైనవారే యని గ్రహింపవలసియున్నది. వారందఱు మహాపురుషు లగుట చేతనే వారి వాక్కుల యందు మహోదాత్తమైన సౌందర్యముతోపాటు పవిత్రతయు నిండియున్నది.

చతుర్ముఖుఁడు సాక్షాత్కరించి కవిత్వావిర్భావము తన యొక్క సంకల్పమువలననే కలిగినదని, ఆకవిత్వముతో శ్రీరాముని చరిత్రమును రచింపుమని చెప్పి అంతర్హితుడైన తరువాత వాల్మీకి మహర్షి జరిగిన వృత్తాంతమంతయు భావించి పరమేష్ఠిచే నుద్దేశింపబడిన మహాకావ్యరచనమునకు తాను నిమిత్తమాత్రుఁడే యని గ్రహించి సకల విషయములందును అహంకార మమకారములను వీడి పరమప్రసన్నమైన చిత్తముతో మహాకావ్యరచనమునకు పూనుకొనెను. "అహంకార రాహిత్యమువలన "నేను ఇంత మహాకావ్యమును రచించుచున్నాను." అను భావన లేకపోవుటవలననే తన్ను గూర్చి యాయన ప్రథమ పురుషలో. "వాల్మీకి భావించెను." "వాల్మీకి రచించెను." అని తటస్థముగా చెప్పుకొనుట సంభవించినది.

పరమేష్ఠి ఈశ్లోకముద్వారా వాల్మీకి మనస్సులోని శోకతాపములను వెలువరించి దానిని నిర్మలము గావించినను, ఆయన మానవుల కవితలోని తొలి శ్లోకమును శోకమూలకమైన శాపరూపమున ఎందులకు వెలయించినాడు? అను ప్రశ్నకు సమాధానము ఏర్పడ లేదు. ఆయన శాపమునే తొలి శ్లోకముగా చేయ నక్కఱలేదు. వాల్మీకి బోయవానిని సాధారణమైన వచనములో క్రోధవాక్కులతో తిట్టి యుండవచ్చును చిత్తము ప్రసన్నమైన తరువాత సీతారాములనుగూర్చి ఆయన భావించుచున్నప్పుడు వారి గుణ ప్రశంసతో ఆయన నుండి తొలిశ్లోక మేదైన ఆవిర్భవించి యుండవచ్చును. కాని బ్రహ్మదేవుఁడు అట్లు చేయలేదు. మహర్షి బోయవానిని శపించునప్పడే తొలిశ్లోకము ఆవిర్భవించునట్లు చేసెను.

దీనికి కారణము నిట్లు ఊహింపవచ్చును. కవిత్వమునకు ప్రేరణమును ప్రయోజనమును పరమేష్ఠి యీయాద్య శ్లోకము నందు నిరూపించెనని గ్రహింపవచ్చును. బోయవాఁ డధర్మముగా క్రీడాసక్తమైయున్న మిథునమునం దొకదానిని చంపి వానికి మహా దుఃఖమును కలిగించుట చూచినంతనే వాల్మీకి "అయ్యో! ఇది యధర్మము" అని యావేగమునొంది వానిచర్యను నిరసింపఁగా ఆవాగ్వృత్తి శ్లోకమైనది అనఁగా అధర్మ నిరసనమే కవిత్వా విర్భావమునకు ప్రేరణమైనది. అధర్మా చరణమును చూచి నంతనే ఆయన అంత యావేగము నొందుటకు ఆయనయందు గాఢముగ పరిణతమైయున్న ధర్మాభిరతియే కారణము. గాఢమైన ధర్మానురాగములేనివానికి అధర్మము జరుగుచున్నప్పుడు ప్రత్య క్షముగా చూచుచున్నను "మనకెందుకు లెమ్ము" అను ఉపేక్షా భావమే యుండును గాని, 'ఇది యధర్మము; దీనిని ఖండింపవలె' అనునావేగము కలుగదు. ఆ సమయమున వాల్మీకి కాక, వేఱొక నిషాదుఁడో సామాన్యపౌరుఁడో, జానపదుఁడో అదృశ్యమును చూచుట తటస్థించినచో వారు వాల్మీకివలె దానిని నిరసించుటకు ఆవేగము నొందరు. కావున అధర్మమును తిరస్కరించుచు ధర్మ మును పోషింపవలయు నను భావమే కవిత్వమునకు ప్రేరణముగా నుండవలె నన్నది పరమేష్ఠియొక్క ఆశయము. లోకరక్షణమునకై భగవంతుఁ డవతరించి దుష్టశిక్షణము శిష్టరక్షణము ధర్మసంస్థా పనము అను నేకార్యక్రమమును నిర్వహించుచున్నాఁడో ఆ కార్య సరణియే కవిత్వమునకును ప్రేరకముగా నుండవలె నన్నమాట.

ఈ శ్లోకమున ఈలోకములోని జీవితముయొక్క యథార్థ స్వరూపముకూడ సంగ్రహముగానిరూపింపఁబడినది. ఎంతకాలమో యిట్లు సుఖింపఁగల నని క్రీడించుచున్న యాక్రౌంచమునకు బోయ

వాని బాణమువలన జీవితము తత్క్షణమే ముగిసెను. పక్షుల నిట్లే కొట్టి తినుచు చిరకాలము జీవింతునని తలఁచుచున్న బోయవానికి కూడ మహర్షి శాపమువలన జీవితము క్షణభంగురమే యయ్యెను. ఎంతకాల మున్నను జీవితము మరణముతో ముగియక తప్పదు. కాని మానవులు మరణమును గూర్చిన యీనిజమును గ్రహించుట కిష్టపడరు. ఎప్పటికప్పుడు "మరణము ఇప్పుడు కాదు గదా!" అను దృఢమైన భావనతో భోగములందు ప్రసక్తులగుచుందురు. వారు తాపత్రయపడి అనుభవించుచుండు భోగములు కూడ నిజముగా సుఖప్రదములు కావు. భోగమున రోగ భయము తప్పదు. పరదారధనాదుల కోరువానికి మహావ్యథారూపమైన నరకముకూడ తప్పదు. సుఖమును కోరి భోగించుచున్న యాక్రౌంచ మిధునమునకు క్షణములో వియోగము కలిగి దుఃఖమే మిగిలెను. సరసమైన క్రౌంచమాంసమును భక్షింపఁగోరుచున్న బోయవానికికూడ శాపమువలన జీవితము దుఃఖమయమేయైనది. కావున జీవితమునకు యథార్థములైన లక్షణములు అనిత్యత్వము, అసుఖమయత్వము. శ్రీకృష్ణభగవానుఁడు "ఈలోకస్వరూపము అనిత్యము, అసుఖమే"యని, "ఈలోకమున జన్మించినవాఁడు నిత్యసుఖమునకై తన్ను ఆశ్రయింప వలయు' నని స్పష్టముగా చెప్పినాఁడు.

శ్లో॥ అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్॥

భగవద్గీత-అధ్యా. 9—శ్లో. 33

కావున కవియును మానవులకు జీవితముయొక్క నిజస్వరూపమైనయనిత్యత్వమును, దుఃఖమయత్వమును చక్కఁగా ప్రబోధించి వారు ఈశ్వరాభిముఖు లగునట్లు చేయుటకే ప్రయత్నింపవలయును. అదియే మానవ జీవితమునకు పరమప్రయోజన రూపమైన మంగళము. కావున కవిత్వమునకును అదియే పరమ ప్రయో

జనముగా మంగళప్రదము అగుననుట పరమేష్ఠి యుద్దేశించిన రెండవయంశము. కావున కవులు జీవితములోని భోగవిషయము లను శృంగారాదిరసములతో మనోహరముగ వర్ణించి మానవులను భోగలాలసులను గావించుటకు ప్రయత్నింపరాదు. భోగలాల సత్వము సకల ప్రాణులకు సహజమైన లక్షణమే. దానిని ప్రకృతియే యుద్రేకింపఁ జేయఁగలదు, దానిని ప్రకోపింపఁజేయుటకు ఎవరును ప్రయత్నింప నక్కఱలేదు. ఆ ప్రయత్నము వారిని వారున్నస్థితినుండి అధఃపతితులను జేయును. కావున మహనీయుఁడైన కవి యెడనెడ మానవులను తన కభిముఖులను గావించు కొనుటకై శృంగారాదిరసములను వర్ణించినను ప్రధానముగా జీవితముయొక్క క్షణభంగురత్వమును దుఃఖమయత్వమును ప్రదర్శించి వారు పరమేశ్వరాభిముఖు లగునట్లు చేయుటకే ప్రయత్నింపవలె. వ్యాసభగవానుఁడు చెప్పినట్లుగా కామ సుఖములుగాని, దివ్యలోకభోగములు గాని, తృష్ణాక్షయసుఖములో పదునాఱవ పాలునకు కూడ సరిపోల వను విషయమును దృఢముగా మనస్సుల కెక్కునట్లు కవులు బహుముఖముల ప్రతిపాదింపవలె.

శ్లో॥ యచ్చ కామసుఖం లోకే, యచ్చ దివ్యం మహత్సుఖమ్‌।
తృష్ణాక్షయసుఖ స్యైతే నార్హత్తః షోడశీం కలామ్,

రామాయణ భారత భాగవతములలో, శ్రీరామ ధర్మజ పరీక్షితుల చరిత్రల మూలమున జీవితముయొక్క నశ్వరత్వము దుఃఖప్రాయత్వము చిత్రింపఁబడిన దనుట స్పష్టము. సంసార విముఖులై సదానందులైయున్న వాల్మీకినారదాది మహర్షుల జీవితములవలన, ఆధునికులైన శ్రీరామకృష్ణుఁడు వివేకానందుఁడు రమణమహర్షి మొదలగు మహనీయుల చరిత్రలవలన తృష్ణాక్షయ సుఖమే మహానంద మని మనము స్పష్టముగా గ్రహింపవచ్చును.

జీవితముయొక్క క్షణభంగురత్వమును దుఃఖప్రాయత్వ మును చిత్రించినచో అట్టికావ్యము మనోహరముగా నుండునా ? కాని యీ "మానిషాద" అను శ్లోకము నవలంబించియే అలంకారిక మూర్ధన్యుఁడైన యానందవర్ధనుఁడు ధ్వన్యాలోకమున రస ధ్వని కావ్యమునకు ఆత్మయని ప్రతిపాదించినాఁడు.

"అయర్థమే కావ్యమునకు ఆత్మ. పూర్వము ఆది కవికి అట్లే క్రౌంచ ద్వంద్వవియోగమువలన కలిగిన శోకము శ్లోకత్వమును పొందినది" దీనిని అభినవగుప్తుఁడు ఇట్లు వివరించినాఁడు." అయర్థమే అనఁగా రసధ్వనియే స్థాయిభావమైన శోకము, హృదయ సంవాదము తన్మయీ భవనము అను క్రమమువలన ఆస్వాద్యమానత్వమును పొందెను. ఆశోకము లౌకికమైన శోకమునకు భిన్నమై, చిత్తము ద్రవించుటచేత కలుగునట్టి యనుభూతియే సారముగాఁగలిగిన కరుణరస రూపత్వమును పొందెను. నీటితో నిండిన కుండ తొణఁకినట్లు చిత్తవృత్తి పొంగినప్పుడు వెలువడు వాగ్విలాపాదికములవలె. ఆ శోకము ఆవేశమువలన అప్రయత్నముగనే సముచితములైన శబ్దములు ఛందస్సు వృత్తము మొదలగువాని చేత నియంత్రితమై శ్లోకరూపత్వమును పొందెను.

శ్లో॥ కావ్య స్యాత్మా స ఏవార్థః తథా చాదికవేః పురా।
క్రౌంచద్వంద్వవియోగోత్థః, శోక శ్లోకత్వ మాగతః॥
ధ్వన్యాలోక - 1-5

లోచనము:— స ఏవ అర్థః రసధ్వనిః ఏవ; శోకః స్థాయిభావః హృదయ సంవాదతన్మయీ భవనక్రమాత్ ఆస్వాద్యమానతాం ప్రతిపన్నః, కరుణ రసరూపతాం లౌకికశోకవ్యతిరిక్తాం స్వచిత్త ద్రుతి సమాస్వాద్యాసారాం ప్రతిపన్నః; రసభావాఃపూర్ణకుంభోచ్ఛల

నవత్ చిత్తవృత్తి నిష్యంద స్వభావ వాగ్విలాసాదివత్చ.... అకృత కతయా ఏవ ఆవేశవశాత్ సముచిత శబ్దచ్ఛందోవృత్తాది నియంత్రిత శ్లోకరూపతాం ప్రాప్తః॥.

ఒకపక్షి బాణహతమై నేలఁబడి తన్నుకొనుటను చూచుట వలన వాల్మీకి మనస్సునందు సంస్కారరూపమునసున్న వాసనలలో శోకమనుభావము ఉద్బోధితమై రెండవపక్షియొక్క విలాపమును వినుటవలన ఉద్దీప్తమై హృదయము నిండ వ్యాపించి దానిని కరఁగించినది. ఆశోకభావముయొక్క దీప్తివలననే సెగలు పొగలుగా కోపము రేఁగి, నిండినకుండ నుండి నీరు తొణఁకినట్లు, శాపరూపమైన శ్లోకముగా అప్రయత్నముగనే వెలువడినది. సాధారణముగా మనకును హర్షశోకాదిభావములు కలిగినపుడు ప్రశంసావాక్యములు గాని నిందావాక్యములు గాని అప్రయత్నముగనే వెలువడును. కాని వాల్మీకి ముఖమున శోకమువలన విలాపము కాక విలక్షణమైన శ్లోకము వెలువడినది. ఇట్లేల సంభవించినది? క్రిందఁబడిన పక్షిని చూచినప్పుడు క్రౌంచికి కలిగినదియును శోకమే. అది మమకారపూర్ణమగుటచే దుఃఖమై విలాపమున ముగిసినది. వాల్మీకియందు ఉద్బుద్ధమైన శోకము మమకారాక్రాంతము కాదు. అది కేవలము భావమే. లోకములో సకల సుఖదుఃఖములకు మూలము అహంకార మమకారములే. అహంకార మమకారములకు సంబంధము లేకుండ సుఖ దుఃఖములు పుట్టవు. మనము అమ్మినయిల్లు భగ్నమైనచో మనకేమియు దుఃఖము కలుగదు; కొన్నవారికిమాత్రము దుఃఖము తప్పదు. మనకు దానితో ఇది నాది అను సంబంధము లేకపోవుట, కొన్నవానికి ఉండుటయు కదా అందులకు హేతువు. కావుననే మనము నాటకములలో ఎంత దుఃఖోద్రేకముగల సన్నివేశములను చూచుచున్నను, మనముకూడ దుఃఖపడుచున్నట్లు కన్నీరు కార్చుచున్నను, మనము

నిజముగా దుఃఖము నొందుటలేదు. లోహితాస్యుఁడు మరణించి చంద్రమతి విలపించుచున్న దృశ్యమున మనముకూడ కన్నీరు కార్చుచున్నను మనము దుఃఖము నొందుటలేదు. ఆ లోహితాస్యుఁడు చంద్రమతి మనవారు కాకపోవుటయే యందులకు హేతువు. అప్పుడెవరైన వచ్చి యథార్థముగ మనబంధువుల కెవరికైన అపాయము సంభవించినదని చెప్పినచో వెంటనే మనము ఆ నాటకశాలను విడిచి యాబంధువు నొద్దకు పోయినపుడు మనకు నిజముగా దుఃఖము కలుగును, ఈదుఃఖమునకును నాటకశాలలో చంద్రమతీ విలాపమును వినుచున్నప్పుడు కలిగిన శోకభావమునకును సంబంధము లేదు. అది దుఃఖము కానేకాదు. అది దుఃఖమేయైనచో మనము మాటిమాటికి డబ్బు ఖర్చుపెట్టుకొనిపోయి దానిని పొందుచుండము. మనము అట్లు ఆదరముతో ఆదృశ్యమును మాటిమాటికి చూచుచున్నా మనఁగా అది మనకు ఆనందమునే కలిగించుచున్నదన్నమాట. లోకములో దుఃఖ మెంత భయంకరమగుచున్నదో కావ్యనాటకాది సన్నివేశములలో అంతగా ఆకర్షకమగుచున్నది. అందు ప్రదర్శింపబడుచున్న దుఃఖము యథార్థముగా మనకు సంబంధింపకుండుటయే అందులకు హేతువు. నాటకశాలలో ప్రవేశించుక్షణమువఱకును మనము మనదేశకాలములను భావించుచుందుము. నాటక ప్రదర్శన మారంభమైనంతనే మనము నాటకమున ప్రదర్శింపఁబడుచున్న దేశ కాలములను ఆపాత్రలయొక్క సుఖదుఃఖములను బావించుచు, మనదేశకాలములను వ్యక్తిగతవిషయములను అహంకార మమకారములను విస్మరించుచుందుము ఈ విస్మృతియే మనయానందమునకు హేతువు. ప్రదర్శింపఁబడుచున్న యాసన్నివేశములలోని భావములు మనకు ఈవిస్మృతిని ఎంతగాఢముగ కలిగించునో మనకు అంత మహితమైన యానందము కలుగును; అందువలననే కావ్య నాటకాదులందు

మనకు కలుగు సంతోషమునకు రసము అను పేరు పెట్టినారు. అది లౌకికమైన సుఖముకన్న సంతోషముకన్న భిన్నము కావున క్రౌంచికి కలిగినది. దుఃఖమేయైనను వాల్మీకికి కలిగినది మాత్రము శోక భావమే. అదియే కోపవేగమున శాపరూపమున శ్లోకముగా రూపొందినది. అభినవగుప్తుఁడు ఈ విషయముననే ఇట్లు సిద్ధాంతమొనర్చినాఁడు. "మునికి కలిగినది శోకమని తలంపరాదు. అట్లయినచో అనఁగా పక్షియొక్క దుఃఖముచేత ఆయనకూడ దుఃఖితుఁడైనచో రసము ఆత్మ అని చెప్పుటకే అవకాశముండదు. అదియును గాక దుఃఖసంతప్తుఁడైన వానియొక్క స్థితి యిట్లుండదు; ఈ విధముగా మనస్సునందు మాటిమాటికి అనుభవించుటకు యోగ్యమై శోకము అను స్థాయిభావము కరుణరసముగా మనస్సునందు నిండి పైకి తొణఁకునట్టి స్వభావమువలన, మునికి కలిగిన శోకభావమే కావ్యమునకు ఆత్మ అయ్యెను. అది రసముగా రూపొందఁగలిగిన స్వభావమువలన లోకములోని శోకము దుఃఖము మొదలగు శబ్దముల యర్థములకన్న భిన్నమై, కరుణరసము అను ప్రత్యేక శబ్దమునకు అర్థమగుచున్నది.

ధ్వన్యాలోకలోచనే అభినగుప్తపాదాః- న తు మునేః శోక ఇతి మన్తవ్యమ్। ఏవం హి సతి తద్దుఃఖేన సోఽపి దుఃఖిత ఇతి కృత్వారసస్యాత్మతా ఇతి నిరవకాశం భవేత్।న చ దుఃఖసంతప్తస్య ఏషా దశా। ఏవం చర్వణోచిత శోకస్థాయిభావాత్మక కరుణరససముచ్ఛలన స్వభావాత్ స ఏవ కావ్యస్యాత్మా రసభూత స్వభావః అపరశబ్దవైలక్షణ్యకారకః।"

మఱి కరుణారసానుభవము కలిగినప్పుడెల్ల ఎల్లవారికిని ఇట్లు పద్యము లావిర్భవించుటలేదుకదా! వాల్మీకియందు ఎట్లు సంభవించినది? ఆయన వేదాధ్యయనతత్పరుఁడు. వేదమంత్రములు

పెక్కు ఛందో బద్ధములే. కావున అట్టి ఛందస్సులను నిరంతరము వల్లించుటవలన ఆఛందో విధానములు ఆయన చిత్తమునందు సంస్కారమున నెలకొనియున్నవి. అందువలన చిత్తమునకు రస పారవశ్యము కలిగినంతనే ప్రవృత్తములైన వాక్కులు వాసనా రూపముననున్న ఛందస్సులలో నొకదాని నవలంబించి, కాలువలోనుండి ప్రవహించు జలమువలె, అనుష్టుప్ ఛందస్సులో శ్లోక రూపమున వెలువడినవి. కాని వేదములను వల్లించుచున్నవారి కందఱకును ఇట్లు శ్లోకము లావిర్భవించుట లేదుగదా! వాల్మీకి యందే అట్లేల సంభవింపవలె? అందులకు చతుర్ముఖుని యను గ్రహమే హేతువు లోకములో వందలకొలఁది పద్యములను వల్లించుచుండు సహృదయులలో పండితులలో అనేకులు పద్యములు రచింప లేకుండుటకు కొలఁదిమంది మాత్రమే రచింపఁగలుగుటకు ఇదియే హేతువు.

మొత్తముమీఁద జీవితముయొక్క క్షణభంగురత్వము దుఃఖమయత్వము లోకమున యథార్థముగ బంధుమరణాది సన్నివేశములలో అనుభవించుచున్నప్పుడు ఎంతకష్టమును కలిగించుచున్నను, అట్టి సన్నివేశములనే మహాపురుషుల చరిత్రలు నిమిత్తముగా వర్ణించుచున్నప్పుడు అవి కరుణరసాత్మకములై అత్యంతము అనందప్రదములే యగును. శృంగారాదిరసములు జన సామాన్యమునకు ఇష్టము లగుట నిజమేయైనను, సకలరసములలో కరుణము బలిష్ఠ మనుటయు నిజమే. శృంగారముచే ఆకృష్టులు గాని వారుండిన నుండవచ్చును; కాని కరుణమునకు కరఁగని మానవు లుండుట యఱుదు. మనదేశమున రామాయణ మహాభారత భాగవతాది గ్రంథములలో కరుణరసమునకుఁగల ప్రాబల్యము ఎల్లరెఱిఁగినదే. పాశ్చాత్యదేశములలో కరుణరసా

త్మక నాటకములకున్న ( Tragedies ) గౌరవము శృంగారహాస్యాది రసాత్మకములైన రచనలకు (Comedies) లేదనుటయు గమనింపఁ దగియున్నది. కావున జీవితముయొక్క నశ్వరత్వమును, దుఃఖమయత్వమును ప్రతిపాదించి మానవులను ఈశ్వరాభిముఖులను చేయుటయే కవిత్వ ప్రయోజనముగా పరమేష్ఠి కభిమత మని యీ శ్లోకమున మనము గ్రహింపవచ్చును.

## 7. ఆదికావ్యోదయఘట్టము

చతుర్ముఖునియాదేశము ననుసరించి వాల్మీకి నారదుని వలన సమగ్రముగా విన్నదానిని, ధర్మసంహితమైన దానిని, ధీమంతుఁడైన యారాముని వృత్తాంతమును భావింపఁజొచ్చెను. రాముఁడు లక్ష్మణుఁడు సీత దశరథుఁడు మొదలగు వారందఱు ఆయా సందర్భములలో నవ్వుట మాటాడుట వర్తించుట మొదలుగా సకల వృత్తాంతములను గ్రహింపఁదలంచి ఆమహర్షి ఆచమించి ప్రాచీనాగ్రములైన దర్భలయందు కూర్చుండి ధర్మవీర్యముచేత అవి ఎట్లు జరిగినవో అట్లే మనోదర్పణమున స్పష్టముగఁ జూడఁజొచ్చెను. ధర్మాత్ముఁడైన యామహర్షి జరిగినదెల్ల యోగబలమున చేతిలోనున్న యుసిరికపండునువలె చూచుచు పాత్రలయొక్క సన్నివేశములయొక్క యథార్థతత్త్వమును సమగ్రముగ గ్రహించిన తరువాత శ్రీరాముని చరిత్రమును రచించుటకు పూనుకొనెను. కామము అర్థము అను పురుషార్థములయొక్క గుణములతోఁ గూడినది, ధర్మముయొక్క తదాచరణకు ఫలమైన మోక్షముయొక్క గుణములచేత విస్తృతమైనది సముద్రమువలె గుణరత్నాఢ్యమునైన రామచరితమును, సకల జనులకు శ్రుతికి ఇంపగునట్లుగా నారదునివలన విన్నవిధముగా, అనఁగా ధర్మతత్త్వములు వ్యంగ్యము లగునట్లుగా ఆయన రచించెను.

శ్లో॥ శ్రుత్వా వస్తు సమగ్రం తత్ ధర్మాత్మా ధర్మసంహితమ్।
వ్యక్త మన్వేషతే భూయో య ద్వృత్తం తస్య ధీమతః॥ 1

శ్లో॥ ఉపస్పృశ్యోదకం సమ్యక్ మునిః స్థిత్వా కృతాంజలిః
ప్రాచీనాగ్రేషు దర్భేషు ధర్మేణాన్వేషతే గతిమ్॥ 2

గో॥ టీక. ధర్మేణ యోగజేన బ్రహ్మప్రసాదరూపేణ చ.

శ్లో॥ హసితం భాషితం చైవ గతి ర్యావ చ్చ చేష్టితమ్।
తత్సర్వం ధర్మవీర్యేణ యథావ త్సంప్రపశ్యతి॥ 4

దీనివలన పవిత్రమైన మహాకావ్యమును రచింపఁబూనిన కవి పవిత్రుఁడుగ నుండియే రచింపవలె నని వ్యక్త మగుచున్నది.

శ్లో॥ తత్సర్వం తత్త్వతో దృష్ట్వా ధర్మేణ స మహామతిః।
అభిరామస్య రామస్య చరితం కర్తు ముద్యతః॥ 7

శ్లో॥ కామార్థ గుణసంయుక్తం ధర్మార్థ గుణవిస్తరమ్।
సముద్ర మివ రత్నాఢ్యం, సర్వశ్రుతి మనోహరమ్॥ 8

గో॥ టీక. కామార్థగుణ-గుణశబ్దేన అప్రాధాన్య ముచ్యతే.... ధర్మార్థయోః ధర్మమోక్షయోః ...సర్వేషాం జనానాం శ్రుతిమనసీ శ్రోత్ర హృదయే హరతీతి సర్వశ్రుతి మనోహరమ్.

తి॥టీక. సర్వశ్రుతీనాం మనోభూతాః సారభూతాః ఉపనిషదః తాసాం హరం తదర్థప్రతిపాదకమ్ తేన మోక్షఫలకత్వమ్.

శ్లో॥ స యథా కథితం పూర్వం నారదేన మహాత్మనా।
రఘువంశస్య చరితం చకార భగవాన్ మునిః॥ 9

బాల॥ 3 సర్గ.

తి॥టీ॥ రఘువంశస్య తద్వంశావతీర్ణస్య।

గో॥టీ॥ రఘువంశస్య రఘువంశావతీర్ణస్య।

శ్రీరాముఁడు రాజ్యమును పాలించుచుండఁగా వాల్మీకి రాముని చరిత్రమును సమగ్రముగా రచించెను. పట్టాభిషేక పర్యంతమో సీతాపరిత్యాగమువఱకో మాత్రమే ఆయన గ్రంథమును రచించెననిగాని, తరువాత గ్రంథమును పూర్తిచేసె ననిగాని చెప్పుటకు వీలులేదు. ''రాముఁడు పదునొకండువేలసంవత్సరములు రాజ్యము నుపాసించి బ్రహ్మలోకమునకు పోవును" అని నారదమహర్షి సంక్షేపరామాయణమున చెప్పియున్నాఁడు. ఆయన చెప్పినట్లుగా రాముని చరిత్రమును వివరముగా రచించుచున్న వాల్మీకి శ్రీరాముని బ్రహ్మలోకగమనమువఱకు రచించియుండును. అట్లుగాక పట్టాభిషేకపర్యంతము రచించి ముగించె ననుట సమంజసము కాదు. బ్రహ్మదేవుఁడు సాక్షాత్కరించి "నారదునివలన నీవు ఎట్లు వింటివో అట్లు రచింపుము, రాముఁడు, లక్ష్మణుఁడు, రాక్షసులు, వైదేహి మొదలగువారి వృత్తాంతములలో ప్రకటితమైనది రహస్యమైనది ఇప్పటివఱకును నీకు తెలియనిది సర్వమును నీకు విదితము కాఁగలదు. ఈ కావ్యమునందు నీ వాక్కు ఎచ్చటను అనృతముకాదు.'' అనిచెప్పెను. అట్లే వాల్మీకి సమగ్రమైన రాముని వృత్తాంతమును భావించెనని మూఁడవసర్గయొక్క అరంభమున, భవిష్యద్వృత్తాంతమును ఉత్తర కావ్యమునందు రచించెనని అసర్గయొక్క ముగింపునందు మరల నాల్గవసర్గయొక్క ఆరంభమునందుకూడ అయన రాముని చరిత్రమును పూర్తిగా రచించెనని చెప్పఁబడి యున్నది.

శ్రుత్వా వస్తు సమగ్రం తద్ధర్మార్థసహితం హితమ్। 3-1
అనాగతం చ యత్కించి ద్రామస్య వసుధాతలే॥
తచ్చకా రోత్తరే కావ్యే వాల్మీకి ర్భగవా నృషిః॥ 3-39
ప్రాప్తరాజ్యస్య రామస్య వాల్మీకి ర్భగవా నృషిః।
చకార చరితం కృత్స్నం విచిత్రపద మర్థవత్॥ 4-1

ఇట్లు గ్రంథమునందు స్పష్టముగా నున్నను కొందఱు ఉత్తరకాండమును వాల్మీకి రచింపలేదని ఎవరో తరువాత రచించి రని చెప్పుచున్నారు. అందులకు వారు క్రింది హేతువు లను చూపుదురు. వీనిని క్రమముగా పరిశీలింతము.

1) నారదుఁడు రాముని చరిత్రను పట్టాభిషేకమువఱకే చెప్పెను గాని ఉత్తరకాండకథను స్పృశింపలేదు-

నారదుఁడు రామునిచరిత్రమును పట్టాభిషేకము వఱకే చెప్పె ననుట పొసఁగదు. "రాముఁడు సీతను పొంది మరల రాజ్యమును పొందెను." అని నారదుఁడు 89వ శ్లోకమున చెప్పిన తరువాత 97వ శ్లోకమున "రాముఁడు రాజ్యము నుపాసించి బ్రహ్మ లోకమునకు పోవును" అని చెప్పెను. అనఁగా 8 శ్లోకములలో ఉత్తరకాండకథను ఆయన సూచించెను. ఆ సంక్షేపమునే వాల్మీకి ఉత్తరకాండమున వివరించి వర్ణించెను.

2) "అనాగతం చ" అని మొదలగుచున్న శ్లోకమున (బాల-3-39) వాల్మీకి ఉత్తరకావ్యమును రచించినట్లు కలదు. కాని దానియందు వాల్మీకి ర్భగ వా నృషిః"అని వాల్మీకి భగ వంతుఁడుగా చెప్పఁబడియున్నాఁడు, మహర్షి తన్నుగూర్చి భగ వంతుఁ డని ఆత్మప్రశంస చేసికొని యుండుట అసంభవము. కాఁబట్టి ఈశ్లోకము ప్రక్షిప్తము, ఇది ప్రమాణముగా వాల్మీకి ఉత్తర కాండమును వ్రాసె ననుటకు వీలులేదు.—

వాల్మీకియొక్క ప్రశంస యున్నంతమాత్రమున ఈ శ్లోకము ప్రక్షిప్తమని చెప్పనక్కఱలేదు. మహర్షులు గ్రంథములను రచించు నప్పుడు తమ్ముఁగూర్చి ప్రథమపురుషలో చెప్పుకొనుట పరిపాటిగా

నున్నది. "నేను ఈగ్రంథమును రచించుచున్నాను" అని ఉత్తమ పురుషలో ఏమహర్షియు గ్రంథములలో చెప్పుకొనలేదు. వ్యాస మహర్షికూడ మహాభారతమునందు ఇట్లే రచించెను. కథ మధ్యలో వారి వృత్తాంతములు వచ్చినప్పుడు లోకులు మహర్షులనుగూర్చి ఎట్లు చెప్పుకొందురో అట్లే రచించినారు. అందువలన ఆప్రశంసా వాక్యములు లోకములో జనులు వారిని గూర్చి చెప్పుచున్న వాక్యములనుగా గ్రహింపవలయునే కాని మహర్షులు ఆత్మ ప్రశంస గావించుకొనుచున్నట్లు గ్రహింపరాదు. గ్రంథమునందు సాధారణ జనులకు గౌరవము కుతూహలము శ్రద్ధ కలుగుటకు గ్రంథకర్త యొక్క మహత్త్వమును చెప్పుట ఆవశ్యకము, కావుననే ఆంధ్ర మహాభారతమున నన్నయ భట్టారకుఁడు కూడ ఈ సంప్రదాయమునే అవలంబించి ప్రథమపురుషలో "నిత్యసత్యవచను మత్యమరాధిపాచార్యు మొదలుగా ఎన్నో విశేషములను ప్రశంసారూపముగా చెప్పినాఁడు. కావున ఈశ్లోకము మాత్రమే కాదు. వాల్మీకి రామాయణమును రచించిన వృత్తాంతమును వివరించుచున్న బాలకాండలోని మొదటి నాలుగు సర్గలను వాల్మీకియే రచించె ననుట స్పష్టము. అయన "సర్వా పూర్వ మియం యేషాం" అని అయిదవసర్గతో రామాయణము నారంభించి ముగించిన తరువాత ఉపోద్ఘాతప్రాయముగ మొదటినాలుగు సర్గలను రచించి చేర్చియుండు నని చెప్పవచ్చును. కావున 'అనాగతం చ యత్కిం చిత్' అను శ్లోకమును ప్రమాణముగా గ్రహించి వాల్మీకి ఉత్తరకాండమును రచించె ననియే గ్రహింపవలసియున్నది.

3) వంగదేశమున లభ్యములైన రామాయణ ప్రతులయందు పశ్చిమోత్తరదేశమున లభ్యములగుచున్న ప్రతులయందు ఉత్తరకాండకథ యున్నను దాక్షిణాత్యప్రతులలో లేదు-

కొన్ని ప్రతులలో లభ్యమగుచు మఱికొన్ని ప్రతులలో లభ్యము కానంతమాత్రమున, లుప్తమైనభాగము గ్రంథములోనిది కాదు అని నిశ్చయించుటకు వీలులేదు. పెద్ద గ్రంథములకు ప్రతులను తయారుచేయునప్పుడు తమ దృష్టిలో ఏది ముఖ్యమైన భాగమో అంతవఱకే ప్రతిని తయారుచేసికొని తక్కినదానిని వదలివేయుట సహజము. ప్రాచీనకాలమున ఈ గ్రంథములు చాలవరకు ముఖస్థములుగా ప్రచారమునందుండెను. కుశలవులు గాన మొనర్చిన పద్ధతి యిట్టిదే. వారు గ్రంథమును చూచుచు పఠింపలేదు. వారు ముఖస్థము కావించిన దానిని గాన మొనర్చిరి. ఇప్పటికిని వేదపండితులు ఎంత గ్రంథమునైనను కంఠస్థము చేసికొనియే పఠించుచున్నారు. వారు లిఖిత గ్రంథములను చూడరు. వేదములలో తమ శాఖకు సంబంధించిన భాగములను మాత్రమే అనేకులు అధ్యయనము చేయుదురు. అన్ని భాగములను అధ్యయనము చేయుట అందఱకును సాధ్యము కాదు. ఒక ప్రాంతమునందు వ్యాప్తిలో నున్న వేదభాగములను వినుచు ''యజుర్వేద మనఁగా ఇంతే, ఇతర ప్రాంతములలో యజుర్వేదభాగములుగా ప్రచారములోనున్నవి ప్రక్షిప్తము''లని చెప్పుట మిగుల సాహసము. అట్లే దాక్షిణాత్యప్రతులలో కొన్నింటియందు ఉత్తరకాండ లభ్యమగుట లేదన్నంత మాత్రమున అది ప్రక్షిప్తమనుట అయుక్తము.

4) భారతమున వనపర్వములోని రామోపాఖ్యానమునందు ఉత్తరకాండకథలేదు. పద్మపురాణము నందు కూడ రామకథలో ఉత్తరకాండ ప్రసక్తిలేదు, అందు షట్కాండపరిమితమైన రామాయణమే ఇరువదినాల్గువేల శ్లోకములు కలిగి బ్రహ్మహత్యాది మహాపాతకములను నశింపఁజేయుచున్నదని చెప్పఁబడియున్నది-

శ్లో॥ ఇతి షట్కాండ మాఖ్యాతం బ్రహ్మహత్యాపనోదనమ్।
సంక్షేపతో మయా తుభ్య మాఖ్యాతం మనోహరమ్॥

శ్లో॥ చతుర్వింశతి సాహస్రం షట్కాండ పరిచిహ్నితమ్।
తద్వై రామాయణం ప్రోక్తం మహాపాతకనాశనమ్॥
పద్మపురాణం పాతాళఖండ-67-205, 206

పద్మపురాణమునందు ఆదిశేషుఁడు వాత్స్యాయనునకు రామ కథను చెప్పెను. అందులో ఆదిశేషుఁడు కుశలవులు రామునియొద్ద రామాయణకావ్యమును గానమొనర్చిరని చెప్పెను. అప్పుడు వాత్స్యాయనుఁడు రామాయణమును ఎప్పుడు వాల్మీకి రచించెనో చెప్పుమని యడిగెను అప్పుడు ఆదిశేషుఁడు క్రౌంచ మిథునవృత్తాంతమును చెప్పి, బ్రహ్మదేవుఁడు ప్రత్యక్షమై రామాయణ కావ్యమును రచింపుమని యాదేశించె నని చెప్పెను. పిమ్మట వాల్మీకి ధ్యాననిష్ఠను పొందఁగా రాముఁడు ప్రత్యక్షమయ్యెను, అప్పుడు వాల్మీకికి త్రైకాలికమైన రామునిచరిత్రము గోచరించెను. అనఁగా రామునియొక్క భవిష్యద్వృత్తాంతముకూడ గోచరించెను. అప్పుడు వాల్మీకి ఆఱు కాండములలో ఇరువదినాలుగువేల శ్లోకములలో రామాయణమును రచించెను, దశరథుని పుత్రకామేష్టి నుండి చిత్రకూటమున భరతుఁడు పాదుకలు గైకొని పోవువఱకు బాలకాండముగ, హనుమంతుఁడు రామలక్ష్మణులయొద్దకు వచ్చు వఱకును గలవృత్తాంతము అరణ్యకాండముగ, ఆంజనేయుని వార్ధిలంఘనమువఱకుఁగల వృత్తాంతము కిష్కింధాకాండముగ సేతుబంధనమువఱకుఁగల వృత్తాంతము సుందరకాండముగ, రావణవధానంతరము సీత రాముని చేరుటవఱకునుగల కథ యుద్ధ కాండముగ. రామునియశ్వమేథాదికమైన వృత్తాంతము ఆఱవది యగు ఉత్తరకాండముగ వాల్మీకి రచించెను. ఈ యాఱు కాండ

ముల కథకు ఆదిశేషుఁడు పైన పేర్కొన్న ఫలశ్రుతిని చెప్పెను. ఈకాండముల విభాగమునందు ఉత్తరకాండ యున్నది. వాల్మీకి ఉత్తరకాండమును రచించె ననుట స్పష్టము. మనకు ఇప్పుడు కన్పించుచున్న అయోధ్యాకాండకథ బాలకాండములో చేర్చఁబడినది. అందువలన ఉత్తరకాండముతో ఇందు రామాయణము ఆఱుకాండములుగ విభజింపఁబడినది.

అంతేకాదు. ఈ పురాణమున పాతాళఖండమునందు ఉత్తరకాండ కథ చాలవిస్తృతముగ వర్ణింపబడియున్నది. ఇప్పటి వాల్మీకి రామాయణములోని వృత్తాంతములకు భిన్నములైనవి పెక్కువృత్తాంతములు చెప్పఁబడియున్నవి, చాకలివాఁడు సీత శీలమును శంకించి ప్రసంగించుట, కుశలవులు యజ్ఞాశ్వమును బంధించుట. రాముఁడు సీతను కుశలవులను స్వీకరించుట మొదలగు వృత్తాంతములు ఈ పురాణమునందు కలవు. ఈ పురాణములోని కథలు పద్మకల్పమునకు సంబంధించినవి. అందువలన ఈరామకథ, ఇంచలి వాల్మీకియొక్క రామాయణరచనా విధానము పద్మకల్పమునకు సంబంధించినవే. కల్పభేదము ననుసరించి కథలలో కూడ భేదము లుంకును. ఇప్పుడు ఏడు కాండములతో మనకు లభ్యమగుచున్న వాల్మీకి రామాయణము శ్వేతవరాహకల్పములోనిది. అందువలన అప్పుడు లభ్యమగుచున్న యుత్తరకాండమును వాల్మీకియే రచించె ననుట స్పష్టము.

ఇంక భారతమున వనపర్వములో ఉత్తరకాండకథ లేదన్నంతమాత్రమున వాల్మీకి ఉత్తరకాండమును రచింపలేదనుట పొసఁగదు. ధర్మరాజు అరణ్యవాసము చేయుచు "ఇట్టి కష్టములను నావలె పొందినవారు ఎవరైనా ఉన్నారా?" అని దుఃఖించుచుండఁగా మార్కండేయుఁడు, "రాముఁడుకూడ నీవలెనే ఎంతో

కష్టపడి తుదకు రాజ్యమును పొంది సుఖించినాఁడు'' అనిచెప్పుచు రాముని కథను వివరించెను. ధర్మరాజునకు దుఃఖోపశమశము చేయుటకై మార్కండేయుఁడు రాముని కథను ప్రారంభించి యుండుటచే దానిని పట్టాభిషేకముతోనే ముగించెను. ఉత్తరకాండ కథను ప్రస్తావించి సీతావియోగాది వృత్తాంతములను మార్కండేయుఁడు మొదలిడినచో ధర్మరాజునకు దుఃఖోపశమనము కలుగదు. అందువలననే మార్కండేయుఁడు ఉత్తరకథను ప్రస్తావింపలేదు. దీనినిబట్టి వాల్మీకి ఉత్తరకాండమును రచింపలేదని చెప్పుట కేవలము అసంగతము.

5) యుద్ధకాండమునందు శ్రీరామపట్టాభిషేకానంతరము విభీషణ సుగ్రీవాదులు రామునిచే సత్కరింపఁబడి వెడలిపోయినట్లు చెప్పఁబడినది.

ప్రహృష్టమనస స్సర్వే జగ్ము రేవ యథాగతమ్!

యుద్ధ-131. సర్గ. శ్లో; 82,

కాని ఉత్తరకాండమున సుగ్రీవాదులు అయోధ్యయందు సంవత్సరమున్నట్లు చెప్పఁబడినది. ఉత్తరకాండమును మహర్షియే రచించియున్నచో ఈ భేదమురాదు -

ఉత్తరకాండమునకు తక్కిన కాండములకు భేదము కలదు. పూర్వకాండములకు ''బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ సుందర, యుద్ధ'' అని పేర్లుపెట్టిన మహర్షి తుది కాండమునకు అట్టిపేరును పెట్టక "ఉత్తరకాండము'' అని పేరు పెట్టెను. మఱియును ఈ కాండమునకు ఇది పేరు అని ఎక్కడను ఆయన నిర్దేశింపలేదు. ఈ కాండమునకు మాత్రమే ఉత్తరశబ్దము ఆరంభముననే నిర్దేశింపఁబడినది. అదియును ఉత్తరకాండము అని

కాకుండ ఉత్తరకావ్యముఅని నిర్దేశింపఁబడినది. (తచ్చకారోత్తరే కావ్యే—బాల-సర్గ. 3—శ్లో 39) అనఁగా వాల్మీకి పట్టాభిషేకపర్యన్తమైన కథ పూర్వకావ్య మని తక్కిన చింతయు ఉత్తర కావ్య మని భావించె నన్నమాట. అందువలన యుద్ధకాండముతో ముగియుచున్న పూర్వ కావ్యమునకు ఒక విధమైన సమగ్రతను కలిగించుటకై, శ్రీరాముని వెంట లంక నుండి బయలుదేరి వచ్చిన విభీషణ సుగ్రీవాదులు సత్కారములను పొంది వెడలిపోవుట, రాముని రాజ్యపాలనము మొదలగువానిని సంక్షేపముగా చెప్పెను. ఈ సమగ్రత కొఱకే ఆయన ఫలశ్రుతిని కూడ చేర్చి యుండవచ్చును. ఆవిధముగా పూర్వకావ్యమును ముగించి ఆయన మరల ఉత్తరకావ్యమును ఆరంభించునప్పుడు పట్టాభిషేక సందర్భమున జరిగిన విశేషములను విస్తరముగా వర్ణించెను,

ఇట్లు చెప్పుటలో పునరుక్తిగాని పూర్వోత్తరములకు భేదముగాని సంభవించుటలేదు. "పట్టాభిషేకమును చూడవచ్చినవారు తమ స్థానములకు తిరిగిపోయిరి." అని చెప్పినప్పుడు వారువెంటనే తిరిగిపోయి రని గ్రహింపవలసిన యక్కఱ లేదు. పెండ్లికో ఉపనయనముకో వచ్చిన బంధువులు మిత్రులు అందఱును ఒక్కసారిగా తిరిగిపోరు. కొందఱు మఱునాఁడే వెడలిపోవుదురు. తీరికగలవారు కొన్ని నెల లుందురు. అందువలన వాల్మీకి మహర్షి పట్టాభిషేకమును చూచుటకై వచ్చినవారు తిరిగిపోయిరని పూర్వకావ్యమున ముగింపులో మామూలు మాటగా సంక్షిప్తముగా చెప్పి ఉత్తరకాండముయొక్క ఆరంభమున అవీడ్కోలుయొక్క విశేషములను విస్తృతముగా వర్ణించినాఁడు, ఇందులో అసమంజసమేమియును లేదు. ఇంతమాత్రమున ఆయన ఉత్తరకాండమును రచింపలే దని తలంచుట అయుక్తము.

6) పట్టాభిషేకానంతరము ఫలశ్రుతితో వాల్మీకి గ్రంథమును ముగించెను గ్రంథము పూర్తికాకున్నచో ఫలశ్రుతి యుండదు-

వాల్మీకి పూర్వరామాయణము నంతను పూర్వకావ్యముగా ఉత్తరకాండమును ఉత్తరకావ్యముగా భావించెనని పైననే గ్రహించియుంటిమి. ఆదృష్టితో ఆయన పూర్వకావ్య సమగ్రతకొఱకు అచ్చట ఫలశ్రుతిని చెప్పియుండు ననుట స్పష్టము. ఆర్షవాఙ్మయమును పరిశీలించినచో స్తోత్రములకు ఉపాఖ్యానములవంటి చిన్న సందర్భములకుకూడ ఫలశ్రుతి చెప్పఁబడియుండుట కన్పించును. నారదమహర్షి చెప్పిన సంక్షేపరామాయణమునకుకూడ ఫలశ్రుతి మున్నదికదా! అట్టియెడల పట్టాభిషేకముతో ముగియుచున్న పూర్వకావ్యమునకు మహర్షి ఫలశ్రుతిని చెప్పుటలో అసంభావ్యమే మున్నది?

ఉత్తరకాండములోనికథ సీతాప్రవాసనము, లక్ష్మణపరిత్యాగము. శ్రీరామాదులు పరలోకములకు పోవుట అనువృత్తాంతములతో ముగియున్నది. సాధారణజనులు శుభమును భావించుటకు ఇష్టపడుదురు. గాని పరిత్యాగాదులను భావించుటకు ఇష్టపడరు. అందువలన వారు పట్టాభిషేకమహోత్సవముతో ముగియుచున్న పూర్వకావ్యమునే శుభఫల ప్రాప్తికొఱకు మిగుల ఆదరముతో పఠింపఁబూనుట సహజము. పారాయణమునందు సుందరకాండమునకు ఉన్నప్రశస్తి తక్కినకాండములకు లేకుండుట ప్రసిద్ధము, సామాన్యజనుల యీ స్వభావమును గ్రహించి మహర్షి పూర్వకావ్యమునకు ముగింపునందుకూడ ఫలశ్రుతిని చెప్పి యుండును. అంతమాత్రముచేత ఆయన ఉత్తరకాండమును రచింపలేదనుట అయుక్తము.

7. అహల్యావృత్తాంతము బాలకాండలో ఒక విధముగా ఉత్తరకాండలో మఱియొకవిధముగా నున్నది. ఉత్తరకాండము వాల్మీకి రచితమైనచో ఈభేదము వచ్చియుండదు-

అహల్యావృత్తాంతమును బాలకాండమున చెప్పినవాఁడు విశ్వామిత్రుఁడు; ఉత్తరకాండములో చెప్పినవాఁడు అగస్త్యుఁడు. వీరెవరును అహల్య వృత్తాంతమును ప్రత్యక్షముగ చూడలేదు. వీరు ఆ వృత్తాంతమును ఇతరులవలన విని తెలిసికొన్నవారు, ఒకరికి తెలిసిన విశేషములు తక్కినవారికి తెలియకపోవచ్చును. అందువలన వారు మరల ఆ వృత్తాంతమును చెప్పునప్పుడు కూడ ఒకరు చెప్పినట్లుగా మఱియొకరు చెప్పియుండరు. కొందఱు కొన్ని విశేషములను ముఖ్యము లని తలంచి వివరింపఁగా ఇతరులు మరికొన్ని విశేషములను వివరింతురు. శివాజీ చరిత్ర జరిగినది యొక్కటియే. కాని దానిని పది మంది చరిత్రకారులు వ్రాయునపుడు పదివిధములుగా వ్రాయుదురు. అట్లే అహల్యా వృత్తాంతమును తనకు తెలియవచ్చిన దానిని తనకు తోఁచినవిధముగా విశ్వామిత్రుఁడు వర్ణింపఁగా, అగస్త్యుఁడు ఆవృత్తాంతమునే తనకు తెలియవచ్చిన ప్రకారమున తనకు తోఁచినపద్ధతిలో వివరించినాఁడు. ఒకవృత్తాంతమునుగూర్చి ఇద్దఱు వ్యక్తులు భిన్న సందర్భములలో భిన్నముగా ప్రసంగించుచున్నప్పుడు రచయిత ఆ ప్రసంగములను అట్లే యథాతథముగ ప్రకటింపవలయును. అంతే కాని ఒకపాత్ర యొక్క ప్రసంగమునందు పక్షపాతమును వహించి రెండవపాత్ర యొక్క ప్రసంగమును మార్చి పులిమిపుచ్చి ఇద్దఱును ఒకవిధముగనే చెప్పినట్లుచేయుట రచయితకు తగదు. వాల్మీకి మహర్షి కవితా సమాధియందున్నప్పుడు విశ్వామిత్రుఁడు ఏమిచెప్పి

నట్లుగా తోఁచెనో అది బాలకాండమున, అగస్త్యుఁడు ఏమి చెప్పి నట్లుగా తోఁచెనో అది ఉత్తరకాండమున చిత్రించెను. ఇది సత్య పరాయణులైన మహాకవులయొక్క లక్షణము. ఇట్టి భేదములను బట్టి వాల్మీకి ఉత్తరకాండమును వ్రాయలేదనుట కేవలము అసం గతము.

8) పూర్వరామాయణమున రాముఁడు విష్ణుదేవుఁడని వాచ్య ముగా లేదు. ఉత్తరకాండమున రాముఁడు విష్ణుదేవుఁడని పలు మారులు చెప్పఁబడినది. ఇది వాల్మీకిపద్ధతి కాదు-

రాముఁడు విష్ణుదేవుఁడను విషయము ఉత్తరకాండమున ఎంత స్పష్టముగ నున్నదో 'పూర్వరామాయణమున'కూడ అట్లే యున్నది. "సత్యపరాక్రముఁడు మహాత్ముఁడును అయిన రాముని నేనెఱుఁగుదును. ఈ వసిష్ఠునకు కూడ తెలియును; తపస్సులైన వీరికిని తెలియును" అని విశ్వామిత్రుఁడు దశరథునితో చెప్పి నప్పుడే రాముఁడు సామాన్య రాజపుత్రుఁడు కాఁడని దివ్యతేజో మహితుఁడని స్పష్టము కావింపఁబడినది.

శ్లో॥ అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్॥ 14
వసిష్ఠోఽపి చ మహాతేజా యే చేమే తపసి స్థితాః॥ 15
బాల-సర్గ-19,

వైష్ణవ ధనుస్సును పరశురామునివలన రాముఁడు పరిగ్ర హించినపుడు పరశురాముఁడు ఓటమిని అంగీకరించి "ఈధను వును స్వీకరింపఁ గలుగుటవలన నిన్ను దేవప్రభుఁడైన విష్ణుదేవు నిగా తెలిసికొనుచున్నాను" అని వాచ్యముగనే చెప్పెను.

శ్లో॥ అక్షయ్యం మధుహన్తారం జానామి త్వాం సురేశ్వరమ్।
ధనుషోఽస్య పరామర్శాత్ స్వస్తి తేఽస్తు పరంతప॥
బాల-సర్గ-76 శ్లో. 17.

మండోదరీ విలాపమునందు రాముఁడు విష్ణుదేవుఁడే అని పెక్కు విధముల వర్ణింపబడినది.

శ్లో॥ వ్యక్త మేష మహాయోగీ పరమాత్మా సనాతనః॥ 11

శ్లో॥ అనాదిమధ్యనిధనో మహతః పరమో మహాన్।
తమసః పరమో ధాతా శంఖచక్రగదాధరః॥ 12

శ్లో॥ శ్రీవత్సవక్షా నిత్యశ్రీ రజయ్యః శాశ్వతో ధ్రువః।
మానుషం రూప మాస్థాయ విష్ణు స్సత్యపరాక్రమః॥ 13
యుద్ధ-సర్గ-111

సీతాదేవి అగ్నిప్రవేశము చేసినపుడు ఇంద్రుఁడు ఈశ్వరుఁడు బ్రహ్మ మొదలుగా దేవత లందఱును ప్రత్యక్షమైరి. అప్పుడు బ్రహ్మదేవుఁడు "నీవు భగవంతుఁడవైన నారాయణుఁడవు" అని మొదలుపెట్టి రాముని విష్ణుదేవునిగ విశ్వరూపునిగా 15 శ్లోకములలో స్తుతించి "సీత లక్ష్మి; నీవు విష్ణుదేవుఁడవు ప్రజాపతివి" అని ముగించెను.

శ్లో॥ భవా న్నారాయణో దేవః శ్రీమాం శ్చక్రాయుధః ప్రభుః 13
సీతా లక్ష్మీ ర్భవాన్ విష్ణు ర్దేవః కృష్ణః ప్రజాపతిః 27
యుద్ధ-సర్గ-118

ఇంత స్పష్టముగా రాముఁడు విష్ణుదేవుఁ డని బ్రహ్మదేవుని యొక్క స్తుతిచేతనే వాల్మీకి నిరూపించుచుండఁగా "రాముఁడు విష్ణుదేవుఁ డని వాచ్యముగా చెప్పుట వాల్మీకి పద్ధతికాదు." అని విమర్శకులు చెప్పుట అసంగతము.

9) రచనయొక్క శైలియందుకూడ పూర్వోత్తర రామాయణ ములు భిన్నములై గోచరించుచున్నవి–

ఇదియొక అభూతకల్పన. ఇప్పటికి ఈ గ్రంథమున ఉత్తర కాండమునుండి సీతాపరిత్యాగాది ఘట్టములలో చాల శ్లోకములు ఉదాహరింపఁబడినవి. వానియందలిశైలి పూర్వ రామాయణము లోని శైలికన్న ఏవిధముననుు భిన్నముగా కన్పింపదు. ఇందులకు సహృదయులే ప్రమాణము.

10) వింటర్నిట్జ్ పండితుఁడు బాలకాండమున కొంతబాగము, ఉత్తరకాండము అంతయు ప్రక్షిప్తములని నిర్ణయించినాఁడు. ["There Can be no doubt that the whole book VII i. e. Uttara Kanda was added later to the work; but it has also long been recognised that the whole of book I ( Bala Kanda. ) can not have belonged to the original work of Valmiki"- A History of Indian Literature by M. Winternitz. Chapter on Ramayana. [ద్విపదరామాయణభారతి-పుటలు. 329-333- డా॥ జే. వి. సుబ్బారాయుడు M.A. Ph. D. Jawahar Bharati. Kavali ]

ప్రాచీనులైన భారతీయ విద్వాంసులు ముఖ్యముగా వ్యాఖ్యాతలు కొన్ని భాగములను ప్రక్షిప్తము లని గుర్తించినారు. వారు ప్రతి శ్లోకమును ప్రతిపదమును నిశితముగా పరిశీలించిరి. వారెవరును పైవిధముగా చెప్పలేదు. ఉత్తరకాండమును వారు వాల్మీకి కృతముగానే భావించి వ్యాఖ్యానించిరి. కావున వింటర్నిట్జ్ యొక్క అభిప్రాయమును ప్రామాణికముగా తలంప నక్కఱ లేదు.

ఇంతే కాదు. ఉత్తరకాండమును వాల్మీకియే రచించె నను టకు ప్రబలములైన కారణములు అనేకములు కలవు.

1) కాళిదాసు దిఙ్నాగుఁడు భవభూతి మొదలుగా ప్రాచీనులైన మహాకవు లనేకులు ఉత్తరకాండమును వాల్మీకి రచనముగానే భావించిరి. అది ప్రక్షిప్తమని ఎవ్వరును ఎప్పుడును ప్రస్తావమాత్రముగా కూడ చెప్పలేదు.

2) వాల్మీకి రామునియందు సకల కళ్యాణ గుణములను నిరూపించుటకే రామాయణమును రచించెను. బ్రహ్మదేవుడుకూడ ఆయనను అట్లే ఆదేశించెను. "రాముఁడు రాజ్యమును ఉపాసించి బ్రహ్మలోకమునకు పోవును'' అని చెప్పి నారదమహర్షి రాముని చరిత్రమును ముగించినాడు. రాజ్యమును ఉపాసించుట అను మహనీయమైన ధర్మముచేతనే రాముఁడు బ్రహ్మలోకమునకు పోఁగలడని ఆయన వ్యక్తమొనరించెను. రాజ్యమును ఉపాసించుట అనునీధర్మము ఉత్తరకాండముననే వర్ణింపఁబడినది. పూర్వ రామాయణమున రాజ్యపరిపాలన ప్రసక్తియే లేదు. అది పట్టాభిషేకముతోనే ముగియుచున్నది; ప్రజారంజనముకొఱకు భార్యను పరిత్యజింపవలసిన సంఘటనము ఉత్తరకాండమునందే వివరింపఁబడినది. ఆ మహోన్నతమైన సందర్భమును వర్ణింపకున్నచో రాముని చరిత్రము సమగ్రము కానేరదు. వాల్మీకి దానిని రచింపలేదనుట కేవలము అనాలోచితము.

3) వేదము "సత్యమును చెప్పుము"అని ముందుగా సత్యమునుగూర్చి చెప్పి తరువాత ''ధర్మమును అచరింపుము'' అని విధించుచున్నది. అనఁగా సకల ధర్మములకన్నను సత్యము శ్రేష్ఠమన్నమాట. రాముఁడు ''నాకు ఎల్లప్పుడును సత్యము ఇష్టము· లక్ష్మణునితోకూడ నిన్నైనను వదలిపెట్టుదు నేనోకాని, చేసిన ప్రతిజ్ఞను వదలిపెట్టను" అని సుతీక్ష్ణాశ్రమమునుండి బయలుదేరి పోవునప్పుడు సీతతో చెప్పెను. ఆయన అవిధముగానే సీతనే గాక

తుదకు లక్ష్మణునికూడ సత్యవచనము కొఱకు పరిత్యజించెను. ఈ సన్నివేశము ఉత్తరకాండముననే వర్ణింపబడియున్నది. ఇది ఆయనయొక్క మహెూన్నతమైన త్యాగమునకు గొప్పనిదర్శనము. రామునకు సీతకన్నను లక్ష్మణుఁడే ప్రియుఁడు. ఈ విషయమును ఆమెయే ఆంజనేయునితో చెప్పినది, లక్ష్మణ పరిత్యాగమున రాముఁడు, ఎంతగా వ్యధను పొందుచున్నను, సత్యమును ఎట్లు కాపాడుకొన్నాఁడో వాల్మీకి వర్ణింపకుండ రాముని చరిత్రమును ఎట్లు ముగించును?

4) కావ్య నిర్మాణ శిల్పమును ఎఱింగినవాఁ డెవఁడును వాల్మీకి ఉత్తరకాండమును రచింపలేదని చెప్పఁజాలఁడు. కావ్య కథయందు నాయకుని తరువాత ప్రధానముగా వర్ణింపదగినవాఁడు ప్రతినాయకుఁడు. అల్పుని జయించినచో ఎవనికిని ప్రశస్తి రాదు. ప్రతినాయకుఁకు ఎంతగా పరాక్రమశాలి ప్రసిద్ధుఁడును అగునో వానిని జయించిన నాయకునకుకూడ అంతగా కీర్తి, ప్రతిష్ఠ కలుగును. కావున నాయకుని వర్ణనము తరువాత ప్రతి నాయకుని వర్ణించుట కావ్యకథా నిర్మాణ శిల్పమున అత్యంతము ముఖ్యము. పూర్వరామాయణమున వాల్మీకి రావణుని చరిత్రమును వివరముగా వర్ణింపలేదు. రావణునిగూర్చి ప్రస్తావన వచ్చిన సందర్భములలోకూడ వాల్మీకి చాల సంక్షిప్తముగానే చెప్పెను. విశ్వామిత్రుఁడు దశరథునితో, శూర్పణఖ రామునితో ప్రసంగించునప్పుడు వాల్మీకి ఆ వృత్తాంతమును వారి ప్రసంగములలో వివరింపలేదు. యజ్ఞముయొక్క తొందఱలోనున్న విశ్వామిత్రుఁడు దానిని వివరించుటకు సిద్ధముగా లేఁడు. తనకు తెలిసిన విషయమే కావున దశరథుఁడును అడుగలేదు. కామమోహితయైయుండిన శూర్పణఖ అన్ననుగూర్చి సంగ్రహముగానే చెప్పినది.

రావణుఁడు కథలో ప్రత్యక్షముగా ప్రవేశించు సందర్భమున వాల్మీకియే స్వయముగా వాని చరిత్రను వివరించు నవకాశము కలదు. కాని ఆయన అట్లు చేయలేదు. శ్రీరామునియొక్క మహత్త్వము పాఠకులలో శ్రోతలలో అజరామరముగా ఆరాధ్యమగునట్లు తీర్చి దిద్దుట వాల్మీకి లక్ష్యము. సీత అగ్నిప్రవేశముచేసిన తరువాత బ్రహ్మాది దేవతలు వచ్చి రామునియొక్క పరమేశ్వరత్వమును స్తుతించినప్పుడు పఠితలలో శ్రోతలలో ఆయనయొక్క దివ్యమంగళ విగ్రహము, పరమధార్మికత్వము, లోకేశ్వరత్వము గాఢముగా హృదయమునకు హత్తుకొనెను, ఈలోపల రావణుని దిగ్విజయాది వృత్తాంతములను వర్ణింపఁబూనినచో శ్రోతలదృష్టి నాయకునిపై నుండి చెదరి ప్రతినాయకునిపై ప్రసరించును. అప్పుడు వారు నాయకుని మహత్త్వమును పూర్తిగా గ్రహింపఁజాలరు. అట్లే ప్రతి నాయకుని విశిష్టతనుకూడ చక్కఁగా ఆకళింపుచేసికొనఁజాలరు. అదియునుగాక నాయకుని చరిత్రలోని సంఘటనములు కడువేగముగా (With tempo) జరుగుచున్నప్పుడు, శ్రోతలు "తరువాత ఏమి జరుగునో" అని మిగుల కుతూహలముతో (Suspense) నున్నప్పుడు, ఆసంఘటనములతో సంబంధములేని ప్రతినాయకుని చరిత్రను వర్ణింపఁబూనినచో కథావేగము కుంటుపడి శ్రోతలకు విసుగు కలుగును. కావున కథానిర్మాణ శిల్పనిపుణుఁడైన మహాకవి అట్టి దోషమునకు పాల్పడఁడు. అందువలననే పట్టాభిషేకముతో రామునియొక్క చరిత్రమునందు ఒకపెద్దయధ్యాయము ముగిసి శ్రోతల కుతూహలములోనివేగము తగ్గినతరువాత వాల్మీకి ఉత్తరకావ్యము నందు రావణుని చరిత్రమును సవిస్తరముగా వర్ణించెను.

పట్టాభిషేకమైన తరువాత అందఱును తీరికగా కూర్చుండి కథలతో కాలక్షేపము చేయుచుండిరి. అప్పుడు అగస్త్యాది మహర్షులు వచ్చి, లోకభయంకరులై ఇంద్రాదులనుకూడ జయించిన రావణ మేఘనాదులను సంహరించినందులకు రామలక్ష్మణులను అభినందించిరి. అప్పుడు రాముఁడు "యుద్ధకార్యముల తొందరలో రావణాదుల పరాక్రమ విశేషములను తెలిసికొనుటకు అవకాశము కలుగలేదు. వారి చరిత్రమును వివరించి కుతూహలమును తీర్పుఁడు" అని అగస్త్యుని ప్రార్థించెను. అంతట అగస్త్యుఁడు రావణాదుల వృత్తాంతములను హనుమత్సుగ్రీవాదుల విశేషములను సమగ్రముగా వర్ణించి చెప్పెను. రావణుని వృత్తాంతము ముగిసిన తరువాత వాల్మీకి మరల సీతాపరిత్యాగము మొదలుగా శ్రీరాముని చరిత్రమునే వర్ణించి కావ్యమును ముగించెను. అనగా మరల ముగింపునందు ప్రతి నాయకుని చరిత్రముకన్న మిన్నగా నాయకుని మహోన్నతత్వమే శ్రోతల హృదయములందు అమితగాఢముగా హత్తుకొనునట్లు చేసెను. ఆ మహర్షి యొక్క ఈకథానిర్మాణశిల్పదక్షతవలననే సీతారాములు మానవలోకమున ఆరాధ్యదైవములుగా నిలిచిరి. కావున వాల్మీకి ఉత్తరకాండమును వ్రాయలేదనుట అర్థములేనిమాట.

5) రసదృష్టితోకూడ ఉత్తరకాండమును వాల్మీకి తప్ప మఱియొకఁడు ఎంతటి మహాకవియైనను వ్రాయఁజాలఁడు. రామకథపై ఆధారపడి రచింపఁబడిన పెక్కు కావ్యములు నాటకములే ఇందులకు ప్రబల నిదర్శనము, పూర్వరామాయణకథను చాలమంది మరల రచింపఁ గలిగిరి. కాని ఉత్తరకాండకథను స్పృశింపఁ గలిగినవారు చాల అఱుదు. దిఙ్నాగుఁడు భవభూతి మొదలుగా కొద్దిమంది ఉత్తరరామకథను నాటకములుగా రచించినను వాల్మీకి

చెప్పినకథను అనుసరింపలేదు. అందఱును పద్మపురాణము నను సరించి సీత లోకాంతరమునకు పోకుండ మరల రామునితో చేరి సుఖముగ నున్నట్లే రచించిరి. సీత శపథముచేసి లోకాంతరము నకు పోవుట, కేవలము సత్యవచనము కొఱకు రాముఁడు లక్ష్మ ణుని పరిత్యజించుట మొదలైన వృత్తాంతములను వర్ణించుటకు మహాకవు లెవరును సిద్ధపడలేకపోయిరి. ఎంత దుఃఖమయములై నను ధర్మవర్తన ప్రధానములైన మహాపురుషుల జీవితములలోని సన్నివేశములను జరిగినది జరిగినట్లుగా వర్ణించి చెప్పుటకు మహ ర్షులే సమర్థులు. "ఇంత భయంకర సన్నివేశములను చెప్పినచో మనకేమి అశుభము కలుగునో" అను సంకోచము వారి కుండదు. "ఈలోకము అనిత్యము అసుఖము. దీనిని పొందినవారు శాశ్వత మైన యానందముకొఱకు భగవంతునే భజింపవలె" (అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్ - భగ, అధ్యా. 9- 33) అను భావనను మానవుల మనస్సులకు హత్తుకొనునట్లు చేయుటకే మహర్షులు ప్రయత్నింతురు. అందువలన దుఃఖమయ సన్నివేశములను చిత్రించుటకు వారు ఏమాత్రము సంకోచింపరు కావుననే వ్యాసభగవానుఁడు కౌరవుల వినాశము, ధృతరాష్ట్రుని దుస్థితి, యాదవ ప్రళయము, పాండవుల మహాప్రస్థానము మొద లైన దుఃఖమయ సన్నివేశములను ఎన్నింటినో వర్ణించెను. ఇట్టి సత్యకథన పరాయణత్వము మహర్షులకు ఉన్నట్లు ఇతర కవులకు ఉండదు.

ఈ సందర్భమున మఱియొక విషయమునుగూడ గుర్తింప వలసి యున్నది. "ఇది అయుష్యమును పుష్టిని కలిగించును. ఇది సర్వశ్రుతి మనోహరము" అని మహర్షి ఈ కావ్యముయొక్క ప్రయోజనమును నిర్దేశించెను.

శ్లో॥ ఆయుష్యం పుష్టిజననం సర్వశ్రుతి మనోహరమ్॥
బాల-సర్గ-4-శ్లో 28

కావ్యములు పుష్టిని కలిగించుచు ఆయుర్దాయమును పెంచఁ గలుగునా? వృత్తులు చేసికొనుచు జీవనమును కొనసాగించు కొనుచుండు సాధారణ జనులు ప్రతిదినము శ్రమించుచు శారీరకముగా మానసికముగా బడలిక నొందుచుందురు. అట్టివారికి శారీరక విశ్రాంతియే కాక మానసికమైన యాహ్లాదముకూడ అవశ్యకమే. సామాన్యముగా సంతోషమును కలిగించు కావ్యములు అన్నియు పుష్టిని కలిగించుచు ఆయుర్దాయమును పెంచు నని చెప్పఁజాలము. అహ్లాదముతోపాటు ధర్మాభిరతిని తత్త్వజ్ఞానమును కలిగించునట్టియుదాత్త కావ్యములే మానవులకు సమగ్రమైన మనోవికాసమును కలిగించి పుష్టిని ఆయుష్యమును పెంచఁగలవు. ఈయాహ్లాదమునే సర్వశ్రుతి మనోహరమని వాల్మీకి వర్ణించెను. ఈ విశేషణము చాలగంభీరమైనది. దీనికి పెక్కు అర్థములు కలవు. ఎల్లజనులయొక్క చెవులకు ఈకావ్యము ఇంపును కలిగించును అన్నది సామాన్యమైన యర్థము. రామాయణములోనిశైలి, నన్నయభట్టారకుఁడు పేర్కొన్నట్లుగా అక్షరరమ్యత, విన్నంతనే ఎల్లవారిని ఆకర్షించుననుట సుప్రసిద్ధము. శ్రుతులనఁగా వేదములు. సకలవేదములయొక్క సారమైన ధర్మానుష్ఠానమును ప్రతిపాదించుటచేత ఈకావ్యము సర్వ శ్రుతి మనోహరమనుట రెండవయర్థము. సర్వశ్రుతులకు మనస్సుల వంటివి ఉపనిషత్తులు, ఆ ఉపనిషత్తులయొక్క సారమును చక్కఁగాఁ గొని వచ్చి అందించుచున్నది కావున ఈకావ్యము సర్వశ్రుతి మనోహరమనుట మూఁడవయర్థము. ఈ రెండు అర్థములనే ప్రాచీనమైన యీ క్రింది శ్లోకము వ్యక్తము చేయుచున్నది.

శ్లో॥ వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే।
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా॥

"వేదములచేత తెలిసికొనఁదగిన పరమపురుషుఁడు దశరథుని కుమారుఁడుగా జన్మింపఁగా వేదము ప్రాచేతసునినుండి రామాయణముగా రూపొందెను." కావున వాల్మీకి రామాయణమున సకల వేదములయొక్క సారమును మనోహరముగ నిక్షేపించి మానవలోకమునకు అందించె ననుట స్పష్టము.

కావ్యరచనమునందు మహర్షుల లక్ష్యమునకు ఇతర మహాకవుల లక్ష్యమునకు భేదము కలదు. కవులు సాధారణముగా తమ రచనము లందు రసములను పోషించి ప్రజలను మెప్పించి కీర్తి ప్రతిష్ఠలను గౌరవ సత్కారములను పొందఁగోరుచుందురు. కాళిదాసాది మహాకవులు రసపోషణముతోఁబాటు ధర్మతత్త్వముల నుపదేశించుటకు ప్రయత్నింతురు. ఆహారమున రుచితోఁబాటు పుష్టికరత్వము ఎట్లు ముఖ్యమో అట్లే సాహిత్యమునందు కూడ రసపోషణముతోఁబాటు సమాజమునకు హిత నుపదేశించుటయు ప్రధాన లక్ష్యముగా నుండవలె. మందును మ్రింగించుటకు వైద్యుఁడు తేనెను అనుపానముగా ఉపయోగించునట్లు ధర్మతత్త్వములను ప్రజల మనస్సులకు హత్తుకొనునట్లుగా చేయుట కొఱకు మహర్షులు రసపుష్టిని సాధనముగా ఉపయోగింతురు. అందువలన మహర్షుల కావ్యములకు ధర్మతత్త్వోపదేశమే ఆత్మ. ఆ కావ్య శరీరమునకు రసము ప్రాణము. అందువలన వారు రసపోషణమునందుకూడ చాల శ్రద్ధను వహింతురు. తమ కావ్యములు సరసముగా సరళముగా సామాన్య ప్రజలకు విన్నంతమాత్రముననే బోధపడి కథామూలమున ధర్మతత్త్వములు అందవలయు ననియే వారు ఆకాంక్షింతురు. కాళిదాసాదుల కావ్యములకును మహర్షుల

కావ్యములకును ఇదియే ముఖ్యమైన భేదము. రామాయణమును కుశలవులు గానము చేయుచుండఁగా ఋషులు పౌరులు జానపదులు రచ్చలలో రాజమార్గములలో గుంపులుగా చేరి వినిరి. మొదట వాల్మీకి యాశ్రమములో శత్రుఘ్నుఁడు రామాయణ గానమును విన్నప్పుడు ఆయన వెంట వచ్చిన సైనికులు కూడ విని ఆనందించిరి. కాళిదాసాదుల కావ్యములు ఇట్లు సులభముగా ప్రజలకు బోధపడవు. ఆ కావ్యములయందు శైలి, అలంకారములు రీతులు వృత్తులు మొదలగువానితో చమత్కారభరితమై, పండితులకు రంజకముగా నుండును అలంకారములు మొదలగునవి ఋషులకావ్యములలో కూడనుండును. కాని మహర్షులు శైలియందు సౌలభ్యముపై సారళ్యముపై శ్రద్ధను అధికముగా చూపుదురు. వారు అచ్చముగా ప్రజాకవులు. వారికి తాము చెప్పుచున్న విషయము సామాన్య ప్రజలకు వెంటనే అందుట పరమ ప్రధానమైన లక్ష్యము. అందువలన వారు పెద్దపెద్ద వృత్తములను దీర్ఘసమాసములను క్లిష్టములైన యలంకారములను ఉపయోగింతురు. విషయము సులభముగా అర్థమగుటకు ఆవశ్యక మనుకొన్నచో వారు వ్యర్థపదములను వాడుటకు వెనుదీయరు. వారికి శైలియొక్క సౌష్ఠవముకన్న సౌలభ్యము ముఖ్యము. హితమును ఉపదేశించునప్పుడు చెప్పినదానినే మరల పునరుక్తిగా చెప్పుటకు కూడ వారు సంకోచింపరు. మఱి కాళిదాసాది మహాకవులు ఎంత సరళముగా వ్రాయుటకు పూనుకొన్నను వ్యర్థపదములను పునరుక్తులను పరిహరించుటకే ప్రయత్నింతురు. అందువలననే వారి శైలియందు సౌష్ఠవము ఉన్నంతగా సారళ్యము ఉండదు. ఈ దృష్టితో చూచినపుడు ఉత్తరకాండము ధర్మతత్త్వోపదేశమే ఆత్మగా, కరుణరసము ప్రాణముగా అత్యంతము సులభమైన శైలిలో పూర్వరామాయణము వలెనే కొనసాగిన దనుట స్పష్టమగును. కావున పూర్వరామాయ

ణమును రచించిన వాల్మీకి మహర్షియే ఉత్తర కావ్యమును కూడ రచించె ననుట నిశ్చితము.

(i) ఇరువదినాలుగువేల శ్లోకములతో అయిదువందల సర్గలతో ఏడుకాండములుగా మహర్షి రామాయణము రచించె నని చెప్పఁబడి యున్నది.

శ్లో॥ చతుర్వింశ త్సహస్రాణి శ్లోకానా ముక్తవా నృషిః।
తథా సర్గశతాన్ పంచ షట్కాండాని తథోత్తరమ్॥

బాల-సర్గ, 4-శ్లో 2,

ఇరువదినాలుగువేలు అను శ్లోకసంఖ్యను అందఱును అంగీకరించుచున్నారు. ప్రముఖ వ్యాఖ్యాతయైన శ్రీ గోవిందరాజస్వామి శ్లోకముల సంఖ్యను ఇట్లొసంగినాడు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | బాలకాండ | 77 | సర్గలు | 2556 | శ్లోకములు |
| 2. | అయోధ్యాకాండ | 119 | ,, | 4415 | ,, |
| 3. | అరణ్యకాండ | 75 | ,, | 2732 | ,, |
| 4. | కిష్కింధాకాండ | 67 | ,, | 2620 | ,, |
| 5. | సుందరకాండ | 68 | ,, | 3006 | ,, |
| 6. | యుద్ధకాండ | 131 | ,, | 5990 | ,, |
| 7. | ఉత్తరకాండ | 110 | ,, | 3234 | ,, |
| | మొత్తము .... | 647 | ,, .... | 24553 | ,, |

ఉత్తరకాండమును వాల్మీకి వ్రాయలే దన్నచో ఆఱుకాండములయొక్క శ్లోక సంఖ్య 21319 మాత్రమే అగును. 24 వేల శ్లోక సంఖ్య పూర్తికాదు. కావున శ్లోక సంఖ్యను అనుసరించి

కూడ వాల్మీకి మహర్షియే ఉత్తరకాండమును రచించెనని నిశ్చయింప వలసియున్నది.

పైలెక్క ననుసరించి ప్రస్తుతము 647 సర్గలు 24553 శ్లోకములును కన్పించుచున్నవి. ఈ భేదమునకు గోవిందరాజస్వామి ఇట్లు సమాధానము చెప్పినాఁడు. బహుచతుర్యుగములు గడచియుండుటచే శ్లోకములో చెప్పఁబడినదానికి భిన్నముగా ఈ విప్లవము గ్రంథమునందు సంభవించియుండుట సహజము. లేదా పై శ్లోకములో వాల్మీకియొక్క సంకల్పము మాత్రమే చెప్పఁబడినదన్నచో, గ్రంథసమాప్తి దశయందు సర్గలలో, శ్లోకసంఖ్యయందును పెంపుకలిగియుండుటయు సంభవమే. లేదా, గ్రంథము అయిదు వందల సర్గలకు, ఇరువది నాల్గువేల శ్లోకములకు తగ్గనిది అన్ను నభిప్రాయములోనైన పై శ్లోకము రచింపఁబడియుండవచ్చును. లేదా గణితమునందు పూర్ణ సంఖ్యలను గణించునప్పుడు 10. 34 అన్నప్పుడు పదియని, 10.56 అన్నప్పుడు పదునొకండు అని గ్రహించుచున్నట్లే అధిక శ్లోకముల నుపేక్షించి వేలలో 24 వేలని, చెప్పినట్లుగా గ్రహింపవచ్చును.

కాని సర్గల విషయమున ఈ ఉపపత్తి కుదరదు. ఈ పక్షమున ఆఱువందలని చెప్పవలె కాని అయిదువందలనుట సరికాదు. ప్రస్తుతము పెక్కుసర్గలలో తుదియందు రెండు మూఁడు సర్గ సంగ్రహ శ్లోకములు కన్పించుచున్నవి. ఈ సంగ్రహ శ్లోకములను వాల్మీకి రచించియుండునని తోచదు. ఆయన రచించియున్నచో ప్రతిసర్గకు రచించియుండునుగాని కొన్ని సర్గలకుమాత్రమే రచించియుండఁడు. అసలు ఏ కావ్య కర్తయు ఇట్లు చిన్న చిన్న సర్గలకు సంగ్రహ శ్లోకములను రచింపఁడు. మొత్తము గ్రంథమునకు బాలరామాయణమువలె సంగ్రహములను రచించుట కలదు గాని,

సర్గలకు అధ్యాయములకు ఇట్లు రచించుట తరువాత వెలసిన మహాభారత భాగవతాదులయందుకూడ కన్పించుటలేదు. కావున కావ్య నిర్మాణ నిపుణులలో అగ్రగణ్యుఁడైన వాల్మీకి మహాకవి పునరుక్తిదోషభాజనములైన యీ సంగ్రహ శ్లోకములను కావ్య సౌందర్యభంజకముగా రచించియుండు ననుట సంభావ్యముకాదు. దీర్ఘకాలవశమున శ్లోకసంఖ్య తక్కువపడఁగా, ఎవరో మహాకవి కాళిదాసంతవాఁడు ఈ సంగ్రహ శ్లోకములను రచించి సంఖ్యను పూరించియుండును. ఇవి కాక "కచ్చిత్సర్గ" వంటి ప్రక్షిప్తము లును కొన్ని కలవు. అందులో సుమారు 50 శ్లోకములు మహా భారతములోని నారదధర్మజ సంవాదములోనివి యిందులో చేరి నవి. ఇట్టి ప్రక్షిప్తములను తొలఁగించినచో ఇప్పటి మూలము 24 వేలకు కూడ కొంచెము తగ్గవచ్చును. సర్గల విషయన కూడ, వాల్మీకి కావ్యమునంతను 500 సర్గలుగనే విభజించియుండును. అపక్షమున ఒక్కొక్క సర్గలో 40 నుండి 50 వఱకు శ్లోక సంఖ్య యుండియుండవచ్చును. వాచోవిధేయముగా గ్రంథము దీర్ఘకాలము ప్రచారములో నుండుటవలన ఒకసర్గలోని శ్లోకములు పూర్వ సర్గములోనికో పరసర్గములోనికి సంక్రమించుట సంభవించి కొన్ని సర్గలు చిన్నవిగా, మఱికొన్ని పెద్దవిగా ఏర్పడియుండవచ్చును. గ్రంథమును జాగరూకతతో పరిశీలించినచో 500 సర్గలను ఏర్పఱ చుట కష్టము కాదనుకొందును.

## 8. కావ్యగానము

ఇట్లు వాల్మీకి మహర్షి కావ్యమును సభవిష్యముగా సహెూ త్తరముగ రచించిన తరువాత దీనిని ఎవఁడు లోకమున ప్రకటింప గలఁడు! అని యాలోచింపఁజొచ్చెను, అట్లు ఆయన చింతించు చుండగా, మునివేషములలోనున్న కుశలవులు వచ్చి పాదాభివంద

నము( గావించిరి. రాజపుత్రులు, స్వరసంపన్నులు. ఆశ్రమ వాసులునైన వారిని చూడ(గానే వారికా కావ్యము నేర్పవలయు నని ఆయన నిశ్చయించెను. మేధావులైన కుశలవులు అప్పటికే వేదములందు పరినిష్ఠితులై యుండిరి. కావున వారీ కావ్యమును సులభముగనే వాచోవిధేయముగ గ్రహింప( గలిగియుండిరి. కావ్యమును వారికి నేర్పునప్పుడు ఆయన సమస్త రామాయణకావ్యము మహనీయమైన సీతా చరితము. దీనిని పౌలస్త్యవధ మనియు వాల్మీకి పేర్కొనెను.'' అని గ్రంథమునకు నామనిర్దేశము గావించెను. ఆయన మూ(డు పేర్లను నిర్దేశించినను, నాయకుని ప్రసిది వలన రామాయణ మనుపేరే అధికప్రచారము నొందెను.

ఇది గాన మొనర్ప(బడినప్పుడేకాక సాధారణముగా పఠింప(బడినప్పుడుకూడ మధురముగనే యుండెను. అట్లుగాక గాన మొనర్చినప్పుడు మాత్రమే ఇంపుగా నుండి సాధారణముగా పఠించినప్పుడు రమణీయముగా నుండకపోయినచో ఆ మాధుర్యము గానమునకు సంబంధించినదే కాని కావ్యమునకు సంబంధించినది కాదన్నమాట. కావుననే ఆయన గాన మొనర్చినప్పుడే కాక సాధారణముగా పఠించునప్పుడుకూడ ఈ కావ్యము మధురముగనే యుండు నని నిర్దేశించెను. పాఠ్యముగనే మధురముగా నున్నను కావ్యమునకు సంగీతమును సమకూర్చి మధురతరముగా నొనర్చుటయు సమంజసమే. దృశ్యకావ్యమైన నాటకమునకు రంగస్థల ప్రదర్శనమువలె, శ్రవ్య కావ్యమునకు సంగీతము రసోల్బణత్వమును సమకూర్చును.

శ్లో॥ కృత్వా తు తన్మహాప్రాజ్ఞః సభవిష్యం సహోత్తరమ్,
చింతయామాస కోన్వేతత్ ప్రయుంజీయా దితి ప్రభుః॥ 4-3

సభవిష్యం సహెూత్తరం—సీతాశపథము భవిష్యము;
లక్ష్మణత్యాగ రామప్రస్థానాదికము ఉత్తరము.

శ్లో॥ తస్య చింతయమానస్య మహర్షే ర్భావితాత్మనః।
అగృహీతాం తతః పాదౌ మునివేషౌ కుశీలవౌ॥ 4-4

కుశీలవౌ-"ఈకార శ్ఛాందసః॥- గో.టీక.
కుశశబ్దస్య కుశీభావః పృషోదరాదిత్వాత్ — తి. టీక,

శ్లో॥ కుశీలవౌ తు ధర్మజ్ఞౌ రాజపుత్రౌ యశస్వినౌ।
భ్రాతరౌ సర్వసంపన్నౌ దద ర్శాశ్రమవాసినౌ॥ 4—5

శ్లో॥ స తు మేధావినౌ దృష్ట్వా వేదేషు పరినిష్ఠితౌ।
వేదోపబృంహణార్థయ తా వగ్రాహయత ప్రభుః॥ 4-6

శ్లో॥ కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్।
పౌలస్త్యవధ మిత్యేవం చకార చరితవ్రతః॥ 4-7

శ్లో॥ పాఠ్యే గేయే చ మధురం, ప్రమాణై స్త్రిభి రన్వితమ్।
జాతిభి స్సప్తభి ర్యుక్తం తంత్రీలయసమన్వితమ్॥ 4-8

శృంగారాది రసములలో గూడియున్న యీ కావ్యమును గంధర్వులవలె మనోహరులు, సంగీతశాస్త్రకోవిదులు, మధురస్వర సంపన్నులునైన యీకుశలవులు తంత్రీలయ సమన్వితముగా గానము చేయఁజొచ్చిరి. రాముని దేహము నుండి వెలువడిన ప్రతి బింబములవలె ప్రకాశించుచున్న యీ సోదరులు ఆ కావ్యము నంతను వాచోవిధేయముగా గ్రహించి. ద్విజులు సాధువులు మహర్షులు మొదలగువారి సమావేశములందు చక్కఁగా గానము చేయఁ జొచ్చిరి.

శ్లో॥ రూపలక్షణ సంపన్నౌ మధురస్వరభాషిణౌ।
బింబాదివోత్థితౌ బింబౌ రామదేహా త్తథాపరౌ॥

బాల–సర్గ. 4-శ్లో. 11

గో. టీక॥ పంచమసర్గారంభశ్లోకస్య సర్వాపూర్వేత్యాది శ్లోక వ్యాఖ్యాయామ్-నను ఏతస్య సర్గత్రయస్య (2–3–5 సర్గాః) రామాయణాదిత్వే కుశలవాభ్యా మేతద్గానే ప్రథమం క్రియామాణే తౌ రామేణ అదా వేవ స్వపుత్రౌ ఇతి పరిజ్ఞాతౌ స్యాతాం తథా చ తదైవ సీతానయనాపత్తిః "బింబాదివోత్థితౌ బింబౌ రామదేహా త్తథాపరౌ తౌ రాజపుత్రౌ" ఇత్యాదినా హి రామపుత్రత్వ మనయోః సూచ్యతే తస్మా దిదం అసంగత మితిచేత్ న। సీతా పుత్రత్వాదే రకథనాత్ రామ సాదృశ్యమాత్రస్య రాజపుత్రాం తరే ష్వపి సంభవాత్.

మొదటనే బాలకాండలోని 2, 3, 4 సర్గలను కుశలవులు గాన మొనర్చుచుండినచో ఈ శ్లోకమువలన వారు సీతా పుత్రులని రాముఁడు గ్రహింపకుండునా? అట్లు గ్రహించినచో అప్పుడే సీతను ఆయన పిలిపింపవలసివచ్చునుకదా! ఈ సందేహమునకు గోవింద రాజస్వామి ఇట్లు సమాధానము చెప్పెను. ఈ శ్లోకములో వారు సీతా పుత్రు లని స్పష్టముగా చెప్పఁబడలేదు. వారికి రామునితోఁ గల పోలికయే చెప్పఁబడినది. ఇతరులయందుకూడ అట్టి పోలిక లుండవచ్చును. అంతమాత్రమున వీరు సీతారాముల పుత్రులు అను నిశ్చయ మేర్పడదు.

లవణాసురసంహారమైన వెనుక శత్రుఘ్నుఁడు పదునొకం డేండ్లునిండి పండ్రెవసంవత్సరము వచ్చినంతనే శ్రీరాముని చూచు టకై కొద్ది పరివారముతో అయోధ్యకు బయలుదేరెను. ఏడెనిమిది రోజులు ప్రయాణ మొనర్చి శత్రుఘ్నుఁడు వాల్మీకి యాశ్రమము

వకు చేరెను. అయనకు పాదాభివందనము గావించి అతిథ్యమును స్వీకరించి శత్రుఘ్నుఁడు అయనవలన ఎన్నోకథలను వినెను. వాల్మీకి లవణాసురసంహారమును తాను ఇంద్రుని సభలో కూర్చుండి చూచితి నని, శత్రుఘ్నుని పరాక్రమము మహనీయ మని ప్రశంసించి, ప్రేమకు పరమ ప్రయోజనముగా అతని మూర్ధము నాఘ్రాణించెను. పిమ్మట వాల్మీకి శత్రుఘ్నునకు అతని పరివారమునకు యథోచితముగా భోజనములనేర్పాటు గావించెను. ఆరాత్రి భోజనానంతరము శత్రుఘ్నుఁడు తంత్రీ లయాన్వితమైన రామచరిత్ర గీతమును వినెను. పూర్వము రాముని వృత్తాంతము ఎట్లు జరిగెనో అట్లే ప్రత్యక్షమగునట్లు ప్రత్యక్షరము రచింపఁ బడిన యాకావ్యమును విని అతఁడు బాష్పలోచనుఁడై ముహూర్త మాత్రము నిశ్చేష్టుఁడయ్యెను. పిదప దానిని వినుచు భావించుచు మాటిమాటికి నిట్టూర్పుఁజొచ్చెను.

అతని సైనికులును ఆగానమును విని తలలు వ్రాల్చి దీనులై ఆశ్చర్య మని యొకరితో నొకరు చెప్పుకొనఁజొచ్చిరి. "ఇది యేమి? మనము ఎక్కడనున్నాము ? కలఁగనుచున్నామా యేమి- ఇదివఱకు మనము అయోధ్యలో చూచిన సందర్భము లన్నియు ఇక్కడ ఆశ్రమములో స్వప్నమునందువలె వినుచున్నామే" అని వారు దీనినిఁ గూర్చి వాల్మీకిని ప్రశ్నింపుమని శత్రుఘ్నుని కోరిరి. శత్రుఘ్నుఁడు వారి కుతూహలమును గమనించి, "మున్యాశ్రమములో ఆశ్చర్యవిశేషము లనేకము లుండును. మనము అయనను కుతూహలముతో ఇట్టివానిని గూర్చి ప్రశ్నించుట తగదు." అని సమాధానము చెప్పి తన కొసంగిన పర్ణశాల లోనికిపోయి పరుండెను. అతఁడు పరుండియును ఆ రామకథా గీతమునే అనేకార్థ యుక్తమైన దానిని గూర్చియే చింతించుచు రాత్రిని గడిపెను. ఉద

యమునవే మహర్షియొద్ద సెలవుఁగైకొని అయోధ్యకు బయలు దేరెను. వాల్మీకి ఆతనిని కౌఁగిలించుకొని సాగనంపెను.

శ్లో॥ తచ్చ యుద్ధం మయా దృష్టం యథావత్ పురుషర్షభ।
సభాయాం వాసవస్యాథ ఉపవిష్టేన రాఘవ॥ 11

శ్లో॥ మమాపి పరమా ప్రీతిః హృది శత్రుఘ్న వర్తతే।
ఉపాఘ్రాస్యామి తే మూర్ధ్ని స్నేహస్యైషా పరా గతిః॥ 12

శ్లో॥ స భుక్తవాన్ నరశ్రేష్ఠో గీతమాధుర్య ముత్తమమ్।
శుశ్రావ రామచరితం తస్మిన్ కాలే పురా కృతమ్॥ 14

శ్లో॥ శుశ్రావ రామచరితం తస్మిన్ కాలే యథాకృతమ్।
తాన్యక్షరాణి సత్యాని యథావృత్తాని పూర్వశః॥ 16

శ్లో॥ శ్రుత్వా పురుషశార్దూలో విసంజ్ఞో బాష్పలోచనః।
స ముహూర్త మివాసంజ్ఞో వినిశ్శ్వస్య ముహు ర్ముహుః॥ 17

శ్లో॥ తస్మిన్ గీతే యథావృత్తం వర్తమాన మివాశృణోత్।
పదానుగా శ్చ యే రాజ్ఞః తాం శ్రుత్వా గీతిసంపదమ్॥ 18

శ్లో॥ అవాఙ్ముఖా శ్చ దీనా శ్చ హ్యాశ్చర్య మితి చాబ్రువన్।
పరస్పరం చ యే తత్ర సైనికాః సంబభాషిరే॥ 19

శ్లో॥ కి మిదం క్వచ వర్తామః కి మేతత్ స్వప్న దర్శనమ్।
అర్థో యో నః పురా దృష్ట స్త మాశ్రమపదే పునః 20

శ్లోః శ్రుణుమః కి మిదం స్వప్నే గీతబంధ మనుత్తమమ్।
విస్మయం తే పరం గత్వా శత్రుఘ్న మిద మబ్రువన్ 21

శ్లో॥ సాధు పృచ్ఛ నరశ్రేష్ఠ వాల్మీకిం మునిపుంగవమ్।
శత్రుఘ్న స్త్వబ్రవీ త్సర్వాన్ కౌతూహలసమన్వితాన్॥ 22

శ్లో॥ సైనికా నక్షమోఽ స్మాకం పరిప్రష్టు మిహేదృశః
అశ్చర్యాణి బహూ నీహ భవన్త్యస్యాశ్రమే మునేః॥ 23

శ్లో॥ న తు కౌతూహలా ద్యుక్త మన్వేష్టుం తంమహామునిమ్॥24
ఉత్తరకాండ-సర్గ-71

పిమ్మట శత్రుఘ్నుఁడు అయోధ్యకుచేరి రామునకు పాదాభివందన మొనర్చి లవణాసురసంహారము, మధుపుర నిర్మాణము, ప్రజా నివేశనాది వృత్తాంతమును నివేదించి, "నే నిక్కడనుండి వెళ్ళి పంౘ్రెండేండ్లగుచున్నవి; ఇంకను నిన్ను వదలి, తల్లికి దూరమైనవత్సమువలె, చిరకాల ముండఁజాలను" అని పలికెను. రాముఁ డాతనిని కౌఁగిలించుకొని "విషాదము నొందకుము; ఇట్లనుట క్షత్రియోచితము కాదు; వియోగమువలన రాజులు కృశింపరు. క్షత్రధర్మముతో ప్రజలు పరిపాలింపఁ దగినవారు కదా! అప్పుడప్పుడు నీవు మమ్ము చూచుటకు అయోధ్యకు వచ్చుచుండుము; నీవు నాకు ప్రాణములకన్నను ప్రియతముఁడవు; కాని రాజ్యపాలనము అవశ్యకరణీయము; కావున నీవు నాదగ్గర ఏడురాత్రులుండి తరువాత సపరివారముగా మధురకు పొమ్ము" అని పలికెను. ధర్మయుక్తములైన రాముని మాటలను విని శత్రుఘ్నుఁడు దీనుఁడై 'సరే' అనెను. అట్లే ఏడు రాత్రులు గడచిన తరువాత అతఁడు మధురానగరమునకు వెళ్లెను.

శ్లో॥ ద్వాదశై తాని వర్షాణి త్వాం వినా రఘునందన।
నోత్సహేయ మహం వస్తుం త్వయా విరహితో నృప॥ 11

శ్లో॥ సమే ప్రసాదం కాకుత్స్థ కురు ష్వామితవిక్రమ।
మాతృహీనో యథా వత్సో న చిరం ప్రవసా మ్యహమ్॥ 12

శ్లో॥ ఏవం బ్రువాణం కాకుత్థ్సః పరిష్వ జ్యేద మబ్రవీత్।
మా విషాదం కృథాః శూర నైతత్ క్షత్రియచేష్టితమ్॥ 13

శ్లో॥ నావసీదన్తి రాజానో విప్రవాసేషు రాఘవ।
ప్రజా హి పరిపాల్యా హి క్షత్రధర్మేణ రాఘవ॥ 14

శ్లో॥ కాలే కాలే తు మాం వీర అయోధ్యా మవలోకితుమ్।
అగచ్ఛ త్వం నరశ్రేష్ఠ గన్తాసి చ పురం తవ॥ 15

శ్లో॥ మమాపి త్వం సుదయితః ప్రాణై రపి న సంశయః।
అవశ్యం కరణీయం చ రాజ్యస్య పరిపాలనమ్॥ 16

శ్లో॥ తస్మా త్త్వం వస కాకుత్థ్స సప్తరాత్రం మయా సహ।
ఊర్ధ్వం గంతాసి మధురాం సభృత్యబలవాహనః॥ 17

ఉత్తరకాండ-సర్గ. 72

పై సందర్భమునుబట్టి శత్రుఘ్నుఁడు వాల్మీకియాశ్రమమున రామాయణగానము వినునప్పటికి కుశలవులకు పదునొకండు సంవత్సరములు నిండి ఆ శ్రావణమాసమున పండ్రెండవయేఁడు అరంభమైనది. 11 సంవత్సరములు నిండునప్పటికే వారు వేదములయందు పరినిష్ఠితులై రామాయణమునుకూడ అభ్యసించిరి. ఆ సంఘటనములను ఇట్లు గ్రహింపవచ్చును. (చూడు పుట. 85)

| | సం-నెల |
|---|---|
| ఉపనయనము జరిగిన జ్యేష్ఠ మాసమునకు వారి వయస్సు | 9—10 |
| వేదాధ్యయనము | 1-00 |
| | 10-10 |
| రామాయణమును వల్లించుట | 00-02 |
| మొత్తము | 11—00 |

కుశలవులకు ఉపనయనము జరిగిన వెంటనే నారదాగమనము, క్రౌంచ మిథున వృత్తాంతము, రామాయణ కావ్యారంభము జరిగియుండునని వెనుకనే అనుకొనియుంటిమి. జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమకు ముందో వెనుకనో వాల్మీకి రామాయణ రచనము నారంభించియున్నచో ఒక సంవత్సరమునకు, అనఁగా మరల జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమకు. అది పూర్తియై యుండును. ఆ సంవత్సరముననే ఉపనీతులైన కుశలవులకు వాల్మీకి శిష్యులు భరద్వాజుఁడు మొదలగువారు వేదాధ్యయనము చేయించియుందురు. ఒక్క సంవత్సరమునకే వారు వేదమును పూర్తిగా అధ్యయనము చేయఁగలిగియుందురా, అని సంశయింప నక్కఱలేదు. వారు మేధావులు. అందువలన వారు ఏక సంథాగ్రహణమున అట్లు గ్రహింపఁగలిగియుందురు. ఈ కాలముననే అష్టావధానము శతావధానము చేయఁగలిగినవారు ఎందఱో యుండఁగా ఆకాలమున శ్రీరాముని పుత్రులకు అట్టి ప్రజ్ఞ యుండుట ఆశ్చర్యము కాదు. వేదాధ్యయనము పూర్తియైనంతనే వాల్మీకి వారికి రామాయణమును జ్యేష్ఠపూర్ణిమకు కొంచెము ముందుగానో వెనుకనో నేర్పుట ఆరంభించియుండును, దినమునకు పదిసర్గల చొప్పున వారు గ్రహించియున్నచో ఏఁబది దినములలో 5000 సర్గలు పూర్తియై యుండును. జ్యేష్ఠమాసమున పదునైదు దినములు; ఆషాఢమున ముప్పది దినములు, శ్రావణమున అయిదాఱు దినములు జరుగునప్పటికి వారు రామాయణమును పూర్తిగా అభ్యసించి యుందురు. శత్రుఘ్నుఁడు శ్రావణారంభమున మధుపురమునుండి బయలుదేరి వారము రోజులకు వాల్మీకి యాశ్రమమునకు వచ్చెను. అప్పటికి కుశలవులు రామాయణమును రాత్రిపూట ఆశ్రమవాసులను ఒకచోట చేర్చి వినిపించుచుందురు. అగానమును శత్రుఘ్నుఁడు సైనికులును వినిరి

## 9. తపోలక్షణము

శత్రుఘ్నుఁడు తిరిగివెళ్ళినతరువాత కొన్ని దినములకు ఒకజానపదుఁడైన వృద్ధ బ్రాహ్మణుఁడు కుమారుని శవమును గైకొని రాజద్వారము నొద్దకు వచ్చి, యౌవనమైన రాకముందే అయిదువేలసంవత్సరముల వయస్సునకే బాల్యమునందే నాకుమారుఁడు చనిపోయినాఁడు; ఇట్లు పెద్ద లుండఁగా చిన్నవారు చనిపోవుట ఇంతవఱకు జరుగలేదు; ఇందులకు కారణమేమి? నేనేమియు పాపము చేయలేదు! కావున పరిపాలకుఁడైన రాముని యందే ఏదో దుష్కృత ముండి తీరవలె; లేకున్నచో ఇట్టి వైపరీత్య మేల సంభవించును?'' అని విలపింపఁజొచ్చెను. అది విచారించుటకు రాముఁడు రాఁగా అయనను జూచి అవృద్ధుఁ డిట్లు పలవింపఁజొచ్చెను. ''ఇతరదేశములలో బాలురకు మృత్యుభయము కన్పించుటలేదు; నీవుపాలించుచున్న యీదేశమునందే ఇది సంభవించినది; కావున నాకుమారుని బ్రతికింపుము; లేకున్నచో భార్యతో కూడ నేను రాజద్వారమునందు మరణింతును; బ్రహ్మహత్యా పాతకముతో నీవు నీసోదరులు సుఖముగా నుండుఁడు ; ఇంక నీపరిపాలనలో మాకు సుఖ మెక్కడిది? రాజదోషముచేత ప్రజలు విపత్తి నొందుదురు; రాజు అసద్వర్తనుఁడైనచో జనులకాలమరణమునకు పాలగుదురు; నగరములందు పల్లెలందు జనులు పరిపాలనము చక్కఁగా లేకున్నచో అకృత్యము లొనరింతురు; అప్పుడు అకాలమృత్యుభయము ప్రజలయందు సంభవించును; కావున రాజదోషమేదియో యుండి యుండవలె, లేకున్నచో బాలమరణ మేల సంభవించెను?

శ్లో॥ కిం ను మే దుష్కృతం కర్మ పురా దేహాంతరే కృతమ్।
యదహం పుత్ర మేకం తు పశ్యామి నిధనం గతమ్॥ 4

శ్లో॥ అప్రాప్తయౌవనం బాలం పంచవర్షసహస్రకమ్।
అకాలే కాల మాపన్నం మమ దుఃఖాయ పుత్రక॥ 5

శ్లో॥ రామస్య దుష్కృతం కించి న్మహ దస్తి న సంశయః।
యథా హి విషయస్థానాం బాలానాం మృత్యు రాగతః॥ 10

శ్లో॥ న హ్యన్యవిషయస్థానాం బాలానాం మృత్యుతో భయమ్।
స రాజన్ జీవయ స్వేనం బాలం మృత్యువశం గతమ్॥ 11

శ్లో॥ రాజద్వారి మరిష్యామి పత్న్యా సార్ధ మనాథవత్।
బ్రహ్మహత్యాం తతో రామ సముపేత్య సుఖీ భవ॥ 12

శ్లో॥ భ్రాతృభి స్సహితో రాజన్ దీర్ఘ మాయు రవాప్స్యసి। 14
........................................................॥

శ్లో॥ రాజదోషై ర్విపద్యన్తే ప్రజా హ్యవిధిపాలితాః।
అసద్వృత్తే హి నృపతౌ అకాలే మ్రియతే జనః॥ 16

ఉత్తర-సర్గ. 73

రాముఁ డావిలాపమును విని శోకసంతప్తుఁడై వసిష్ఠాది మంత్రి పురోహితాదుల నందఱను పిలిపించి దీనుఁడై జరిగిన వృత్తాంతమును చెప్పెను. అప్పు డచ్చటికి వచ్చియున్న నారదుఁడు రామున కిట్లు చెప్పెను. పూర్వము కృతయుగమున బ్రాహ్మణులే తపస్వులుగా నుండిరి. బ్రాహ్మణేతరుఁ డెవ్వఁడును తపస్విగా నుండలేదు (తక్కినవారు నిత్యనైమిత్తికకర్మమాత్రపరులై యుండిరన్నమాట.) బ్రాహ్మణవర్ణ ప్రధానమైన యీ యుగమునందు అజ్ఞానకారణము లేకుండుటచే ఎల్లరును అమృత్యువులై (మరణహేతుకమైన యధర్మముయొక్క లేశముకూడ లేకుండుట వలన మరణరహితులై) దీర్ఘ దర్శనులై (అతీత అనాగతాది సకల

జ్ఞానవంతులై) యుండిరి. పిమ్మట త్రేతాయుగమునందు మాన వులు దేహాత్మ బుద్ధిగలవారైరి. వారిలో క్షత్రియులు తపస్వులైరి. ఈయుగమున తపస్వులైన బ్రాహ్మణ క్షత్రియులకన్న కృతయుగ ములో తపస్యులైనవారే అధికులు. త్రేతాయుగమున బ్రాహ్మ ణులు క్షత్రియులు తపోవీర్యమున సమానులైరి. అప్పుడు ధర్మాధి కారులైన మనువు మొదలగువారు బ్రాహ్మణులకు క్షత్రియులకు భేదము కన్పింపకుండుటచే అనాదివేదసిద్ధమైన చాతుర్వర్ణ్య వ్యవ స్థను ఆచార భేదరూపమున స్థాపించిరి. ( కృతయుగమునందు ఇట్టి యనుశాసనము లేకయే సర్వవర్ణములవారు తమ తమ ధర్మ ములను అనుష్ఠించుచుండిరి. ఇట్లు వర్ణాశ్రమప్రయుక్తములైన యుగాది ధర్మానుష్ఠానములచేత త్రేతాయుగారంభమున ధర్మము ప్రజ్వలించుచుండగా, అధర్మము ఒకపాదమును ప్రవేశపెట్టెను. అధర్మమువలన జనులకు తేజము మందగించెను. ఈ కారణమున కృతయుగమునందు మలమువలె నింద్యమైన కృష్యాదికమైన జీవనోపాయము త్రేతాయుగమున జనులకు అవలంబనీయ మయ్యెను. ఈకృష్యాది జీవనోపాయమే అనృతము. అనృతమును నీయధర్మపాదమువలన కృతయుగమునందుకన్న త్రేతాయుగ మున ఆయుస్సు క్షీణింపఁజొచ్చెను. అంత ఆయుఃక్షయమునకు భీతులై జనులు యజ్ఞదానతపోరూప శుభకర్మల నాచరించుచు సత్యధర్మపరాయణులైయుండిరి. బ్రాహ్మణక్షత్రియులు తపస్వులై యుండఁగా వైశ్యులు శూద్రులు శుశ్రూషాపరాయణులై యుండిరి. వారికది పరమమైన స్వధర్మ మయ్యెను. వైశ్యులు కృష్యాదిక ముచే శుశ్రూష యొనర్చుచుండిరి, శూద్రులు విశేషముగా సేవా రూపముననే శుశ్రూషఁ గావించుచుండిరి. ఇంతలో త్రేతాయుగావ సానకాలమున అధర్మము రెండవపాదమును ప్రవేశపెట్టెను. కావు

ద్గనే అనంతరయుగమునకు ద్వాపరమను నామ మేర్పడెను. అనఁగా అధర్మపాదములు రెండుకల దన్నమాట.

ఈ యుగమున తపస్సు వైశ్యులను పొందెను. ఇట్లు మూఁడు యుగములలో తపస్సు మూఁడు వర్ణములవారికి సంక్రమించెను. ఈమూఁడు యుగములలో శూద్రులకు తపస్సున అధికారము లేదు కలియుగమున శూద్రులు తపశ్చర్యాన్వితు లగుదురు. కావున ద్వాపరమునందే శూద్రునకు తపస్సు మిక్కిలి యధర్మము (త్రేతాయుగమున చెప్పనేల?) నీదేశ సీమలలో నొక దుర్బుద్ధియైన శూద్రుఁడు గొప్ప తపస్సు చేయుచున్నాఁడు. అందువలననే బాలమరణము సంభవించినది. పురమునఁగాని దేశమునందుఁగాని దుర్మతియైన నరుఁడు అధర్మమునో అకార్యమునో చేసినచో అది అలక్ష్మిమూల మగును. అట్టిరాజ్యమునకు పాలకుడుగానున్న రాజు నరకము నొందును. అధ్యయనము, తపస్సు మొదలగు సుకృత కర్మలయందు పుణ్యములో ఆఱవ బాగమునకు అధికారియైన రాజు ప్రజలయందు ధర్మమును పాలింపకున్ననెట్లు? కావున నీరాజ్యమున నంతట వెదకి దుష్కృత మెచ్చట జరుగుచున్నదో చూచి దానిని నివారించుటకు యత్నింపుము. ఇట్లు ధర్మము వర్ధిల్లి జనులకు అయుర్వృద్ధి కలుగును. ఆ బాలుఁడును మరల జీవించును.

శ్లో॥ త్రేతాయుగే చ వర్తన్తే బ్రాహ్మణాః క్షత్రియా శ్చ యే।
తపోఽతప్యన్త తే; సర్వే శుశ్రూషా మపరే జనాః॥ 19

శ్లో॥ స్వధర్మః పరమ స్తేషాం వైశ్యశూద్రం త దాగమత్।
పూజాం చ సర్వవర్ణానాం శూద్రా శ్చక్రు ర్విశేషతః॥ 20

శ్లో॥ తతః పాద మధర్మస్య ద్వితీయ మవతారయత్।
తతో ద్వాపరసంఖ్యా సా యుగస్య సమజాయత॥ 22

శ్లో॥ అస్మిన్ ద్వాపరసంఖ్యానే తపో వైశ్యాన్ సమావిశత్,
త్రిభ్యో యుగేభ్య స్త్రీన్ వర్ణాన్ క్రమాద్వై తప అవిశత్॥ 24

శ్లో॥ భవిష్యత్ శూద్రయోన్యాం హి తపశ్చర్యా కలౌ యుగే। 25½

.... .... .... .... .... .... ........................................

శ్లో॥ అధర్మః పరమో రాజన్ ద్వాపరే శూద్రజన్మనః।
న వై విషయపర్యన్తే తవ రాజన్ మహాతపాః॥ 26

శ్లో॥ అద్య తప్యతి దుర్బుద్ధి స్తేన బాలవధో హ్యయమ్।
యో హ్యధర్మ మకార్యం వా విషయే పార్థివస్య తు॥ 28

శ్లో॥ కరోతి చాశ్రీమూలం తత్పురే వా దుర్మతి ర్నరః।
క్షిప్రం చ నరకం యాతి స రాజా నాత్ర సంశయః॥ 29

ఉత్తరకాండ సర్గ-74

రాముఁడు లక్ష్మణుని బిలిచి యాబాలుని శరీరమును తైల ద్రోణియందు భద్రమొనర్పఁ బనిచి, పుష్పకము నధిరోహించి సాయుధుఁడై తూర్పున ఉత్తరమున శూద్రతపస్విని(గానక దక్షిణముగా దండకు వచ్చెను. దండకారణ్యమునకు ఉత్తరపు హద్దు వింధ్యము; దక్షిణపు హద్దు శైవలము. శైవల గిరియొక్క ఉత్తరపువైపున ఒకపెద్ద సరస్సు చెంత చెట్టుకొమ్మనుండి అధోముఖముగా వ్రేలాడుచు గొప్పతపస్సు చేయుచున్నవాఁ డొకఁడు రామునకు కన్పించెను. రాముఁడతని యొద్దకుపోయి ఓతపస్వీ। ఉగ్రమైన తపస్సు చేయుచున్నావు. నీవు ఎవఁడవు? బ్రాహ్మణుఁడవా? క్షత్రియుఁడవా? వైశ్యుఁడవా? శూద్రుఁడవా? నిజము చెప్పుము; ఏ ఫలమును కోరి ఇంత ఘోరముగా తపస్సుచేయుచున్నావు?'అని యడిగెను. అతడు అట్లు వ్రేలాడుచునే యుండి, అనఁగా రాజునకు అతిథిసత్కారములు చేయక, ఇట్లు పలికెను. "రామా ! నేను

శూద్రయోనియందు జన్మించితిని; ఈ శరీరముతోకూడ దేవత్వమును పొందఁగోరుచున్నాను; అందులకై ఉగ్రమైన యీ తపస్సు చేయుచున్నాను; దేవలోకమును జయింపఁగోరుచున్న కారణముచేత నేను అసత్యమును చెప్పను; నన్ను శంబూకుఁడు అనుపేరుగల శూద్రునిగ ఎఱుంగుము." అతఁడు ఆమాట చెప్పుచున్నంతనే రాముఁడు ఖడ్గముతో వాని శీర్షమును ఖండించెను.

శ్లో॥ తస్య తద్వచనం శ్రుత్వా రామ స్యాక్లిష్టకర్మణః॥
అవాక్శిరా స్తథాభూతో వాక్యమేత దువాచ హ॥ 1

శ్లో॥ శూద్రయోన్యాం ప్రజాతోఽస్మి తప ఉగ్రం సమాస్థితః।
దేవత్వం ప్రార్థయే రామ సశరీరో మహాయశః॥ 2

శ్లో॥ న మిథ్యాహం వదే రామ దేవలోకజిగీషయా।
శూద్రం మాం విద్ధి కాకుత్స్థ శంబూకో నామ నామతః॥ 3

శ్లో॥ భాషత స్తస్య శూద్రస్య ఖడ్గం సురుచిరప్రభమ్।
నిష్కృష్య కోశా ద్విమలం శిర శ్చిచ్ఛేద రాఘవః 4

ఉత్తర-సర్గ-76

అప్పుడు పుష్పవర్షము కురిసెను, ఇంద్రాది దేవతలు వచ్చి సంప్రీతులై "ఇది దేవతలకార్యము; ఈ శూద్రుఁడు స్వర్గమునకు రాకుండునట్లు నీవు ఈపనిని చక్కగా చేసితివి; కావున ఏ దేని వరమును కోరుకొనుము" అని పలికిరి. రాముఁడు అంజలించి దేవేంద్రునితో ఇట్లనెను. "బాలుని జీవింపఁ జేయుదు నని నేను బ్రాహ్మణునకు మాట యిచ్చి యుంటిని, కావున దేవతలు ప్రసన్నులై ఆ బాలుని బ్రతికింతురు గాక." అప్పుడు వారు "నీవు ఈ శూద్రుని సంహరించిన క్షణముననే ఆ బాలుఁడు జీవించి

బంధువులతో కూడి యున్నాఁడు; నీవు ఆ విషయమున చింతను వీడుము; అగస్త్యుఁడు ద్వాదశవార్షికమైన జలశయ్యావ్రతమును ముగించి యున్నాఁడు; ఆయనను అభినందించుటకు పోవుదము రమ్ము" అని పలికిరి.

అనంతరము రాముఁడు దేవతలతోఁ గూడ అగస్త్యాశ్రమమునకు పోయెను. పండ్రెండేండ్లుగా జలశయ్యాదీక్ష నవలంబించి పూర్తియొనర్చిన యాబ్రహ్మర్షిని అభినందించుటకు దేవతలును వచ్చిరి. దేవతలు ఆయన వలన పూజితులై అయనను అభినందించి వెడలిపోయిన తరువాత, రాముఁ డాయనకు ప్రణామ మొనర్చి యభినందించెను. ఆ మహర్షి రామునకు ఆతిథ్య మొసంగి ఆ రాత్రికి ఆశ్రమమున నుండు మని శ్వేతుని కథను, దండుని వృత్తాంతమును చెప్పి యొక దివ్యమైన యాభరణమును కూడ బహూకరించెను. మహర్షి యాజ్ఞగా రాముఁడు దానిని స్వీకరించి ఆ రాత్రి కచ్చటనుండి మఱునాఁడు మధ్యాహ్నమునకు అయోధ్య చేరి పుష్పకమును పంపివైచెను.

ఇచ్చట తపస్సుయొక్క స్వరూపమును గ్రహించుట అవశ్యకము. ఇది నాలుగు విధములుగా నున్నది. మొదటిది జ్ఞానమయమైన తపస్సు. ఋతము సత్యము శ్రుతము శాంతము దమము శమము దానము యజ్ఞము అనునవి యన్నియు తపస్సులే (ఋతం తప స్సత్యంతపః ... శ్రుతి) భూర్లోక భువర్లోక సువర్లోకములను బ్రహ్మమునుగా భావించుటకూడ తపస్సే.

తైత్తిరీయములో ధర్మానుశాసనమునందు చెప్పఁబడిన మాతృసేవ పితృసేవ అచార్యసేవ అతిథిపూజనము స్వాధ్యాయ ప్రవచనములు మొదలైనవి తపస్సులో రెండవవిధము. పితృసేవ మొదలగువానిని అనుష్ఠించుటలోని నిష్ఠయొక్క అతిశయమే

తపస్సు. ఇట్లే భర్తృ శుశ్రూష స్త్రీలకు తపస్సు అగును. ఈతపస్సు యొక్క మహిమచేతనే దమయంతి కిరాతుని శపించి అంత మొందించినది. తల్లిదండ్రులను సేవించుచు ధర్మవర్తనమున జీవించుచుండిన నిష్ఠచేతనే ధర్మవ్యాధుఁడు దివ్యదృష్టితో కౌశికుఁడను బ్రాహ్మణుని వృత్తాంతమును తెలిసికొని వానికి ధర్మసూక్ష్మములను బోధింపఁగలిగెను. శ్రీరాముఁడు ఈ ధర్మానుష్ఠానము చేతనే తపోధనులైన మహర్షులకు కూడ పూజ్యు డయ్యెను. ఈ తపస్సుయొక్క స్వరూపమును శ్రీకృష్ణభగవానుఁడు ఇట్లు నిరూపించెను "దేవతలను ద్విజులను గురువులను ప్రాజ్ఞులను పూజించుట, శుచిగా నుండుట, ఋజువర్తనము. బ్రహ్మచర్యము, అహింస శరీరముచేత నిర్వహింపఁబడు తపస్సు. ఇతరులకు ఉద్వేగము కలిగింపకుండ హితకరమైన సత్యవాక్యమును ప్రియముగా చెప్పుట, స్వాధ్యాయమును అభ్యసించుట వాక్కుచేత చేయఁబడు తపస్సు. ప్రసన్నత సౌమ్యత మౌనము మనోనిగ్రహము భావ సంశుద్ధి అనునవి మానసికమైన తపస్సు.

శ్లో॥ దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచ మార్జవమ్।
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే॥ 14

శ్లో॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥ 15

శ్లో॥ మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః।
భావసంశుద్ధి రిత్యేతత్ తపో మానస ముచ్యతే॥ 16

భగవద్గీత-అధ్యా-17

కృచ్ఛ్రము చాంద్రాయణము మొదలగు వ్రతములు మూఁడవ విధమైన తపస్సు. ఇవి పెక్కు నియములలో కూడి

యుండును. ఇవి సాధారణముగా ప్రాయశ్చిత్తములందు అవలంబింపఁబడును.

ప్రాణాయామ ప్రధానమైనవి హఠయోగము లని చెప్పఁబడు చున్నవి. నాల్గవవిధమైన తపస్సు పర్ణములు నీరు వాయువు మొదలగు వానిని ఆహారముగాఁ గొనుచు పంచాగ్నిమధ్యమున తపస్సు చేయుట, ఒంటకాలిపై నిలిచి తపస్సుచేయుట మొదలుగా ఇవి ఎన్నో విధములుగా నున్నవి.

కృతయుగమునందు సమ్యగ్దర్శనరూపమైన జ్ఞానమే తపస్సుగా నుండెను. మాతాపితృసేవ గురుశుశ్రూష మొదలగు ధర్మములు అవశ్య కర్తవ్యములై యుండెను. అప్పుడు ధర్మానుష్ఠానముతోఁబాటు తపస్సును చేయుచుండిరి. ధర్మాచరణమును వీడి ప్రత్యేకముగా తపస్సుకొఱకు తపస్సుచేయుట సమ్మతముకాదు. మహాభారతమున అరణ్యపర్వమునందు ధర్మవ్యాధోపాఖ్యానములో కౌశికుని వృత్తాంతమున ఇది స్పష్టముగా నిరూపింపఁబడియున్నది. ధర్మాచరణమువలన దురితము నశించి మనస్సు విమలమగును. అట్టి ధార్మికులు చేయు తపస్సు స్వార్థపరముగా నుండదు. అది సాత్త్వికమైన తపస్సు. దానివలన లోకమునకు శ్రేయస్సు కలుగును" ధర్మాచరణమును వదలి స్వార్థపరులై విశేషసిద్ధులను కోరి ప్రాణాయామరూపమైన హఠయోగమున తపస్సు చేయునప్పుడు, అట్టివారికి గొప్పశక్తులు కలుగవచ్చును. కాని మనస్సునకు నిర్మలత్వము కలుగదు; కామక్రోధములు తగ్గవు. కావుననే ఎంత తపస్సులు చేసినను రాక్షసులకు దుష్టవాసనలు పోలేదు. ఆ తపశ్శక్తులు వారి కామ పరత్వమునకు సాధనములై లోకమునకు అశాంతినే కలిగించినవి. ఇట్టి తపస్సు తామసికము. దీనిని శ్రీకృష్ణభగవానుఁడు ఇట్లు వివరించెను. "మనుష్యులయొక్క

శ్రద్ధనుబట్టి తపస్సు మూఁడు విధములుఁగా నున్నది. ఫలము నందు కాంక్షలేకుండ శ్రద్ధతో చేయు తపస్సు సాత్త్వికము. సత్కారమును స్వాతిశయమును లోకమున పూజను కోరుచు వంచనముతో చేయు తపస్సు రాజసము. ఇది చంచలము అశాశ్వతము. విశేషమైన ఫలమును కోరి మొండిపట్టుదలతో పెక్కు నియమములతో మనశ్శరీరముల పీడించుచు చేయు తపస్సు గాని, ఇతరులను నిర్మూలించుటకై చేయు తపస్సుగాని తామసికము."

శ్లో॥ శ్రద్ధయా పరయా తప్తం తప స్త త్త్రివిధం నరైః।
అఫలాకాంక్షిభి ర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే॥ 17

శ్లో॥ సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్।
క్రియతే త దిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్ 18

శ్లో॥ మూఢగ్రాహేణాऽత్మనో య త్పీడయా క్రియతే తపః।
పరస్యోత్సాదనార్థం వా త త్తామస ముదాహృతమ్॥ 1

భగవద్గీత- అధ్యాయ. 17

"మూఁడు యుగములలో క్రమముగ క్షత్త్రియ వైశ్యశూద్రులు అను మూఁడు వర్ణములవారిని తపస్సు ఆవేశించెను" అని నారదుడు చెప్పిన మాటను చక్కఁగా గ్రహింపవలసియున్నది.

"త్రిభ్యో యుగేభ్య స్త్రీన్ వర్ణాన్ క్రమాద్వై తప ఆవిశత్" (24)

కృతయుగమున బ్రాహ్మణులు మాత్రమే తపస్సు చేయుచుండిరి. తక్కినవారు వారికి శుశ్రూష చేయుచుండిరి. అప్పుడు దండభీతి లేకయే ఎల్లవారును తమకు నియతములైన వర్ణ ధర్మములను ఆచరించుచుండిరి; అప్పుడు ధర్మము కృతముగానే,

అనఁగా చేయఁబడినది గానే, యుండుటచేత ఆ యుగమునకు కృతము అను పేరు వచ్చెను. జను లందఱును బ్రహ్మజ్ఞాన సంపన్ను లగుటచే తమ తమ ధర్మములను నిర్వహించినవారు గనే యుండిరి; ఎవని విషయమునను "ఇది నీకు కర్తవ్యము, దీనిని నీవు తప్పక చేయవలయును'' అని మఱియొకఁడు ప్రబోధింపవలసిన యక్కఱ లేకుండెను. ప్రతివ్యక్తియు ఎప్పటికప్పుడు తన ధర్మమును క్రమశిక్షణతో ( Discipline ) నిర్వహించుచున్నప్పుడు కర్తవ్యమును గూర్చి బోధింపవలసిన యక్కఱయే యుండదు. ఇట్లు చాలకాలము గడచునప్పటికి కృతయుగము యొక్క అంతమున బ్రహ్మజ్ఞానము క్షీణించి ప్రాణాయామరూపమైన ఉగ్రమైన తపస్సుతో ప్రాభవమును భోగభాగ్యములను పొంది సుఖింపవలయు ననుతలంపు మహర్షులవలన జన్మించిన హిరణ్యాక్షుఁడు హిరణ్యకశిపుఁడు మొదలగువారికి కలిగెను. మహర్షుల తపస్సు జ్ఞానమయము, వారు జ్ఞానామృతముచేత ఎల్లప్పుడు ఆనందపూర్ణులై యుందురు. ఆత్మ స్వరూపమునకు భిన్నముగా సుఖమేదియు వారికి తోఁచదు. అందువలన వారికి సుఖమును సంపాదింపవలయునను తలంపుకూడ పుట్టదు. కావున వారు ఆనందమయులై తమ ధర్మములను చక్కఁగా నిర్వర్తించుచుండిరి. జ్ఞానము క్షీణించినప్పుడు అజ్ఞానము ప్రబలును. అప్పుడు ఆత్మ సాక్షాత్కారమువలన కలుగవలసిన యానందము కలుగదు; సుఖము తమ స్వరూపమైన ఆత్మకన్న భిన్నముగా భోగవిషయములందు ఉన్నదను భ్రమ కలుగును. ఆ భ్రాంతివలన సుఖసాధనములుగా తోఁచుచున్న ధనధాన్యవైభవములను సాధింపవలయునను సంకల్పము కలుగును. వానిని సాధించుటకు అవశ్యకమైన శక్తికొఱకై వారు ఉగ్రములైన తపస్సులకు పూనుకొని శక్తులను సంపాదించి స్వార్థపరులై పదవులను ఆక్రమించి ఇతరుల సంప

దలను కొల్లఁగొట్టి సుఖపడుటకు ప్రయత్నించుచు రాక్షసు లగుదురు. శక్తిమంతులైన దుష్టులెల్లరును రాక్షసులే. వారివలన ప్రజలకు తప్పక బాధకలుగును. లోకములందు శాంతిని నెలకొల్పవలసిన బాధ్యత విష్ణుదేవునిది. అందువలన ఆయన నరసింహాము మొదలగు నాకృతులతో అవతరించి దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించి ధర్మమును నెలకొల్పుచుండును.

త్రేతాయుగమున ఇట్లు తపస్సుచేసి గొప్ప శక్తులను సంపాదింపవలయు ననుభావము క్షత్రియులను ఆవేశించెను. వశిష్ఠుని కామధేనువును హరింపవలయునని ప్రయత్నించి భంగపడి విశ్వామిత్రుఁడు ఈశ్వరునిగూర్చి తపస్సుచేసి సకల దివ్యాస్త్రములను సంపాదించుట యిట్టిదే. కార్తవీర్యార్జునుఁడు యోగసిద్ధులను సంపాదించియుండి జమదగ్నియొక్క హోమధేనువును హరింపఁబూనుకొనుటయు ఇట్టిదే, ఆత్మజ్ఞానరహితములైన తపశ్శక్తులు అనర్థమునే కలిగించును, ఈ తపశ్శక్తులచేత ఆకర్షింపఁబడినవారు ధర్మమును లెక్కపెట్టరు. సమాజమునందు అన్ని వర్ణములవారు తమ తమ ధర్మములను సక్రమముగా నిర్వర్తించుచున్నప్పుడే ప్రజలకు సుఖము కలుగును. అట్లు కాక ఒకరిని చూచి మఱియొకరు కుటుంబబాధ్యతలను, సామాజిక కర్తవ్యములైన వర్ణధర్మములను వదలి తపస్సులుచేసి శక్తులను సంపాదింపవలయు నని పూనుకొన్నచో కుటుంబములు సమాజము అవ్యవస్థపాలగుట (Chaos) తప్పదు. కావుననే వేదములు, "సత్యమును చెప్పుము ధర్మమును ఆచరింపుము. తల్లిని దేవతగా ఆరాధింపుము; తండ్రిని దేవునిగా ఆరాధింపుము" ఆచార్యుని దేవునిగా ఆరాధింపుము; అని విధించుచు ఈ ధర్మములను ఆచరించుటయే పరమైన తపస్సు అని నొక్కి చెప్పుచున్నవి. విష్ణుదేవుఁడు శ్రీరాముఁడుగా అవత

రించి వేదముయొక్క ఈ యను శాసనమునే తన జీవితమునందు అసిధారావ్రతముగా పాటించి ప్రజలచేత కూడ అనుష్ఠింపఁజేసెను.

త్రేతాయుగముయొక్క అరంభమునందే ప్రజలకు వర్ణ ధర్మములయెడ శ్రద్ధ సడలుచుండుటను గమనించి ధర్మపాలకులైన మనువు మొదలగువారు వేదవిహితములైన ధర్మములను సుబోధములగునట్లుగా స్మృతి గ్రంథములందు వివరించి ఆ ధర్మములను ప్రజలయందు నెలకొనునట్లు చేయుటకు ప్రభుత్వములను ఏర్పఱచిరి. సమాజమునందు ఎవరు ఏయే వర్ణములలో జన్మించుచున్నారో వారు ఆయా వర్ణములకు సహజములైన ధర్మములను ఆచరించునట్లు చేయుట ప్రభువులకు కర్తవ్యముగా నుండెను. వర్ణములనుగాని వర్ణధర్మములనుగాని ఏర్పఱచునట్టి అధికారము ప్రభువులకు లేదు. తల్లి దండ్రులనుబట్టి వర్ణము, వేదమువలన ధర్మవిభాగము ఏర్పడుచున్నది. వృత్తులనుబట్టి వర్తనమునుబట్టి పుట్టుకచేత వచ్చినవర్ణము మాఱదు. రాజులను సంహరించిన పరశురాముఁడుగాని ద్రోణుఁడుగాని క్షత్రియులు కాలేదు. ధర్మములను తత్త్వమును ఉపదేశించిన భీష్ముఁడుగాని శ్రీకృష్ణుఁడుగాని బ్రాహ్మణులు కాలేదు. కావున ఆయా వర్ణములలో జన్మించిన వారు వేదవిహితములైన తమవర్ణధర్మములను అనుష్ఠించునట్లు చేయుట ప్రభువులకు కర్తవ్యమై యుండెను. అప్పుడు వర్ణ ధర్మములు కులధర్మములు ఎట్లు ప్రభువులచే ప్రవర్తింపఁజేయఁబడుచుండినవో ధర్మవ్యాధుని యుపాఖ్యానమునందు స్పష్టముగావింపఁబడియున్నది. ధర్మవ్యాధుఁడు జ్ఞానియయ్యును తన కులధర్మమైన మాంస విక్రయమును మానలేదు. కౌశికుఁడు అతనిని జూచి

"నీవు గడు ధర్మవిదుఁడవు; జీవహింస
జీవనంబుగ నడచుట శిష్టపథమె"? అరణ్య. 5. 31

అని యడిగెను. అప్పుడు వ్యాధుఁ డాతనితో నిట్లనెను. బ్రాహ్మణులకు దపస్స్వాధ్యాయ సత్య శౌచ బ్రహ్మచర్యంబులును, రాజులకు దండనీతియు, వైశ్యులకు శుశ్రూషయు నెట్లు పరమధర్మంబయి చెల్లు నట్ల మాకును మృగయోపజీవనంబు పరమధర్మంబు; విశేషించి యిది కులక్రమాగతం బయినయాచారం; బదియును గాక యీదేశంబునకు రాజైన జనకుండు నిజ ధర్మతత్పరుం డయి సకలవర్ణ ధర్మరక్షణంబు వదలకుంతు; నట్లు గాన నాత్మకర్మంబులు విడుచువానిం దనపుత్రునైనను దండితుం జేయుఁ; గావున నేనును నిజకర్మ పరిత్యాగంబు సేయి నోడుదు,..'

అరణ్యపర్వ. ఆశ్వా. 5. 32

వేదవిహితములైన ధర్మములలో మాతాపితృసేవ మొదలగునవి కుటుంబ బాధ్యతలు; స్వాధ్యాయము; దండనీతి మొదలగునవి సమాజబాధ్యతలు. ప్రతివ్యక్తియు ఈ బాధ్యతలను ధర్మాచరణ రూపమున నిర్వహింపవలయు ననుట వేదమునకు పరమ తాత్పర్యము. ఈ బాధ్యతల నన్నింటిని తీర్చిన తరువాత కుటుంబముయొక్క రాజుయొక్క లేక సమాజములోని పెద్దలయొక్క అనుమతిని గైకొని ఏవ్యక్తియైనను వనములకుపోయి తపస్సు చేసి స్వర్గమునో మోక్షమునో పొందవలె. అట్లుకాక ఎవరికి తోఁచినట్లుగా వారు కుటుంబబాధ్యతలను సమాజ బాధ్యతలను వదలి తపస్సుచేయుటకై వనములకు పోవుట వేదధర్మమునకు విరుద్ధము. తండ్రికి చెప్పకుండ, భార్యను, పుత్రుని, రాజ్యపరిపాలన బాధ్యతను వదలి తపస్సుచేయుటకై అడవులకు పోవుటచేతనే, గౌతమ బుద్ధునివర్తనము వేదబాహ్యమయ్యెను. ఇట్లు ఒకరిని చూచి యొకరు ఎల్లవారును స్వర్గమునో మోక్షమునో సంపాదింపఁ గోరుచు తమ యిష్టము వచ్చినట్లుగా వెడలిపోయినచో కుటుంబ

ములలో శాంతి, సమాజములో వ్యవస్థ ఎట్లు నిలుచును ? అదియును కాక ఇట్లు తపస్సు చేయఁబూను వారందఱు పరమసాత్త్వికులై యుండరు. సాత్త్వికులుకానివారు సాధారణముగా స్వార్థపరులై విపరీతములైన కోరికలను కలిగియుందురు. అట్టి కోరికలతో వారు ఘోరములైన తపస్సులుచేసి క్షుద్రములైన శక్తులను సాధించినచో వారివలన సమాజమునకు ఉపద్రవముతప్పదు. అట్టివారు అహంకారపూరితులై పరులధనములను హరించుటకు పూనుకొందురు. ప్రజారక్షణముకొఱకు వారిని రాజులు సంహరింపక తప్పదు. వారు సాధించిన శక్తులు ప్రబలమైన వగుచో వారినిసంహరించుట రాజులకుకూడ అసాధ్యమే అగును. ఈ కారణముచేతనే రావణాదులను సాధారణులైన రాజులు సంహరింప లేకపోయిరి. విష్ణుదేవుఁడే రాముఁడుగా అవతరించి సంహరింపవలసి వచ్చెను. ఇట్టి యపాయము సమాజమునకు సంభవింపకుండుటకు ప్రజల నందఱను వారి వారి వర్ణములయొక్క ధర్మములయందు నిలిపి సమాజములోని వృత్తులన్నియు సక్రమముగా జరుపుటకు అనర్హులైన వారిని తపస్సునుండి వారించుటకు వర్ణధర్మములను రక్షించుట రాజులకు పరమకర్తవ్యమయ్యెను,

ఈ విషయమున సనాతనమైన సంప్రదాయ మెట్టిదో ధృతరాష్ట్రుని వృత్తాంతమునుబట్టి గ్రహింపవచ్చును. భారతయుద్ధము జరిగినతరువాత కొంతకాలమునకు ధృతరాష్ట్రుఁడు సంసారమునందు విరక్తుఁడై అడవులకుపోయి తపస్సుచేయుటకు నిశ్చయించుకొనెను. అప్పుడు ధర్మరాజు పట్టాభిషిక్తుఁడై ప్రజలను పాలించుచుండెను. అందువలన ధృతరాష్ట్రుఁడు ధర్మరాజును పిలిపించి వనమునకుపోవుటకై అనుమతి నిమ్మని ఇట్లు అర్థించెను.

సీ॥ ఏకార్య మయినను ఎవ్వఁ డేనియుఁ జేయఁ
దొడఁగునప్పుడు. విను, పుడమి తేని
చే ననుజ్ఞాతుఁడై కాని తొడంగరా;
దట్లు కావున వార్ధకాదిలీథ
మైన మదీయకాయమునకు సంస్కార
మాచరింపఁగఁ దప మాచరించు
పనికి, భూపాల! నీయనుమతి వడయంగ
వలసి చెప్పెద; రాజవంశజునకు

ఆ॥ వె॥ సమరమరణ మొండె విమలతపమునకుఁ
జొచ్చి యందు నిలిచి చచ్చు టొండె
వలయు; నస్మదీయకులముఖ్యు లిట్టుల
నడిచి; రనఘ! నన్ను నడవి కనుపు.

కం॥ రాజు గురుఁ డెల్లవారికి;
రాజోత్తమ! గురుని యాజ్ఞ రంజిల్లఁగఁ జే
రోజం జేసిన కృత్యము
నూ జగముల రెంటియందు శోభన మిచ్చున్.

అది విని ధర్మరాజు మిగుల దుఃఖితుఁడై ధృతరాష్ట్రుని వనగమన మునకు అంగీకరింపఁజాలకుండెను. అప్పుడు వ్యాసమహర్షి వచ్చి ధర్మరాజునకు నచ్చఁజెప్పఁగా తుదకు అతఁడు అనుమతి నిచ్చుచు మహర్షితో నిట్లనెను.

కం॥ అనఘా! యిక్కురుముఖ్యున
కనుజ్ఞ యే నిచ్చితిని; మహత్తరమగు మీ
యనుమతియుఁ బడసెఁ జనుఁగా
క నిజేచ్ఛను; నాకు విఘ్నకరణము దగునే.

పిదప ధృతరాష్ట్రుఁడు పౌరులను సైతము సమావేశ మొనరించి ఇట్లు ప్రార్థించెను.

కం॥ మహి లెస్సగ రక్షించిన
మహితగుణుని యన్న కొడుకు మనుమం డని నా
కు హితంబుఁ గోరి కరుణా
సహితులరై యిం డనుజ్ఞ సద్వ్రతమునకున్.

ఆ॥ వె॥ వృద్ధ కృపణు పుత్త్రవిరహిత గాంధారి
యీనెలంతఁ జూచి యైన మీర
లకట కాననమున కరుగుట మే లని
మా కనుజ్ఞ యిండు మాన్యులార!

దీనినిబట్టి చూచినచో కుటుంబమును సమాజమును వదలి యడవులకుఁబోయి తపస్సు చేసికొనుటకు కుటుంబముయొక్క, రాజుయొక్క, సమాజమున పెద్దలయొక్క అనుమతి అవశ్యక మనుట స్పష్టము. ఇంక ఈదృష్టితో చూచినప్పుడు శంబూకుఁడు వనమునకుఁబోయి తపస్సు చేయుట ఎంత అక్రమమో గ్రహింప వచ్చును. శంబూకునకు అ శరీరముతోనే స్వర్గమునకు పోవలయు నను తలంపు కలిగినది. స్వర్గమునకు పోవలయు నని కోరుటలో వైపరీత్యము ఏమియును లేదు. శబరి గురువులను సేవించి అగ్ని యందు మనుష్యశరీరమును వదలి దివ్య శరీరముతో దేవలోకము నకు పోయనది. జటాయువుయొక్క శరీరమునకు రాముఁడు అగ్ని సంస్కారము గావించి జటాయువును దేవలోకమునకుపంపినాఁడు. కాని శంబూకుఁడు మనుష్యశరీరముతోనే స్వర్గమునకు పోవలయు నని కోరినాఁడు. ఇట్టి కోరిక మహారాజైన త్రిశంకువునకు కూడ కలిగినవి. ఆయన గురువైన వసిష్ఠుని ఆశ్రయించెను. ఇది అసాధ్య

మని గురువు నిరాకరించెను. గురువు పుత్రులును అట్లే తిరస్కరించిరి. తుదకు విశ్వామిత్రుడు తపశ్శక్తిచేత త్రిశంకువును స్వర్గమునకు పంపెను, ఇంద్రుఁడు అతనిని తలక్రిందుగా త్రోసివేసెను. ఈకథను శంబూకుఁడును వినియుండును. ఉగ్రమైన తపస్సు చేసినచో స్వర్గమునకు త్రిశంకువువలె పోవచ్చునని అతఁడు తలంచెను. కాని తన తండ్రి, తాత, ముత్తాత ఎవరును తపస్సుచేసియుండలేదు. అంతేకాదు, తనవర్ణము వారిలో ఎవరును తపస్సు చేయలేదు. ఇప్పుడు తాను తపస్సు చేయుదునన్నచో సమాజములోని పెద్దలేకాదు తన వర్ణమువారు తనవారుకూడ అంగీకరింపరు. అందువలన అతఁడు, గౌతమబుద్ధునివలె ఎవరితోనుచెప్పకుండఅడవికి వచ్చి తపస్సునకు పూనుకొనెను. దీనినిబట్టి ఆతని యవినయ మెట్టిదో వ్యక్తమగుచున్నది. ఆ శరీరముతోనే స్వర్గమునకు పోవలయునని కోరుటవలన అతని దేహాభిమానము ఎంతగాఢమైనదో స్పష్టమగుచున్నది. "నేను దేవలోకమును జయింపఁగోరుచుండుటచేత అసత్యమును చెప్పను" అని అతఁడు చెప్పుట గమనింపఁదగియున్నది. దేవలోకమును జయించుటకు అవకాశము లేకున్నచో సత్యమును చెప్పనక్కఱలేదా? ఫలమును ఉద్దేశించి సత్యమును చెప్పుట ధర్మమును ఆచరించుట సత్పురుషుల లక్షణము కాదు. కష్టమో నష్టమో వచ్చినప్పుడు సత్యమును ధర్మమును వదులుకొనవచ్చునా? అట్టివారికి సత్యమునందు ధర్మమునందు విశ్వాసము లేదన్నమాట.

మఱియొక విషయమును గూడ గమనింపవలసియున్నది, ధర్మప్రవర్తకుడైన రాజు ఎల్లవారికిని పూజ్యుఁడు. అందును శ్రీరామచంద్రుని మహర్షులు దేవతలు సైతము పూజించుచుండిరి. అట్టి మహారాజు తన సమీపమునకు వచ్చినప్పుడు శంబూకుఁడు

తన స్థానమునుండి బయలుదేరి ఎదురుగావచ్చి అతిథి సత్కార ములతో ఆయనను పూజింపవలసియుండెను. "నేను తపస్సు చేయుచున్నాను" అను తలంపు కలిగినంతనే అతనికి ''నేను చాల మహనీయుఁడనైతి'' ననుభావము ప్రబలి అతిథి సత్కారము చేయవలయునను స్ఫురణమే కలుగలేదు. తపస్సును ఆరంభించి నంతనే అతని చిత్తవృత్తి యిట్లున్నచో తపస్సు కొనసాఁగినచో ఎంత భయంకరమగునో ఊహింపవచ్చును. అతఁ డుద్దేశించినది దేవలోకమునకు పోవుటకాదు; దేవలోకమును జయించుట (పోవ లయుననుకోరిక జిగమిష; జయింపవలయు ననుకోరిక జిగీష ) శబరి మొదలగువారు అవలంబించిన గురుశుశ్రూషాదిరూపమైన ధర్మమార్గము ఉండగా, దానిని వదలి తనకు నిషిద్ధమైన తప స్సును అవలంబించి ఆ పరాక్రమముతో అతఁడు స్వర్గమును జయింపఁగోరుచున్నాడు. ప్రజాస్వామ్య విధానముతో జరుగుచున్న ప్రభుత్వమునందు ఎన్నికల పద్ధతిని తిరస్కరించి సైన్యమును కూడఁగట్టుకొనిపదవులను ఆక్రమింపఁబూనుకొనుట ఎట్టిదో శంబూ కుని పద్ధతియు అట్టిదే.

శంబూకుని యీసంరంభమును ప్రజలుగాని ప్రభుత్వము గాని గమనింపలేదు. దీనిని గమనించుచున్న దేవతలు అలజడి నొందిరి. శంబూకుఁడు స్వర్గమును ఆక్రమింపవలయునని ఎంత తీవ్రముగ భావించుచున్నాఁడో అంతకన్న తీవ్రముగ దేవతలు అతని ప్రయత్నమును నిర్మూలింపవలయునని సంకల్పించిరి. ప్రబ లములైన ఈ రెండు సంకల్పములకును సంఘర్షణ మారంభ మయ్యెను. మాటలు వాయుతరంగములై అంతరిక్షమున వ్యాపించి దూరశ్రవణ యంత్రములలో (రేడియో) విన్పించుచున్నట్లు, సంక ల్పములుకూడి అట్లే తరంగములను సృష్టించును. మాటలకన్న

తీవ్రములైన సంకల్పములకు బలమెక్కువ. వరములు శాపములు ఇట్టివే. వరమునో శాపమునో ఇచ్చువానియొక్క సంకల్ప బలమును బట్టి అవి శక్తితరంగములను (Waves of evergy) పుట్టించి మానవులకు శుభమునో అశుభమునో కలిగించును. విరుద్ధములైన సంకల్పములు ప్రబలినచో వాని ననుసరించి విరుద్ధములైన శక్తితరంగముల ప్రవాహములు సంఘర్షణము నొందును. ఆ సంఘర్షణమువలన మానవులకు కష్టమో నష్టమో కలుగక తప్పదు. ఇద్దఱు యోధులు పోరాడునప్పుడు వారినడుమ నున్న చీమలు మొదలైనవి నలిగిపోవుట సహజము. అట్లే శంబూకుని యొక్క దేవతలయొక్క సంకల్పముల సంఘర్షణమునకు ప్రారబ్ధ వశమున బాలుఁడు బలియయ్యెను. ఇది ఎందువలన జరిగినదో తెలియక రాముఁడు నిర్విణ్ణుఁడై యున్న సమయమున దేవతల ఋషియైన నారదుఁడు వచ్చి ఆ బాలుని మృతికి కారణమును తెలియఁజేసెను. కాని ఆయన శంబూకుఁడు ఎక్కడ తపస్సు చేయుచున్నాఁడోచెప్పక రామునే వెదకుమనిచెప్పి వెడలిపోయెను. రాముఁడు ఈ నిమిత్తముగా రాజ్యము నంతను పర్యటింపవలయు నని ఆయన యభిప్రాయమై యుండును. రాముఁడు పుష్పక విమానమున పడమర, ఉత్తరము, తూర్పు దిక్కులయందు పర్యటించి వింధ్యకు దక్షిణముగానున్న శైవలమను పర్వతమునొద్ద తపస్సు చేయుచున్న శంబూకుని శిక్షించుట గమనింపఁదగి యున్నది. శ్రీరామునియొక్క పరిపాలనాధికారము సరయూనదీ ప్రాంతమున నున్న కోసలరాజ్యమునకు మాత్రమే పరిమితముకాదు. ఆయా ప్రాంతములలో సామంతరాజులున్నను, అన్ని ప్రాంతములలో ధర్మము చక్కఁగా పరిపాలింపఁబడుచున్నదో లేదో చూచుకోవల సిన ధర్మపరిపాలనాధికారము అయోధ్యారాజుల యందున్నది. ఈయధికారమును అనుసరించియే ఆయన వాలిని శిక్షించెను.

"ఇది దేవతల కార్యము" అని దేవేంద్రుడు చెప్పెను. అట్టి యెడల ఆయనయే శంబూకుని శిక్షింపవచ్చును గదా! రాముఁడెందులకు పోయి అతనిని సంహరింపవలె? దేవేంద్రుఁడు త్రిలోకాధిపతి, అయినను భూలోకములోని ధర్మపరిపాలనాధికారము ఇక్కడ పట్టాభిషిక్తులైన మహారాజులకు అప్పగింపఁబడియున్నది. (Delegated). ఒక గ్రామములో ఒకఁడు తప్పుచేసినప్పుడు వానిని శిక్షింపుఁడని ప్రభుత్వము గ్రామాధికారులను ఆదేశించును. వారికి సాధ్యముకాకున్నచో తాలూకాకు అధికారులైన వారికి ఆదేశించును. అంతేగాని ముఖ్యమంత్రి నేరుగావచ్చి ఆ వ్యక్తిని శిక్షింపఁడు. అట్లు శిక్షించుట అధికార విధానమునకు విరుద్ధము, కావున దేవేంద్రుఁడు నారదునివలన శ్రీరామునకు శంబూకుని శిక్షింపవలసినదిగా ఆదేశించెను.

శంబూకుఁడు తపస్సుచేయుట తప్పైనచో అతనిని ఆప్రయత్నమునుండి విరమింపఁజేయవచ్చును కదా; అతనిని సంహరించుటెందులకు, అని కొందఱు సందేహింతురు. "ఈ తప్పునకు ఇది శిక్ష" అనునది దేశమునుబట్టి కాలముబట్టి ప్రభుత్వమునుబట్టి మాఱుచుండును. ఒకప్పుడు దొంగతనమునకు చేతినో కాలునో ఖండించుట శిక్షగా నుండెను. ఇప్పుడు హత్యలు చేసినను సాధారణముగా యావజ్జీవ కారాగార శిక్షయే విధింపఁబడుచున్నది. మరణదండనమును ( Capital punishment ) శిక్షా విధానము నుండి తొలగింపవలె నని కూడ కొందఱు వాదించుచున్నారు. వ్యక్తులకో కుటుంబములకో కష్టమో నష్టమో కలిగించు నేరములు వేఱు. సమాజముయొక్క వ్యవస్థను ప్రతిఘటించు నేరములు వేఱు. ప్రజాస్వామ్య వ్యవస్థపై ఆధారపడి జరుగుచున్న ప్రభుత్వము అవ్యవస్థనే ధిక్కరించు వానిని సహింపఁజాలదు. విప్లవకారులే

ప్రభుత్వమును ఏర్పఱుపఁ గలిగినప్పుడు వారు విప్లవ వ్యతిరేక శక్తులను (Forces of Counter - revolution) రవంత కూడ సహింపరు. సిద్ధాంతములయందు వ్యతిరేకత పొడసూపినంతనే అట్టి వ్యక్తులను నిర్మూలించుటకు వారు వెనుదీయరు. వారు నమ్మిన సామాజిక వ్యవస్థను కాపాడుకొనుటకు అట్లు కఠినముగా వ్యవహరింపక తప్పదని వారు భావింతురు. శ్రీరాముని కాలమున వర్ణవ్యవస్థ సమాజముయొక్క సుఖమునకు శాంతికి పునాదిగా ఉన్నది. శంబూకుఁడు ఆ వ్యవస్థకు వ్యతిరేకముగా వర్తించు చున్నాఁడు. వానిని తపస్సుయొక్క ప్రయత్నమునుండి విరమింపఁ జేసి చెరసాలలో ఉంచినను, అతఁడు అక్కడనైనను అట్టి ప్రయత్నము చేయఁడని చెప్పఁజాలము. అదియునుగాక అతనిని కఠిన యుగా శిక్షింపకున్నచో తక్కినవారును అతనిని అనుసరించుటకు ప్రయత్నించినచో సమాజము అవ్యవస్థ పాలగుట తప్పదు. అందువలన తపస్సు చేయుచున్నవానిని సంహరించుట ఎంత నృశంసముగా కన్పించుచున్నను సమాజ రక్షణదృష్టితో రాముఁడు శిక్షను నిర్వహింపక తప్పలేదు. బాల్యమునందే రామునకు విశ్వామిత్రుఁడు, స్త్రీని వధింపవలసి వచ్చెనే యని ఏవగించుకొనకుము. నాలుగు వర్ణముల వారియొక్క హితముకొఱకు రాజకుమారుఁడు అట్టికార్యమును చేయవలసినదే. ప్రజారక్షణముకొఱకు పరిపాలకుఁడు దోషయుక్తమైనను పాతకమైనను క్రూరమైనను ఆవశ్యకమైనకార్యమును తప్పక చేయవలసినదే. రాజ్యపాలనభారము నందు నియోగింపఁబడిన వారికి ఇది సనాతనమైన ధర్మము" అని తాటకా సంహార సందర్భమున ఉపదేశించియుండెను.

శ్లో॥ న హి తే స్త్రీవధకృతే ఘృణా కార్యా నరోత్తమ।
చాతుర్వర్ణ్యహితార్థాయ కర్తవ్యం రాజసూనునా॥ 17

శ్లో॥ నృశంస మనృశంసం వా ప్రజారక్షణ కారణాత్।
పాతకం వా సదోషం వా కర్తవ్యం రక్షతా సదా॥ 18

రాజ్యభారనియుక్తానా మేష ధర్మ స్సనాతనః॥ 19

"గృహిణులు పవిత్రురాండ్రుగా నుండవలసినదే" అను ధర్మమును ప్రజలయందు నిలుపుటకు అవశ్యకమైనపుడు అయన ఆయుపదేశము ననుసరించియే ఎంతో క్రూర కర్మమైనను గర్భిణి యైన భార్యను పరిత్యజించెను. అపరిత్యాగమువలననే తుద కామె పరలోకమున కేగినది. ఏ ధర్మవ్యవస్థా పరిరక్షణకై శ్రీరాముఁడు సీతను పరిత్యజించెనో దాని కొఱకే ఆయన శంబూకుని సంహరించె ననుట స్పష్టము.

## 10. కావ్యశ్రవణ ఘట్టము

అగస్త్యాశ్రమమునుండి తిరిగివచ్చినతరువాత శ్రీరాముఁడు భరతుని లక్ష్మణుని పిలిపించి రాజసూయ మొనర్చిన బాగుండు నేమో చెప్పుఁడని యడిగెను. దానివలన రాజవంశములకు వినాశము సంభవించును. కావున రాజసూయము వలదని భరతుఁడు ప్రాంజలియై విన్నవించెను. లక్ష్మణుఁడు అశ్వమేధ మహిమను వర్ణించి, ఆ యజ్ఞమును చేయుమని చెప్పెను. అప్పుడు రాముఁడు వశిష వామదేవాదులను పిలిపించి పూజించి, తాను ఏ యజ్ఞము చేసిన బాగుండునో చెప్పుఁడని ప్రార్థించెను. వారు రాముని సంకల్పమును మెచ్చి అశ్వమేధము యజ్ఞములలో శ్రేష్ఠమైనదని ప్రశంసించిరి. అంతట రాముఁడు అశ్వమేధమును జేయ నిశ్చయించి సుగ్రీవవిభీషణాదులను పిలిపింపు మని లక్ష్మణున కాదేశించెను. నైమిశమునందు యజ్ఞనముకు కావలసిన ద్రవ్యములను సమకూర్చిఏర్పాటులుచేయుటకు రాముఁడు భరతునినియోగించెను

సంవత్సరకాలము జరుగవలసిన యజ్ఞమునైమిశారణ్యమున ఆరంభమై యద్భుతముగా జరుగుచుండఁగా వాల్మీకి మహర్షియు శిష్యులతోకూడ బయలుదేరి వచ్చి యజ్ఞశాలకు అనతి దూరమున ఉటజములను నిర్మింపఁజేసి యందు వసింపఁజొచ్చెను.

శ్లో॥ వర్తమానే తథాభూతే యజ్ఞే చ పరమాద్భుతే।
సశిష్య ఆజగా మాశు వాల్మీకి ర్భగవా నృషిః॥ 1

శ్లో॥ స దృష్ట్వా దివ్యసంకాశం యజ్ఞ మద్భుతదర్శనమ్।
ఏకాంతే ఋషివాటానాం చకార ఉటజాన్ శుభాన్॥ 2

శ్లో॥ శకటాం శ్చ బహూన్ పూర్ణాన్ ఫలమూలాం శ్చ శోభనాన్
వాల్మీకివాటే రుచిరేఽ స్థాపయ న్నవిదూరతః॥ 3

(అస్థాపయన్-శిష్యాః అస్థాపయన్ ఇత్యర్థః)
ఉత్తరకాండ-సర్గ. 93

ఆయన కుశలవులను పిలిచి "ఋషివాటికలయందు బ్రాహ్మణ నివాసములందు, రథ్యలందు, రాజమార్గములయందు, రాజభవనములయందు, రాముని భవనద్వారమునందును, ఋత్విక్కుల యెదుటను రామాయణమును గాన మొనర్పుఁడు. ఇక్కడ నుండియే స్వాదుఫలములను గైకొనిపోయి భుజించుచు శ్రమ లేకుండ గాన మొనర్పుఁడు, మహర్షి పరివృతుడై రాముఁడు మిమ్ము పిలిచి వినగోరినచో దినమునకు ఇరువది సర్గలు గానము చేయుఁడు. సభలో నెవరైన నేదేని నీయఁబూనినచో వానికై లోభము నొందకుఁడు. ఫలమూలాశనులమైన మనకు ధనముతో పనియేమి? మీ రెవ రని రాముఁ డడిగినచో వాల్మీకి శిష్యుల మని మాత్రమే చెప్పుఁడు. ఆయనకు అవజ్ఞ కలుగకుండునట్లుగా, ( అనఁగా ఇతర

స్థలములందువలె లీలాపరిహాసభాషణాదికములను చేయక) గౌరవముతో కావ్యమును మొదటినుండి గానము చేయుఁడు. ధర్మము చేత రాజు సర్వభూతములకు తండ్రి కదా। కావున రేపు ప్రాతః కాలముననే మీరు బయలుదేరిపోయి తంత్రీలయ సమన్వితముగా కావ్యగానమును గావింపుఁడు" అనిపలికెను. వారు "అట్లే" అనిరి.

శ్లో॥ స శిష్యా వబ్రవీత్ హృష్టో యువాం గత్వా సమాహితౌ।
కృత్స్నం రామాయణం కావ్యం గాయతాం పరయా ముదా॥4

శ్లో॥ ఋషివాటేషు పుణ్యేషు బ్రాహ్మణావసథేషు చ
రథ్యాసు రాజమార్గేషు పార్థివానాం గృహేషు చ॥ 5

శ్లో॥ రామస్య భవనద్వారి యత్ర కర్మ చ కుర్వతే।
ఋత్విజా మగ్రత శ్చైవ తత్ర గేయం విశేషతః॥ 6

శ్లో॥ యది శబ్దాపయే ద్రామః శ్రవణాయ మహీపతిః।
ఋషీణా ముపవిష్టానాం యథాయోగం ప్రవర్తతామ్॥ 9

శ్లో॥ దివసే వింశతి స్సర్గా గేయా మధురయా గిరా।
ప్రమాణై ర్బహుభి స్తత్ర యథోద్దిష్టం మయా పురా॥ 10

శ్లో॥ యది పృచ్ఛేత్ స కాకుత్స్థో యువాం కస్యేతి దారకౌ।
వాల్మీకే రథ శిష్యౌ ద్వౌ బ్రూత మేవం నరాధిపమ్॥ 12

శ్లో॥ ఆది ప్రభృతి గేయం స్యాత్ న చావజ్ఞాయ పార్థివమ్।
పితా హి సర్వభూతానాం రాజా భవతి ధర్మతః॥ 14

ఉత్తరకాండ-సర్గ. 93

మఱునాఁడు వారు అగ్నిహోత్రముల నర్చించి అశ్వమేధ శాలకు పోదకు పోయి మహర్షుల సమాగమసభకు సమీపమున

కావ్యగానము నొనర్పఁ జొచ్చిరి. అది విని మహర్షు లందఱు బాష్పపూర్ణ నేత్రులై విస్మయముతో ప్రీతులై "అహెూ! ఏమి గీత మాధుర్యము! శ్లోకము లెంత మధురముగ నున్నవి! ఎప్పుడో జరిగి పోయిన సందర్భము కూడ ఇప్పుడు ప్రత్యక్ష మగునట్లుగ ప్రద ర్శింపఁబడినది" అని ప్రశంసింపఁ జొచ్చిరి. ఆ ప్రశంసలను విని కుశలవులు ఇంకను మధురముగా గాన మొనర్పఁ జొచ్చిరి. అప్పు డామహర్షులు సంతోషపారవశ్యమున కలశము వల్కలము కృష్ణా జినము మొదలుగా పెక్కువస్తువులను బహూకరించిరి. అట్లు ప్రతి దినము కుశలవులు అచ్చటికిపోయి మునిసముదాయములందు గాన మొనర్పఁజొచ్చిరి. కొందఱు "వాల్మీకిచే కీర్తింపఁబడిన యీ కథ ఆశ్చర్యముగా నున్నది; ఇది కవులకు పరమమైన యాధారము; సర్వగీతి ప్రకారములందును కోవిదులైన మీచేత నిది చక్కఁగా గానముచేయఁబడినది. ఇది వినువారికి శ్రుతి మనోహరముగా నుండుటయే కాక ఆయురభ్యుదయ ప్రదముగ నున్నది" అని ప్రశంసింపఁజొచ్చిరి.

శ్లో॥ సాధు సాధ్వితి తా వూచుః పరం విస్మయ మాగతాః।
తే ప్రీత మనస స్సర్వే మునయో ధర్మవత్సలాః 16

శ్లో॥ ప్రశశంసుః ప్రశ స్తవ్యౌ గాయమానౌ కుశీలవౌ।
అహో గీతస్య మాధుర్యం శ్లోకానాం చ విశేషతః॥ 17

శ్లో॥ చిర నిర్వృత్త మప్యేతత్ ప్రత్యక్ష మివ దర్శితమ్।
ప్రవిశ్య తా వుభౌ సుష్ఠు తథాభావ మగాయతామ్॥ 18

శ్లో॥ ఆశ్చర్య మిద మాఖ్యానం మునినా సంప్రకీర్తితమ్॥
.................................................................... 26

శ్లో॥ పరం కవీనా మాధారం సమాప్తం చ యథాక్రమమ్।
అభిగీత మిదం గీతం సర్వగీతిషు కోవిదౌ॥ 27

శ్లో॥ ఆయుష్యం పుష్టిజననం సర్వశ్రుతి మనోహరమ్॥
........................................................... ॥ 28

బాలకాండ-సర్గ 4

అట్లు కొన్నాళ్లు జరిగినతరువాత ఒకనాఁడు రాముఁడు రథ్యలయందు రాజమార్గముల యందు ప్రశంసింపఁబడుచున్న గాయకులను కుశలవులను చూచి తన నివాసమునకు తీసుకొని వచ్చి సచివసోదరపరివృతుఁడై కూర్చుండి భరత లక్ష్మణ శత్రుఘ్నులను జూచి, "దివ్యవర్చసులైన వీరిరువురు గానముచేయు విచిత్రార్థపదయుతమైన యాఖ్యానమును వినుఁడు" అని పలికి కుశలవులను గానమొనర్పఁడని ప్రోత్సహించెను, వారును తంత్రీలయసమన్వితముగా మనోహరముగా గాన మొనర్చిరి. అది సర్వశ్రుతి మనోహరమై హృదయమును గరగించుచు ఎల్లరకును శరీరములందు రోమాంచము గలుగునట్లొనర్చెను. గీతిచే సమలంకృతమై యపూర్వముగనున్న యా కావ్యమును విని విస్మితుఁడై యాగవిరామకాలమునందు పార్థివులను పండితులను పౌరాణికులను మహర్షులను, సంగీతాది కళాకోవిదులను, ఛందోవిదులను, శాస్త్రజ్ఞులను సమావేశమగునట్లుచేసి, ఆ మహాసభయందు కుశలవులను గానమొనర్పఁడని ప్రోత్సహించెను. మొదట రాముఁడు అంతఃపురమునందే వినఁదలఁచుకొని వారిని పిలుచుకొని వచ్చినను, కొంచెము విన్నతరువాత, అది ఎల్లరును వినుట ఆవశ్యకమని గ్రహించి మహాసభను ఏర్పాటుగావించెను. అక్కడ వారు మరల మొదటినుండి గాన మొనర్చి రన్నమాట.

శ్లో॥ ప్రశస్యమానౌ సర్వత్ర కదాచిత్తత్ర గాయకౌ। 28

శ్లో॥ రథ్యాసు రాజమార్గేషు దదర్శ భరతాగ్రజః।
స్వవేశ్మ చానీయ తతో భ్రాతరౌ స కుశీలవౌ॥ 29

శ్లో॥ ఉవాచ లక్ష్మణం రామః శత్రుఘ్నం భరతం తథా।
శ్రూయతా మేత దాఖ్యానం అనయో ర్దేవవర్చసోః॥ 32

శ్లో॥ విచిత్రార్థపదం సమ్య గ్గాయకౌ సమచోదయత్।
తౌ చాపి మధురం రక్తం స్వచిత్తాయతనిస్స్వనమ్॥ 33

శ్లో॥ తంత్రీలయవ దత్యర్థం విశ్రుతార్థ మగాయతామ్।
హ్లాదయత్ సర్వగాత్రాణి మనాంసి హృదయాని చ॥

బాలకాండ సర్గ. 4

శ్లో॥ తాం స శుశ్రావ కాకుత్స్థః పూర్వాచార్యవినిర్మితామ్।
అపూర్వాం పాఠ్యజాతిం చ గేయేన సమలంకృతామ్॥ 2

తిలకటీక॥ పూర్వాచార్యవినిర్మితామ్ - గాథకానాం గాన సిద్ధయే పూర్వాచార్యేణ భరతేన వినిర్మితామ్ అపూర్వాం - ప్రాగ శ్రుతాం; పాఠ్య జాతిం-పాఠ్యస్య గేయస్య జాతిం షడ్జాది స్వర రూప మితి కతకః-

శ్లో॥ ప్రమాణై ర్బహుభి ర్బద్ధాం తంత్రీలయసమన్వితామ్।
బాలాభ్యాం రాఘవ శ్శ్రుత్వా కౌతూహలపరోఽభవత్॥ 3

శ్లో॥ అథ కర్మాంతరే రాజా సమాహూయ మహామునీన్।
పార్థివాం శ్చ నరవ్యాఘ్రః పండితా న్నైగమాం స్తథా॥ 4

శ్లో॥ పౌరాణికాన్ శబ్దవిదో యే వృద్ధా శ్చ ద్విజాతయః।
స్వరాణాం లక్షణజ్ఞాం శ్చ ఉత్సుకాన్ ద్విజసత్తమాన్॥ 5

శ్లో॥ చిత్రజ్ఞాన్ వృత్తసూత్రజ్ఞాన్ గీతనృత్యవిశారదాన్।
ఏతాన్ సర్వాన్ సమానీయ గాతారౌ సమవేశయత్॥ 9
ఉత్తరకాండ-సర్గ. 94

కుశలవులను చూచి సభ్యు లిట్లనుకొనిరి. "వీరిద్దఱును రామునకు ప్రతిబింబములవలెనున్నారే! జటలు వల్కములు లేకున్నచో వీరికిని రామునకును భేదమే గుర్తింపఁజాలము." ఇట్లు వారు చెప్పుకొనుచుండఁగా కుశలవులు కావ్యమును నారదదర్శన సర్గముతో మొదలుపెట్టి మొదటి దినమున ఇరువది సర్గలు చదివిరి. అప్పటికి అపరాహ్ణమయ్యెను. అప్పుడు రాముఁడు చాల సంతోషించి పదునెనిమిదివేల బంగారు నాణెముల నిప్పించెను. అవి చూచి కుశలవులు విస్మితులై ఫలమూలాశనులమైన మాకు వీనితో పనియేమి?" అని పలికిరి. అందులకు ఎల్లరును విస్మితులైరి. అప్పుడు రాముఁడు ఈ కావ్యమునకు పరిమితి యెంత? ఈ మహాకావ్యమునకు కర్త ఎవరు? ఆయన నివాస స్థాన మేది? ఇప్పుడు ఎక్కడ నున్నాఁడు?" అని కుశలవులను ప్రశ్నించెను. ఈ మహాకావ్యమును రచించిన భగవానుఁడైన వాల్మీకిమహర్షి యజ్ఞవాట సమీపముననే యున్నాఁడు భార్గవుఁడైన యామహర్షి ఇరువదినాల్గువేల శ్లోకములతో పెక్కు ఉపాఖ్యానములతో, ఐదు వందల సర్గలతో, నీ చరిత్ర మంతయును ఈ మహాకావ్యమునందు రచించినాఁడు. నీకు దీనిని వినవలయునను కుతూహల మున్నచో యాగకాల విరామములందు నిది యొక ఉత్సవముగా వినుము" అని పలికిరి. రాముఁ డట్లే యని యాగశాల కరుగఁగా, కుశలవులు వాల్మీకి యొద్దకుపోయిరి.

శ్లో॥ తేషాం సంవదతాం తత్ర శ్రోతౄణాం హర్షవర్ధనమ్।
గేయం ప్రచక్రతుస్తత్ర తావుభౌ మునిదారకౌ॥ 10

శ్లో॥ తతః ప్రవృత్తం మధురం గాంధర్వ మతిమానుషమ్।
న చ తృప్తిం యయుః సర్వే శ్రోతారో గేయసంపదా॥ 11

శ్లో॥ హృష్టా మునిగణా స్సర్వే పార్థివా శ్చ మహౌజసః।
పిబంత ఇవ చక్షుర్భ్యాః పశ్యన్తిస్మ ముహుర్ముహుః॥ 12

శ్లో॥ ఊచుః పరస్పరం చేదం సర్వ ఏవ సమాహితాః।
ఉభౌ రామస్య సదృశౌ బింబా ద్బింబ మివోద్ధృతౌ॥ 13

శ్లో॥ జటిలౌ యది న స్యాతాం న వల్కలధరౌ యది
విశేషం నాధిగచ్ఛామో గాయతో రాఘవస్య చ॥ 14

శ్లో॥ ఏవం ప్రభాషమాణేషు పౌరజానపదేషు చ।
ప్రవృత్త మాదితః పూర్వసర్గం నారదదర్శితమ్॥ 15

శ్లో తతః ప్రభృతి సర్గాం శ్చ యావద్వింశ త్యగాయతామ్।
తతోఽపరాహ్ణసమయే రాఘవః సమభాషత॥ 16

## 11. సీతా శపథపట్టము

రాముఁ డాగీతమును పెక్కు దినములు వినెను. తుదకు ఆ గీతము వలననే కుశలవులు సీతా పుత్రులని తెలిసికొని సభా మధ్యమున దూతలను బిలిచి "సీత శుద్ధవర్తనము కలదై వీత కల్మష యైనచో మహామునియొక్క అనుమతితో ఆత్మశుద్ధిని ప్రక టించునుగాక! మీరు ఈ విషయమును వాల్మీకిమహర్షితో చెప్పి, ఆయన యభిప్రాయమును సీతయొక్క భావమును తెలిసికొని వచ్చి వేగముగా నాకుఁ దెలుపుడు; నాకును తనకును శుద్ధి యేర్ప డునట్లుగా మైథిలి రేపు ఉదయమే శపథమును గావించును గాక" అని చెప్పి పంపెను. వారు వెళ్ళి వాల్మీకి మహర్షికి ఆ మాట

లను చెప్పఁగా, అయన రాముని యభిప్రాయము నూహించి, "రాముఁడు చెప్పినట్లే సీత శపథము చేయును. స్త్రీకి పతియే దైవము కదా'' అని పలికెను. దూతలు వచ్చి రామున కావిషయమును తెలిపిరి. వెంటనే రాముఁడు సభ్యులను జూచి ''రేపు సీత శపథము చేయును; చూడఁదలఁచుకొన్నవారందఱును రావచ్చును'' అని ప్రకటించెను.

శ్లో॥ యది శుద్ధసమాచారా యది వా వీతకల్మషా।
కరో త్విహాత్మన శ్శుద్ధి మనుమాన్య మహామునిమ్॥ 4

శ్లో॥ ఛందం మునే శ్చ విజ్ఞాయ సీతాయా శ్చ మనోగతమ్।
ప్రత్యయం దాతుకామాయాః తత శ్శంసత మే లఘు॥ 5

శ్లో॥ శ్వః ప్రభాతే తు శపథం మైథిలీ జనకాత్మజా।
కరోతు పరిషన్మధ్యే శోధనార్థం మమైవ చ॥ 6

శ్లో॥ ఏవం భవతు భద్రం వో యథా వదతి రాఘవః।
తథా కరిష్యతే సీతా దైవతం హి పతిః స్త్రియః॥ 10

శ్లో తతః ప్రహృష్టః కాకుత్స్థః శ్రుత్వా వాక్యం మహాత్మనః।
ఋషీం స్తత్ర సమేతాం శ్చ రాజ్ఞ శ్చైవాభ్యభాషత॥ 12

శ్లో॥ భగవన్తః సశిష్యా వై సానుగా శ్చ నరాధిపాః।
పశ్యన్తు సీతాశపథం య శ్చైవాన్యోఽపి కాంక్షతే॥ 13

ఉత్తరకాండ-సర్గ. 95

మఱునాఁడు సీతా శపథమును వినుటకై రాజులు ఋషులు రాక్షసులు వానరులు పౌరజానపదులును విస్మయముతో వచ్చి చేరిరి. ఆసముదాయ మంతయు పర్వతమువలె నిశ్చలముగా

నుండెను. అంతట వాల్మీకి వెంట కృతాంజలియై తలవంచుకొని రామునే ధ్యానించుచు బాష్పకంఠయై సీత వచ్చెను. బ్రహ్మదేవుని వెంట వేదమువలె వచ్చుచున్న యామెను చూచి సభ్యులలో సాధువాదము ప్రబలెను.

శ్లో॥ తదా సమాగతం సర్వ మశ్మభూత మి వాచలమ్।
శ్రుత్వా మునివర స్తూర్ణం ససీత స్సముపాగమత్॥ 9

శ్లో॥ తమృషిం పృష్ఠత స్సీతా అన్వగచ్ఛ దవాఙ్ముఖీ।
కృతాంజలి ర్బాష్పగళా కృత్వా రామం మనోగతమ్॥ 10

శ్లో॥ తాం దృష్ట్వా శ్రుతి మాయాంతీం బ్రహ్మాణ మనుగామినీం।
వాల్మీకేః పృష్టత స్సీతాం సాధువాదో మహా నభూత్॥ 11

ఉత్తరకాండ—సర్గ. 96

వాల్మీకి సీతతో కూడ జనౌఘమధ్యమున ప్రవేశించి రామునితో నిట్లనెను, "ఓరామా! సువ్రత, ధర్మచారిణియునైన ఈ సీత అపవాదమువలన నాయాశ్రమసమీపమున వదలిపెట్టఁబడినది. లోకాపవాదభీతుఁడవైన నీకు ఈమె విశ్వాసమును కలిగింపఁగలదు. అందుల కనుమతింపుము. వీ రిరువురును నీపుత్రులు. సత్యమును చెప్పుచున్నాను. నేను ప్రచేతసునకు పదియవకుమారుఁడను. అనృతమును నేను మనస్సునందుకూడ తలంపను. వీరు నీ పుత్రులే, ఈ మైథిలి దుష్టురాలైనచో నేను పెక్కువేలేండ్లుగా గావించిన తపస్సుయొక్క ఫలమును పొందకుందునుగాక! నేను మనోవాక్కాయ కర్మములచేత నెట్టికిల్బిషమును చేయలేదు. ఈమె పాపరహితయగుచో నే నట్టి నిషిద్ధకర్మనుత్యజించుటవలన కలుగు ఫలమును పొందుదును గాక! నేను ఇంద్రియమనశ్శక్తులతో సీత పరిశుద్ధురాలని తెలిసికొనియే గంగాతీరమున త్వ క్తయైయున్న

యీామెను ఆశ్రమమునకు తీసికొనివచ్చితిని. లోకాపవాదభీతుఁడ వైన నీకు విశ్వాసమును గలిగించుటకై ఆమె యిప్పుడు శపథము చేయఁగలదు."

శ్లో॥ తతో మధ్యే జనౌఘస్య ప్రవిశ్య మునిపుంగవః।
సీతాసహాయో వాల్మీకి రితి హోవాచ రాఘవమ్॥ 14

శ్లో॥ ఇయం దాశరథే సీతా సువ్రతా ధర్మచారిణీ।
అపవాదా త్పరిత్యక్తా మమాశ్రమసమీపతః॥ 15

శ్లో॥ లోకాపవాద భీతస్య తవ రామ మహావ్రత।
ప్రత్యయం దాస్యతే సీతా తా మనుజ్ఞాతు మర్హసి॥ 16

శ్లో॥ ఇమౌ తు జానకీపుత్రౌ ఉభౌ చ యమజాతకౌ।
సుతౌ తవైవ దుర్ధర్షౌ సత్య మేత ద్బ్రవీమి తే॥ 17

శ్లో॥ ప్రచేతసోఽహం దశమః పుత్రో రాఘవనందన।
న స్మరా మ్యనృతం వాక్యమిమౌ తు తవపుత్రకౌ॥ 18

శ్లో॥ బహువర్ష సహస్రాణి తపశ్చర్యా మయా కృతా।
నోపాశ్నీయాం ఫలం తస్యాః దుష్టేయం యది మైథిలీ॥ 19

శ్లో॥ మనసా కర్మణా వాచా భూతపూర్వం న కిల్బిషమ్।
తస్యాహం ఫల మశ్నామి అపాపా మైథిలీ యది॥ 20

ఉత్తరకాండ-సర్గ. 96

అప్పుడు రాముఁడు సీతను జూచి వాల్మీకితో ప్రాంజలియై యిట్లనెను. "ధర్మవిదులైన మీరు చెప్పిన దంతయు నిజమే, మీ మాటలను నేను విశ్వసించుచున్నాను. పూర్వము దేవతల సన్నిధియందు సీత శపథ మొనర్చినది. తరువాతనే ఆమెను నేను

ఇంటికి తీసికొనివచ్చితిని. కాని లోకాపవాదము బలీయ మగుటచే ఆమె పారిశుద్ధ్యము నెఱింగియు ఆమెను వదలిపెట్టవలసి వచ్చినది. అందులకు మీరు నన్ను క్షమింపవలయును. ఈ కుశలవులు నాపుత్రు లని యెఱుంగుదును. జగన్మధ్యమున పరిశుద్ధురాలుగా సీత భావింపబడినచో నా కామెయందు ప్రీతి కలుగును." రాముఁ డిట్లు చెప్పుచుండఁగా బ్రహ్మదేవుని పురస్కరించుకొని సిద్ధులు సాధ్యులు దేవతలు దేవర్షులును అచ్చటికి వచ్చిరి. వారందఱను జూచి రాముఁడు, "ఓసురశ్రేష్ఠులారా! ఋషివాక్యముల చేతనే నాకు విశ్వాసము కలిగినది. అయినను జగత్తునందు వైదేహీపవిత్రురాలుగా ప్రకటితయైనచో నా కామెయందు ప్రీతి కలుగును" అని పలికెను.

శ్లో॥ ఏవ మేత న్మహాభాగ యథా వదసి ధర్మవిత్।
ప్రత్యయస్తు మమ బ్రహ్మన్ తవ వాక్యై రకల్మషైః॥ 2

శ్లో॥ ప్రత్యయ శ్చ పురా వృత్తో వైదేహ్యా స్సురసన్నిధౌ।
శపథ శ్చ కృత స్తత్ర తేన వేశ్మ ప్రవేశితా॥ 3

శ్లో॥ లోకాపవాదో బలవాన్ యేన త్యక్తా హి మైథిలీ।

శ్లో॥ సేయం లోకభయా ద్బ్రహ్మన్ అపాపే త్యభిజానతా।
పరిత్యక్తా మయా సీతా త ద్భవాన్ క్షన్తు మర్హసి॥ 4

శ్లో॥ జానామి చేమౌ పుత్రౌ మే యమజాతౌ కుశీలవౌ।
శుద్ధాయాం జగతో మధ్యే మైథిల్యాం ప్రీతి రస్తు మే॥ 5

ఉత్తరకాండ-సర్గ. 97

అప్పు డెల్లరును సంభ్రాంతు లగుచుండఁగా వాయుదేవుఁడు దివ్యపరిమళముతో మెల్లఁగా వీచుచు ఆహ్లాదమును కలిగింపఁ

జొచ్చెను. వచ్చినవారి నందఱను ఒక్కసారి కలయఁజూచి కాషాయవాసినియైన సీత ప్రాంజలియై తలవంచి భూమిపై చూపు నిలిపి యిట్లు పలికెను. "నేను రాఘవుని తప్ప అన్యుని మనస్సు నందు కూడ తలంపనేని భూదేవి నాకు మార్గ మొసంగును గాక! రాముని కంటె నన్యుని భావించి యెఱుఁగ నను నీమాట సత్య మైనచో భూదేవి నాకు మార్గమొసంగును గాక!" ఇట్లామె పలుకు చుండగా భూమిలోపలినుండి గొప్పసర్పములు తమ పడగలపై వహించి తెచ్చిన దివ్యరత్న విభూషితమైన దివ్యసింహాసనము పైకి వచ్చెను. అందున్న భూదేవి సీతను రెండు చేతులతో గైకొని స్వాగతము పలికి సింహాసనముపై కూర్చుండఁబెట్టుకొనెను. ఆమెతో రసాతలమున కేగుచున్న సీతపై దివ్యమైన పుష్పవృష్టి కురిసెను. దేవతల సాధువాదములు ప్రబలెను. యజ్ఞవాటమునందున్నవారు విస్మితులైరి. కొందఱు చింతా నిమగ్నులైరి; మరికొందఱు శూన్య హృదయులై రాముని చూచుచుండఁగా మఱికొందఱు సీతవైపు చూచుచుండిరి.

శ్లో॥ సర్వాన్ సమాగతాన్ దృష్ట్వా సీతా కాషాయవాసినీ।
అబ్రవీత్ ప్రాంజలి ర్వాక్యం అధోదృష్టి రవాఙ్ముఖీ॥ 13

శ్లో॥ యథాహం రాఘవా దన్యం మనసాపి న చింతయే।
తథా మే మాధవీ దేవి వివరం దాతు మర్హతి॥ 14

శ్లో॥ మనసా కర్మణా వాచా యథా రామం సమర్చయే।
తథా మే మాధవీ దేవీ వివరం దాతు మర్హతి॥ 15

శ్లో॥ యథైత త్సత్య ముక్తం మే వేద్మి రామా త్పరం న చ।
తథా మే మాధవీ దేవీ వివరం దాతు మర్హతి॥ 16

శ్లో॥ తథా శపన్త్యాం వైదేహ్యాం ప్రాదురాసీ త్తదద్భుతమ్।
భూతలా దుత్థితం దివ్యం సింహాసన మనుత్తమమ్॥ 17

శ్లో॥ ధ్రియమాణం శిరోభిస్తు నాగై రమితవిక్రమైః।
దివ్యం దివ్యేన వపుషా దివ్యరత్నవిభూషితైః॥ 18

శ్లో॥ తస్మింస్తు ధరణీదేవీ బాహుభ్యాం గృహ్య మైథిలీమ్।
స్వాగతే నాభినం ద్యైనాం ఆసనే చోపవేశయత్॥ 19

శ్లో॥ తా మాసనగతాం దృష్ట్వా ప్రవిశన్తీం రసాతలమ్।
పుష్పవృష్టి రవిచ్ఛిన్నా దివ్యా సీతా మవాకిరత్॥ 20

శ్లో॥ సాధుకార శ్చ సుమహాన్ దేవానాం సహసోత్థితః।
సాధు సాధ్వితి వై సీతే యస్యాస్తే శీల మీదృశమ్॥ 21

శ్లో॥ యజ్ఞవాటగతా శ్చాపి మునయ స్సర్వ ఏవ తే।
రాజాన శ్చ నరవ్యాఘ్రా విస్మయా న్నోపరేమిరే॥ 23

శ్లో॥ కేచి ద్వినేదు స్సంహృష్టాః కేచి ద్ధ్యానపరాయణాః।
కేచి ద్రామం నిరీక్షన్తే కేచిత్ సీతా మచేతసః॥ 25

శ్లో॥ సీతాప్రవేశనం దృష్ట్వా తేషా మాసీత్ సమాగమః।
తన్ముహూర్త మి వాత్యర్థం సమం సమ్మోహితం జగత్॥ 26

ఉత్తరకాండ సర్గ. 97

ఇచ్చట ఒక విషయము గమనింపఁ దగియున్నది. వాల్మీకి వెంట వచ్చుచున్న సీతను జూచి సమావిష్టులైన జను లందఱు, ''బాగు! బాగు" అని కలకలము గావించిరే కాని (సాధువాదో మహా నభూత్) ఒకరైనను సీతారాములయెడల సానుభూతిని ప్రకటింపలేదు. అందఱును సీతాశపథమువలన జరుగఁబోవు అద్భుత

మును చూచుటయందే నిమగ్నులై యుండిరి. అంతేకాదు. వాల్మీకి శపథ మొనర్చి, ''ఈసీత పవిత్రురాలు; ఈ కుశలవులు రాముని పుత్రులు'' అని యుద్ఘాటించుచున్నప్పుడు, వారు వాల్మీకియందు గౌరవ ముంచి, ''నిజమే; సీత పవిత్రురాలు; ఆమె శపథము చేయ నక్కఱలేదు. సీతారాములకు జయము అని యొక్కరును ప్రశంసింపలేదు. ''నేను మహర్షి వాక్యములను నమ్ముచున్నాను. పూర్వమే యీామె దేవతలముందు శపథమొనర్చి పవిత్రురాలుగా నిరూపితయైన తరువాతనే నేను ఈమెను అయోధ్యకు తీసికొని వచ్చితిని" అని రాముఁడు చెప్పుచున్నప్పుడు కూడ వారు విశ్వాసమును ప్రకటింపలేదు. దీనినిబట్టి ప్రజాభిప్రాయము ఒక్కొక్కప్పుడు ఎంత మూర్ఖముగ కఠినముగ నుండునో అన్న విషయము గ్రహింపఁదగియున్నది. ఈ యభిప్రాయము నంతను మహర్షి ఒక్కమాటలో వ్యక్తీకరించినాఁడు. ఆ జనసముదాయ మంతయు "ఱాయియైన కొండవలె నున్నది" (అశ్మభూత మి వాచలమ్) కొండ ఱాయిగా అగుట యేమి? సాధారణముగా కొండలు ఱాళ్ల సముదాయముగా నుండును. అప్పుడు రాళ్లకు మధ్యలో కొంత ఖాళీస్థలము, కొన్నిచోట్ల పచ్చిక, చెట్లు, జంతువులును ఉండును, ఈ జనసముదాయము అటువంటి కొండకాదు. ఒక్కటే పెద్దగండశిల కొండగా నైనచో ఎట్లుండునో ఆజనసముదాయము అట్లున్నది. అటువంటి కొండయందు ఖాళీస్థలము పచ్చిక చెట్లు మొదలుగా నేవియు నుండవు. కొండ అంతయు ఒక్కటే ఱాయి. ఆజనసముదాయము అట్టి కొండవలె నిశ్చలముగా నుండుటయే కాక కరుణ సానుభూతి దయ దాక్షిణ్యము మొదలగు భావములకు అవకాశములేని కఠిన హృదయమయమై యున్నది.

మఱి బ్రహ్మాదిదేవత లైనను, ఈ సీత పవిత్రురాలు; శపథమక్కఱ లేదు" అని ప్రకటించి యుండవచ్చును గదా! కాని

ఆ ప్రజలు దేవతలు చెప్పినను వినునట్టిస్థితిలో లేరు. "రావణా సుర సంహారమున మీకు రాముఁడు మేలు చేసినాఁడు. అందు వలన మీరు సీతారాములకు అనుకూలముగా చెప్పుచున్నారు" అని వారు తలంతురే కాని "సీత శపథము చేయ నక్కఱలే" దని యుద్ఘోషింపరు. వాల్మీకి శపథమును, రాముని వాక్యమును లెక్క పెట్టని యీ ప్రజలు తమ వాక్యములను సైతము విశ్వసింప రని దేవతలు ఊరక చూచుచుండిరి.

ఈ సందర్భమున మహర్షి యుపయోగించిన మఱియొక విశేషణము కూడ గమనింపదగియున్నది. వాల్మీకి వెంట వచ్చు చున్న సీతాదేవి కాషాయవస్త్రములను ధరించియున్నది. ( సీతా కాషాయవాసినీ). భర్తను కలిగియున్న స్త్రీ కాషాయ వస్త్రములను ఎట్లు ధరించినది? వాన ప్రస్థులు భార్యలతోకూడ వనములలో నుందురు. భర్తలు చనిపోయినప్పుడు కాని సన్న్యసించినప్పుడు కాని, వారి బార్యలు కాషాయవస్త్రములను ధరించుచుందురు. సన్న్యసించిన వాఁడు భార్యను వదలినట్లే రాముఁడు శాశ్వతముగా తన్ను వదలిపెట్టినట్లే సీత భావించుచున్నది. ప్రజాభిప్రాయమునకు వెఱచి రాముఁడు తన్ను వదలిపెట్టినాఁడు. ఆ ప్రజాభిప్రాయము మాఱుట అసంభవము. దేవతల సమక్షమున జరిగిన యగ్ని ప్రవేశమును ప్రజలు నమ్ముట లేదు. రాముని యభిప్రాయము ననుసరించి ప్రజలు నమ్ముటకొఱకు తాను ఏదైన ఒకశపథమును చేసి దేవతలచేత చెప్పించినను వారునమ్మరు. లేదా మరల అగ్ని ప్రవేశముచేసి అందుండి వెలుపలికి వచ్చి తన పరిశుద్ధిని నిరూ పించినను, రాముని వలన ఉపకారము పొందిన దేవతా గణము లలో అగ్నిహోత్రుఁడు కూడ చేరినవాఁడే, రామునియందలి పక్ష పాతముతో తన్ను రామునకు కానుకగా అప్పగించుచున్నాఁడనియే

తలంతురు. అట్లు గాక ఇప్పుడు చూచుచున్న ప్రజలు తన్ను పరిశుద్ధురాలినిగా అంగీకరించినను, కొంతకాలమైన తరువాత తరము మాఱినచో, వీరి పుత్రులో పౌత్రులో ఈ యగ్నిప్రవేశమును నమ్మకపోవచ్చును. అప్పుడు వారు కోరినచో మరల శపథమో అగ్నిప్రవేశమో చేయవలసియేయుండును. కావున ఈ ప్రజాభిప్రాయమును చక్కదిద్దుట అసంభవము; రామునితో మరల తాను సంసారము చేయఁగలుగుటయు అసంభవమే. అందువలన సన్న్యసించినవాని భార్యవలె తానును విరక్తినొంది కాషాయవస్త్రములు ధరించి తాపసిగా నుండుటయే కర్తవ్యమని ఆమె నిశ్చయించుకొనెను. కావుననే ఆమె "కాషాయవాసిని" యయ్యెను. ఈ కారణముచేతనే ఆమె తన పరిశుద్ధిని ప్రకటించుచు భూదేవి తన్ను లోకాంతరమునకు గొనిపోవలయు ననియే ప్రార్థించెను.

## 12. బ్రహ్మదేవోపదేశ ఘట్టము

సీత రసాతలమున కేగినంతనే వానరులు ఆక్రోశించిరి. రాముఁడు దండకాష్ఠముపై నొఱఁగి కన్నీరు కార్చుచు తలవంచి దీనుఁడై పరమ దుఃఖితుఁడయ్యెను. ఆయన చాలసేపు కన్నీరు కార్చుచు రోదన మొనర్చి క్రోధావిష్టుఁడై యిట్లనెను. "'అభూతపూర్వమైన దుఃఖము నా మనస్సును తాఁకుచున్నట్లున్నది. నేను చూచుచుండఁగనే లక్ష్మీదేవివంటి సీత అంతర్హితురాలైనది. వెనుక సముద్రమున కవ్వలనున్న లంకయందుండి కన్పింపకున్నప్పుడు, అక్కడనుండి కూడ నేనామెను తీసుకొనివచ్చితిని; ఈ మహీతలమునుండి తెచ్చుట యెంతపని! ఓదేవీ! వసుంధరా! నా సీతను నాకు తెచ్చియిమ్ము. క్రుద్ధుఁడ నైనచో ఎట్టివాఁడ నగుదునో నన్ను నీ వెఱుంగుదువు. జనకుఁడు నీయొద్దనుండి సీతను పొంది యుండుట వలన నీవు నాకు అత్తవే యగుదువు కదా! కావున

సీతను తెచ్చియిమ్ము. లేదా! నాకు కూడ మార్గము నొసంగుము. పాతాలమునఁ గాని, స్వర్గమునఁగాని ఆమెతో కూడియుందును. సీతను తీసుకొనిరమ్ము; నే నామె యదర్శనమువలన క్రోధమత్తుఁడనై యున్నాను. సీతను చెక్కుచెదరకుండ నాకర్పింపవేని పర్వతారణ్యములతో కూడ నీ రూపుమాపి సర్వము జలమయ మొనరింతును''

శ్లో॥ దండకాష్ఠ మవష్టభ్య బాష్పవ్యాకులితేక్షణః
అవాక్శిరా దీనమనా రామో హ్యాసీ త్సుదుఃఖితః॥ 2

శ్లో॥ స రుదిత్వా చిరం కాలం బహుశో బాష్ప ముత్సృజన్।
క్రోధశోకసమావిష్టో రామో వచన మబ్రవీత్॥ 3

శ్లో॥ అభూతపూర్వం శోకం మే మనః ప్రస్రష్టు మివేచ్ఛతి।
పశ్యతో మే యథా నష్టా సీతా శ్రీ రివ రూపిణీ॥ 4

శ్లో॥ సాఽదర్శనం పురా సీతా లంకాపారే మహోదధేః।
తత శ్చాపి మయా నీతా కింపున ర్వసుధాతలాత్॥ 5

శ్లో॥ వసుధే దేవీ భవతి సీతా నిర్యాత్యతాం మమ।
దర్శయిష్యామి వా రోషం యథా మా మవగచ్ఛసి॥ 6

శ్లో॥ కామంశ్వశ్రూ ర్మమైవ త్వం త్వత్సకాశాత్తు మైథిలీ।
కర్షతా ఫాలహస్తేన జనకే నోద్ధృతా పురా॥ 7

శ్లో॥ తస్మా న్నిర్యాత్యతాం సీతా వివరం వా ప్రయచ్ఛ మే।
పాతాళే నాకపృష్ఠే వా వసేయం సహిత స్త్వయా॥ 8

శ్లో॥ ఆనయ త్వం హి తాం సీతాం మత్తోఽహం మైథిలీకృతే।
న మే దాస్యసి చే త్సీతాం యథారూపాం మహీతలే॥ 9

శ్లో॥ సపర్వతవనాం కృత్స్నాం వ్యథయిష్యామి తే స్థితిమ్।
నాశయిష్యా మ్యహం భూమిం సర్వ మాపో భవన్త్విహ॥
ఉత్తరకాండ సర్గ. 98

ఇట్లు రాముఁడు శోకక్రోధావిష్టుఁడై పలుకుచుండఁగా పరమేష్ఠి రాము నోదార్చుచు నిట్లు పలికెను. "రాఘవా! రామా! నీ విట్లు సంతాపము నొందఁదగదు. నీవు నీపూర్వస్థితిని, అప్పుడు గావించిన యాలోచనమును స్మరింపుము. నీకు నేను బోధించుట లేదు. వైష్ణవమైన నీ స్వరూపమును ఈక్షణమున స్మరింపుము. సాధ్వియైన సీత నీపూర్వరూపమును స్మరించుచు నిన్నాశ్రయించుట వలని తపోబలముచే సుఖముగా నాగలోకమునకు చేరినది. స్వర్గము నందు మీకు మరల సంగమము కలుగును. ఇప్పు డీపరిషన్మధ్యమున నేను చెప్పుచున్న దానిని గ్రహింపుము. నీవు విన్న యీ యుత్తమకావ్యమే నీకు సర్వము వ్యాఖ్యానింపఁగలదు. నీజననమాదిగా నీకు కలిగిన సుఖదుఃఖముల నన్నిటిని వాల్మీకి ఇందు కూర్చినాఁడు. ఉత్తరకథయును రచింపఁబడియున్నది. ఈ యాదికావ్యమంతయు నీ చరిత్రయందు ప్రతిష్ఠితమై యున్నది. నీవుకాక మఱియొకఁడు కావ్యములందు యశోభాజనుఁ డగుటకు అర్హుఁడు కాఁడు. అజ్ఞానమూలకప్రలాపరహితమై సత్యవాక్యమై దివ్యాద్భుతమైన యీ కావ్యమును నేను దేవతలతోకూడ వింటిని. నీవు ఋషులతో కూడ కావ్యశేషమును వినుము"

శ్లో॥ రామ రామ న సంతాపం కర్తు మర్హసి సువ్రత।
స్మర త్వం పూర్వకం భావం మంత్రం చామిత్రకర్శన॥ 12

శ్లో॥ న ఖలు త్వాం మహాబాహో స్మారయేయ మనుత్తమమ్।
ఇమం ముహూర్తం దుర్ధర్ష స్మర త్వం జన్మ వైష్ణవమ్॥13

శ్లో॥ సీతా హి విమలా సాధ్వీ తవ పూర్వాపరాయణా।
నాగలోకం సుఖం ప్రాయాత్ త్వదాశ్రయతపోబలాత్॥14

శ్లో॥ స్వర్గ తే సంగమో భూయః భవిష్యతి న సంశయః।
అస్యా స్తు పరిషన్మ ధ్యే య ద్బ్రవీమి నిబోధ తత్ 15

శ్లో॥ ఏత దేవ హి కావ్యం తే కావ్యానా ముత్తమం శ్రుతమ్।
సర్వం విస్తరతో రామ వ్యాఖ్యాస్యతి న సంశయః॥ 16

శ్లో॥ జన్మప్రభృతి తే వీర సుఖదుఃఖోపసేవనమ్।
భవిష్య దుత్తరం చేహ సర్వం వాల్మీకినా కృతమ్॥ 17

శ్లో॥ ఆదికావ్య మిదం రామ త్వయి సర్వం ప్రతిష్ఠితమ్।
న హ్యన్యోఽర్హతి కావ్యానాం యశోభా గ్రాఘవా దృతే॥ 18

శ్లో॥ శ్రుతం మే పూర్వ మేత ద్ధి మయా సర్వం సురైః సహ।
దివ్య మద్భుతరూపం చ సత్యవాక్య మనావృతమ్॥ 19

గో। టీక. అనావృతమ్ - అజ్ఞానావరణరహితమ్।

శ్లో॥ స త్వం పురుషశార్దూల ధర్మేణ సుసమాహితః।
శేషం భవిష్యం కాకుత్స్థ కావ్యం రామాయణం శృణు॥20

ఉత్తర - సర్గ - 98

ఇట్లు పలికి యా త్రిభువనేశ్వరుఁడు దేవతలతో తన లోకమున కరిగెను. బ్రహ్మలోకమునుండి వచ్చిన ఋషులు ఆయన యనుమతితో కావ్యశ్రవణమునకై యజ్ఞవాటముననే నిలిచి పోయిరి. వారి కుతూహలమును గమనించి రాముఁడు వాల్మీకిని జూచి, “భగవానుడా! “భవిష్యద్విషయమైన యుత్తరగ్రంథమును బ్రహ్మలోకనివాసులైన ఋషులు వినఁగోరుచున్నారు. కావున రేపు

కావ్యగానము జరుగునుగాక" అని జనసముదాయమును వీడి కుశలవులను గైకొని పర్ణశాల కేగి సీతను గూర్చియే శోకించుచు ఆరాత్రిని గడిపెను.

శ్లో॥ యే చ తత్ర మహాత్మాన ఋషయో బ్రాహ్మలౌకికాః
బ్రహ్మణా సమనుజ్ఞాతా న్యవర్తన్త మహాజనః॥ 24

శ్లో॥ ఉత్తరం శ్రోతుమనసో భవిష్యం యచ్చ రాఘవే

.... .... .... .... .... .... .... .... .... .... .... .... ....

శ్లో॥ తం జనౌఘం విసృజ్యాథ పర్ణశాలా ముపాగమత్।
తా మేవ శోచత స్సీతాం సా వ్యతీతా చ శర్వరీ॥ 28

ఉత్తర - సర్గ - 98

మఱునాఁడు ప్రభాతమున పరమర్షులతో గూడ రాముఁడు ఉత్తరకావ్యమును సమగ్రముగా వినెను. ఆయజ్ఞమును పూర్తి చేసిన పిమ్మట శ్రీరాముఁడు సీతవియోగమున శూన్యహృదయుఁడై మఱియొకపత్నిని వరింపకుండెను. కాంచనమైన జానకీప్రతిమనే పత్నిస్థానమున నిలిపి రాముఁడు వాజపేయములను, అగ్నిష్టోమాతిరాత్రములను గావించెను. పదివేలసంవత్సరములు వందల కొలఁదిగ అశ్వమేధములను చేయుచు ధర్మము సుప్రతిష్ఠితముగా రాజ్యపాలనము చేయుచుండెను. చాలాకాలమునకు పుత్రపౌత్ర పరివృతయై కౌసల్య కాలధర్మము నొందెను. సుమిత్ర కైకేయియు స్వర్గమున కేగిరి. రాముఁడు తల్లిదండ్రులకు పారలౌకికములైన కర్మల నొనరించుచు యజ్ఞములచే ధర్మమును వర్ధిల్లఁజేయుచు వేలకొలఁది సంవత్సరములు సుఖముగా నుండెను.

శ్లో॥ న సీతయా పరాం భార్యాం వవ్రే స రఘునందనః।
యజ్ఞే యజ్ఞే చ పత్న్యర్థం జానకీ కాంచనీ భవత్॥

శ్లో॥ దశవర్ష సహస్రాణి వాజిమేధా న థాకరోత్।
వాజపేయాన్ దశగుణాన్ స్తథా బహుసువర్ణకాన్॥

శ్లో॥ ఏవం స కాల స్సుమహాన్ రాజ్యస్థస్య మహాత్మనః।
ధర్మే ప్రయతమానస్య వ్యతీయా ద్రాఘవస్య చ॥

శ్లో॥ ఏవం వర్షసహస్రాణి బహూ న్యథ యయు స్సుఖమ్।
యజ్ఞై ర్బహువిధం ధర్మం వర్ధయానస్య సర్వదా॥

ఉత్తరకాండ—సర్గ. 99

## 13. బ్రహ్మవిద్భేదములు

పై సందర్భమున శ్రీరాముఁడు శోకక్రోధావిష్టుఁ డయ్యెనని తెలియుచున్నది. మఱి ఆయన తత్త్వజ్ఞుఁ డగునా? తత్త్వజ్ఞుఁ డనఁగా జీవన్ముక్తుడు; జీవించుచుండియు ముక్తుఁడైనవాడు(జీవన్ అపి ముక్తః జీవన్ముకః)సుఖదుఃఖానుభవమే జీవనలక్షణము. సుఖమో దుఃఖమో ప్రారబ్ధవశమున సంభవించుచున్నప్పుడు, అవి తనస్వరూపము కావని నిత్యమైన యానందమే తనస్వరూప మని యెవఁడు దృఢముగ తెలిసికొనియుండునో, వాఁడు జీవన్ముక్తుఁడు. నాటకము జరుగుచున్నప్పుడు, అందులో నొకపాత్రమఱి యొకపాత్రను చంపుచుండఁగా అది నాటకము అని తెలియని వాఁడు మిగుల నుద్వేగమును పొందును; తెలిసినవాఁడు ఉద్వేగమును పొందక పోఁగా రసమును అనఁగా ఆనందమును పొందుచున్నాఁడు. కాని అది నాటక మని తెలిసినవాఁడు కూడ కొన్ని కొన్ని సందర్భములతో కలఁత నొందినను, వెంటనే యిది నాట

కము కదా యని స్మరించి స్వస్థత నొందుటయు కలదు. అట్లే తత్త్వజ్ఞులు కూడ తీవ్రములైన దుఃఖములు సంభవించినప్పుడు వెంటనే శోకక్రోధపరవశు లగుటయు, తరువాత మరల నిత్యమైన యానందమగు తమ స్వరూపమును స్మరించి స్వస్థు లగుచుండు టయు కలదు లక్షలయేండ్లు విస్తృతములైన మహర్షుల జీవితము లలో ఇట్టి సంఘటనములు ఎప్పుడో యొకప్పుడు సంభవించు చుండును. మేఘములు సూర్యునివలె, అవి తాత్కాలికముగా వారిస్వరూపమును మఱుఁగు పఱచినను, నిరంతరము కప్పి యుంచలేవు. సాధారణులు గుణత్రయాత్మకమైన మాయచే నిరం తరము అవృతులై యుండగా తత్త్వజ్ఞులు సహజముగా మాయా తీతులై ఆత్మానందులై ఎప్పుడో యొకప్పుడు శోకక్రోధములకు లోనగుచుందురు. వసిష్ఠమహర్షి పుత్రశోకమున మహాదుఃఖము నొందెను. దశరథుఁడు మాటతప్పఁగా విశ్వామిత్రుడు కోపించెను. శంకరాచార్యులవారు తల్లికి కర్మలు చేయుసందర్భమున వ్యతిరే కించిన జ్ఞాతులపై కోపించి శపించెను. వివేకానందుఁడు తనకు లేఖకుఁడుగానున్న గుడ్విన్‌మహాశయుడు మరణించినప్పుడు అమి తముగ దుఃఖించెను. అప్పు డెవరో అక్షేపింపఁగా 'జ్ఞాని యనఁగా హృదయమే లేనిబాయిఅప్ప కాదు" అని ఆయన సమాధానము చెప్పెను. అయన కోపించినసన్నివేశములును పెక్కు కలవు. కావున తాత్కాలికములైన శోకక్రోధములచే రూఢమైన తత్త్వజ్ఞ తకు భంగమేమియును లేదు. విద్యారణ్యస్వామి వారు ఇట్లు చెప్పిరి. బ్రహ్మవేత్తలు వ్యవహారప్రధానుఁడు వివేకప్రధానుఁడు సమాధిప్రధానుఁడు అని మూఁడు విధములుగా నుందు రని చెప్పిరి. ప్రారబ్ధవశమున రాజ్యపాలనము మొదలగు నధికారము లయందున్న వాఁడు తాత్కాలికములైన హర్షశోకములకు మూఢునివలెనే, లోనగుచుండును. దీని నుద్దేశించియే "పశువులతో

సామ్యమువలన' అని భాష్యకారులు చెప్పిరి. కృష్ణునిచే బోధింప బడిన యర్జునుఁడు, వసిష్ఠబోధితుఁడైన శ్రీరాముఁడును ఇట్టివారే, వివేక ప్రధానుఁడైనవాఁడు ఇంద్రియములను జయించి పూర్వకర్మ వశమున కలుగుచుండు హర్షశోకములను అప్పటికప్పుడే వివేకము చేత తొలఁగించుకొనును. సమాధి ప్రధానునకు హర్షశోక ప్రసక్తియే లేదు. కావున శ్రీరాముఁడు తాత్కాలికముగా శోకక్రోధము లకు లోనైనను ఆయనకు సహజమైన యాత్మానందమునకు లోపము లేదు.

"త్రివిదో హి బ్రహ్మవిత్ లోకవ్యవహారప్రధానో వివేక ప్రధానః సమాధిప్రధాన శ్చేతి। అరబ్ధ కర్మవశాత్ రాజ్యాదిషు యోఽధి కారీ స వ్యవహారప్రధానః॥ స చ మూఢవత్ తాత్కాలికా భ్యాం హర్షశోకాభ్యాం అభిభూయతే ఏవ। త మేత మభిలక్ష్య భాష్యకారా ఆహుః- "పశ్వాదిభి శ్చావిశేషాత్" ఇతి। రాజ్యాధికార వశా దేవ కృష్ణేన బోధితః అర్జునః వసిష్ఠేన బోధితో రామ శ్చ వ్యావహారికహర్షం శోకం చ ప్రాప్తవంతౌ। వివేక ప్రధాన స్తుధీరో భూత్వా ఇంద్రియాణి విజిత్య తదా తదా ప్రసక్తౌ హర్షశోకౌ వివేకేన పరిత్యజతి। సమాధి ప్రధానస్య తు హర్షశోక ప్రసంగ ఏవ నాస్తి॥

శ్రీ విద్యారణ్యస్వామినః తైత్తిరీ యారణ్యకభాష్యపీఠికాయామ్,
464 పుట.

శ్రీరాముఁడు తాత్కాలికముగా శోకక్రోధములకులోనైనను ఆయావేశము తొలఁగినంతనే ఆయన తనకు సహజమైన యాత్మ జ్ఞానమును ఆత్మానందమును పొందుచున్నాఁడని చెప్పుచున్నారు. కాని అసలు అయన ఆత్మజ్ఞానమును పొందినట్లుగా వాల్మీకి ఎచ్చటనైన నిరూపించియున్నాఁడా? అర్జునునకు శ్రీకృష్ణుఁడు

బోధించినట్లు శ్రీరాముఁడు ఎవ్వరికిని తత్త్వమును బోధించినట్లు గాని, ఆయన వసిష్ఠుని వలననో విశ్వామిత్త్రునివలననో. తత్త్వోపదేశమును పొందినట్లు గాని, వాల్మీకి రామాయణమునందు ఎచ్చటను నిరూపింపలేదు. ఇంక, రావణ సంహారమునకు తరువాత ఇప్పుడు సీత పరలోకమునకు పోయిన తరువాత బ్రహ్మదేవుఁడు వచ్చి "నీవు విష్ణుదేవుఁడవు" అని స్తోత్రము చేయుటవలన రాముఁడు ఆత్మజ్ఞానము కలవాఁడని గ్రహింపవలయునా? అదియును కుదరదు. విష్ణుదేవుని యంశమున జన్మించిన పరశురాముఁడు శ్రీరామునిచేత పరాజితుఁడై దత్తాత్రేయునివలన, తత్త్వోపదేశమును పొంది శాంతినొందెనని త్రిపురారహస్యమున వర్ణింపఁబడినది. శ్రీరాముఁ డావిధముగా తత్త్వోపదేశమును ఎవరి వలనను పొందినట్లు వాల్మీకి చెప్పలేదు. బ్రహ్మదేవుఁడుకూడ పూర్వవృత్తాంతములను ప్రస్తావించెనే కాని రామునకు తత్త్వమును ఉపదేశింపలేదు. కాని రావణవధానంతరము మండోదరి విలపించునప్పుడు శ్రీరామునిగూర్చి, ఈయన మహాయోగియైన ఆదినారాయణుఁడనుట స్పష్టము" అని పలికినది. ఆమె శ్రీరాముని చరిత్రమును భావించుచు ఏవో కొన్ని విశేషములను గుర్తించి వానిని బట్టి మహాయోగియైన యాదినారాయణుఁడే శ్రీరాముఁడుగా అవతరించె నని తలఁచె నన్నమాట. అపక్షమున శ్రీరాముఁడు జన్మసిద్ధముగనే ఆత్మజ్ఞానము కలిగియుండెనని చెప్పవలసియుండును. కావున మనము కూడ మండోదరివలె శ్రీరాముని చరిత్రమును పరిశీలించి ఆయన యందు మహాయోగిత్వము ఎట్లు సిద్ధమైయున్నచో గ్రహింపవలె, ఇందులకు మహాయోగియొక్క లక్షణములను తెలిసికొని అవి ఆయన చరిత్రమున ఎట్లు సమన్వయించుచున్నవో తెలిసికొనుట ఆవశ్యకము.

శ్రీ కృష్ణభగవానుఁడు యోగియొక్క జ్ఞానియొక్క లక్షణ ములను ఇట్లు చెప్పెను "సంకల్పమును త్యజింపనివాఁడెవఁడును యోగి కానేరఁడు." "ఎవనియొక్క సకల కార్యములు కామ సంకల్ప వర్జితములో, జ్ఞానాగ్నిచేత ఎవనికర్మము లన్నియు దగ్ధములైనవో, అట్టివానిని పండితునిగా బుధులు పేర్కొనుచున్నారు".

శ్లో॥ న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన।

భగవద్గీత–అధ్యా-6, శ్లో॥ 2

శ్లో॥ యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః।
జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం త మాహుః పండితం బుధాః॥

భగవద్గీత-అధ్యా-4, శ్లో॥. 19

దీనినిబట్టి ఏ విషయమునందైనను "ఇది కావలయు"నను కోరికగాని కోరికకొఱకు ఏ కార్యము నైనను సంకల్పించుట గాని లేకుండుటయే మహాయోగికి ముఖ్యలక్షణ మని స్పష్టమగుచున్నది. విద్యారణ్యస్వామివారు కూడ తైత్తిరీయారణ్యకభాష్యమునందు ఇట్లే యోగియొక్క లక్షణమును నిరూపించునట్టి యొక శ్లోకమును ఉదాహరించిరి. జ్ఞానామృతముచేత తృప్తి నొందినవాఁడు కృతకృత్యుఁడును అయిన యోగికి కొంచెము కూడ కర్తవ్యము ఉండదు; అట్లున్నచో అతఁడు తత్త్వవేత్తకాఁడు"

శ్లో॥ జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః।
నైవాస్తి కించిత్కర్తవ్య మస్తిచేత్ న స తత్త్వవిత్॥

మఱి జ్ఞానము కలిగినంతనే శరీరము పడిపోదు; ప్రారబ్ధము ఉన్నంత వఱకు జ్ఞానికి కూడ శరీరము ఉండును; శరీరము

ఉన్నప్పుడు వ్యవహారము కూడ ఉండును. సంకల్పమే లేకున్నచో జ్ఞానికి వ్యవహారము ఎట్లు జరుగును? ఈవిషయము "తృప్తి దీపము" అను గ్రంథమునందు ఇట్లున్నదని శ్రీ విద్యారణ్యస్వామి వారు ఉదహరించినారు. జ్ఞాని ఇట్లు తలంచును. "నేను కర్తను గాను, నాకు కర్మఫలము అంటుకొనదు. కావున ప్రారబ్ధము ఎట్లున్నచో ఆవిధముగా లౌకికమైన వ్యవహారముగాని శాస్త్రీయమైన వ్యవహారము గాని మఱి యేదైనను జరుగనిమ్ము. లేదా నేను కృతకృత్యుడ నగుటవలన నాకు కావలసినది ఏదియును లేకున్నను లోకమును అనుగ్రహింపవలయును అను కామ్యముతో శాస్త్రవిహితమైన మార్గముననే వర్తింతును. దానివలన నాకు కొఱంత ఏమున్నది?"

శ్లో॥ వ్యవహారో లౌకికో వా శాస్త్రీయో అన్య థాపి వా।

................................................................

శ్లో॥ మమాకర్తు రలేపస్య యథారబ్ధం ప్రవర్తతామ్।
అథ వా కృతకృత్యోఽపి లోకానుగ్రహకామ్యయా॥

శ్లో॥ శాస్త్రీయేణైవ మార్గేణ వర్తేఽహం కా మమక్షతిః।
తైత్తిరీయారణ్యక భాష్యపీఠిక పుట. 466

కావున జ్ఞానులకు కర్తవ్యము ఉండదు. అందువలన కొందఱు సన్న్యసించి పరివ్రాజకు లగుదురు. మఱికొందఱు సన్న్యాసాశ్రమధర్మములను కూడ వదలి దిగంబరులై అవధూత లగుదురు. కొందఱు తమ కేమియు అక్కఱలేకున్నను లోకసంగ్రహముకొఱకు తాము ధర్మమార్గమున వర్తించుచు లోకమునుకూడ ఆమార్గమున నడిపింతురు. ఈ దృక్పథమునే శ్రీ కృష్ణభగవానుఁడు ఇట్లు వివరించినాఁడు. "శ్రేష్ఠుఁడు ఏయే కర్మను చేయు

చుండునో ఇతరులుకూడ ఆయాకర్మలను ఆచరించుచుందురు. అతఁడు ఏది ప్రమాణమునుగా ఏర్పఱచునో లోకము దానినే అనుసరించును. "కావున శ్రేష్ఠులైనవారు తమకు అక్కఱ యున్నను లేకున్నను కేవలము లోకమునకు మార్గమును చూపుట కొఱకైనను, సమాజములో నున్నంతవఱకు ఇతరులతోపాటు తాము సుఖములను దుఃఖములను పొందుచున్నట్లుండి సంపత్తు నందు విపత్తునందు ధర్మముచే ఎట్లు అవలంబింపవలయునో తాము ఆచరించుచు తక్కినవారికి మార్గమును చూపవలె. శ్రీకృష్ణ భగవానుఁడు తన విషయమునే దృష్టాంతముగా చూపుమని అర్జుననకుచెప్పుచున్నాఁడు "అర్జునా! మూఁడులోకములయందును కొంచెము కూడ నాకు కర్తవ్యము లేదు; ఇంతవఱకు పొందనిది ఇఁకముందు పొందవలసినదియు లేదు. అయినను నేను కర్మను ఆచరించుచునే యున్నాను."

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥

శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన।
నా నవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి॥
భగవద్గీత-అధ్యా-3. శ్లో. 21,22

ప్రయోజనమును ఉద్దేశింపకుండ మందబుద్ధి కలవాఁడు కూడ ఏ పనికిని పూనుకొనఁడు. మఱి జ్ఞానులకు ప్రయోజనము కర్తవ్యము సంకల్పము లేకున్నచో ఏది నిమిత్తముగా వారు లోకమున వర్తింతురు? ధర్మాధర్మములే వారి ప్రవృత్తికి కారణములు. శాస్త్రము ఏది తమకు ధర్మమని విధించుచున్నదో దాని ననుసరించి వర్తించుచు, ఏది అధర్మము అని శాస్త్రముచేత నిరూ

పింపఁబడుచున్నదో దానినుండి తాము విరమించుచు ఇతరులను కూడ విరమింపఁజేయుదురు. సాధారణ మానవులకు వలె రాగ ద్వేషములు వారి వర్తనములకు హేతువులుకావు. ఈ దృష్టితో పరిశీలించినచో శ్రీరామునియందు కామసంకల్పములుగాని రాగ ద్వేషములు గాని ఆయన వర్తనమునకు కారణములు కావని ఆయన స్థితప్రజ్ఞుడైన మహాయోగి యని స్పష్టమగును.

విశ్వామిత్రునకు శిష్యుఁ డగుట శ్రీరాముని జీవితములో ప్రముఖమైన ప్రథమ సంఘటనము. ఆ శిష్యత్వమును రాముఁడు కోరలేదు. విశ్వామిత్రుఁడే యజ్ఞరక్షణము కొఱకు శ్రీరాముని శిష్యునిగా తీసికొనిపోయెను. విశ్వామిత్రునియొద్దనున్న యస్త్ర సంపదనుకూడ రాముఁడు కోరలేదు. రాక్షససంహారము కొఱకు దేవతలు ప్రోత్సహింపఁగా విశ్వామిత్రుఁడే శ్రీరామునకు తాను సంపాదించిన యస్త్రశక్తుల నన్నింటిని ఒసంగెను. రామునకు కీర్తిని పత్నిని ఘటించిన శివధనుర్భంగమును కూడ ఆయన సంక ల్పింపలేదు. జనకునిగూర్చి సీతనుగూర్చి శివధనుస్సునుగూర్చి రామునకేమియు తెలియదు. విశ్వామిత్రుఁడే రాముని మిథిలకు నడిపించుకొనిపోయి ఆ ధనుస్సును ఎక్కుపెట్టుమనెను. గురువు యొక్క ఆజ్ఞ ననుసరించి ఆయన ఆ ధనుస్సును ఎక్కుపెట్టి నారి సారించుచుండఁగా ప్రాఁతవిల్లగుటచే అది నడిమికి విఱిగెను. అంతేకాని తన పరాక్రమమును ప్రదర్శింపవలెనని ఆయన దానిని పట్టి విఱువ లేదు. ఈ ధనుర్భంగమువలననే పరశురాముఁడు శ్రీరాముని ధిక్కరించి ఓడిపోయెను. దీనివలన రామునకు మహా వీరత్వవిఖ్యాతి కలిగినది. కాని అది ఆయన కోరుటవలన సంభ వించినది కాదు. ఆ సన్నివేశమునకు పరశురాముని రోషమే కారణము.

పితృవాక్యపరిపాలకుఁ డని ఆయనకు శాశ్వతమైన కీర్తిని కలిగించిన సంఘటనము లేవియు ఆయన సంకల్పించినవికావు. రామునకు యౌవరాజ్యపట్టాభిషేకమును చేయవలయునని సంకల్పించినవాఁడు దశరథుఁడు. ఆయనకు దండకారణ్యవాసమును కలిగించినది కైకేయి. రావణ సంహారమునకు మూలము సీత. ఆమెనుగాని లక్ష్మణునిగాని తనకు తోడుగా తీసికొని పోవలయునని ఆయన అనుకొనలేదు, ఆయన వారిని ఎంతో వారించెను. ఎంత వారించినను వినక వారే ఆయన వెంట బయలుదేరిరి.

అడవులకు చేరినంతనే ఆయన ధర్మము ననుసరించి మహర్షులను దర్శించెను. అప్పుడు మహర్షులు రాక్షసులవలన తమకు కలుగుచున్న బాధలను చెప్పుకొని రక్షింపుమని కోరఁగా రాముఁడు క్షత్రియధర్మము ననుసరించి అట్లే కావింతు నని వారికి వాగ్దానమొనర్చెను. అగస్త్యమహర్షి యొక్క ఆదేశము ననుసరించి ఆయన జన్మస్థానముచెంత పంచవటి యందు ఆశ్రమము నేర్పఱచుకొని నివసింపఁజొచ్చెను. శూర్పణఖ రాముని యొద్దకు వచ్చుట కేవలము దైవికము. అట్లు జరుగునని వారిలో ఎవరును అనుకొనియుండ లేదు, శూర్పణఖా ప్రేరణమున ఖరాదుల సంహారము సీతాపహరణము జరిగెను. సుగ్రీవమైత్రి, వాలిని దండించుట, సేతుబంధనము మొదలుగా పట్టాభిషేకపర్యంతము సంఘటనము లన్నియు ఆయన సంకల్పముతో సంబంధము లేకయే జరిగినవి.

రాజ్యము కావలయు నను కాంక్ష ఆయనకు రవ్వంతయు లేదు. అందువలన ఆయన, భరతునకు ఏమాత్రమైనను రాజ్యకాంక్ష ఏర్పడి యున్నచో రాజ్యమును భరతునికే ఈయవలయు నను తలంపుతో లంక నుండి తిరిగివచ్చినప్పుడు భరతుని చిత్త

వృత్తిని పరిశీలించుటకై భరద్వాజాశ్రమమునుండి ఆంజనేయుని ముందుగా అయోధ్యకు పంపెను. భరతుని యభీష్టము ననుసరించియే ఆయన తుదకు రాజ్యమును అంగీకరింపవలసివచ్చెను. ధర్మరక్షణముకొఱకే ఆయన సీతను పరిత్యజించెనని ఇంతకు ముందే గ్రహించి యుంటిమి. అట్లే ఆయన సత్యవాక్య పరిపాలనమునకై వసిష్ఠాదిమహర్షులు కావించిన ధర్మనిర్ణయము ననుసరించి లక్ష్మణుని కూడ పరిత్యజింపవలసి వచ్చెను.

దైవికముగా సంఘటనములు వచ్చిపడుచున్నప్పుడు ఆయా సందర్భములలో ధర్మశాస్త్రము ననుసరించి ఎట్లు చేయవలయునో ఆయన అట్లే చేసినాఁడు. ఏ సందర్భమునందుకూడ ఆయన స్వతంత్రించి తన సుఖముకొఱకో కీర్తికొఱకో ఏకార్యమును చేయలేదు; కావుననే ఆయన వలన తమకు ఎంత వినాశము సంభవించినను మారీచుఁడు ఆయనను ధర్మస్వరూపుఁడని నిశ్చయింపఁగా మండోదరి మహాయోగి యని గుర్తించినది. ఆయన వేద వేదాంగ తత్త్వజ్ఞుఁడని నారదమహర్షి వాల్మీకితో చెప్పియుండుటను ముందే గమనించియుంటిమి. అంగములతో కూడ వేదములతత్త్వమును ఆయన గ్రహించెనన్నమాట. సకలవేదముల తాత్పర్యము బ్రహ్మజ్ఞానమే యనుట సుప్రసిద్ధము. అందువలన ఆయన బ్రహ్మజ్ఞుఁ డనుట నిశ్చితము. కావున తాత్కాలికములైన క్రోధశోకములచేత ఆయనకు సహజమైన రాజపుత్రత్వమునకు మహారాజపదవికి ఎట్లు భంగము కలుగలేదో అట్లే సహజమైన బ్రహ్మజ్ఞత్వమునకుకూడ భంగము కలుగలేదని గ్రహింపవలసియున్నది.

ఇంతటితో వాల్మీకి వృత్తాంతము ముగియుచున్నది. సకల వేదార్థమును మహాకావ్యరూపమున మానవలోకమునకు అందించి

ఆయన ప్రాతస్స్మరణీయుఁడైనాఁడు. దీనిని ఆదికావ్యమని ప్రశంసించుచు బ్రహ్మదేవుఁడు "కావ్యములందు యశస్సు పొందుటకు రాఘవుఁడు తప్ప మఱియొకఁడు అర్హుఁడు కాడు" అని చెప్పెను. (ఉత్తర. సర్గ. 98. శ్లోక. 18) అనఁగా ఉత్తముఁడైన కవి, తన కవిత్వశక్తి చరితార్థ మగునట్లుగా, తనకు, లోకమునకు ఉపకారము కలుగునట్లుగా కావ్యమును నిర్మింపవలయునన్నచో రాముని కథనే చెప్పవలయు నన్నమాట. కావుననే మనదేశమున కాళిదాసాది మహాకవు లందఱు ఏదోరూపమున రామచరిత్రమును కొద్దిగనో గొప్పగనో రచించియే యున్నారు. మానవజాతికి శ్రేయస్కరములైన సకల ధర్మములు రాముని చరిత్రయందు నిరూపింపఁబడి యుండుటయే ఈ మహత్త్వమునకు కారణము. ఈ విషయమును బాలరామాయణ ప్రస్తావమున సంక్షేపముగా గ్రహించి యుంటిమి. ఇంక శ్రీరామజననము మొదలైన ఘట్టములను క్రమముగా పరిశీలించుచు ఆమహత్త్వమును విపులముగా గ్రహింతము.

## గద్యము

నల చరిత్ర శ్రీమద్రామాయణాది మహాకావ్య
భువన విజయాది నాటక
శ్రీ భగవద్గీతాసారాది బాల ప్రియాఖ్య వ్యాఖ్యాదిక
బహు గ్రంథ రచన ప్రస్తుతి పాత్ర

ఆపస్తంబసూత్ర కౌండిన్యసగోత్ర పోలూరి వేంకటనరసాంబా నారాయణామాత్యపుత్ర హనుమజ్జానకీరామశర్మ ప్రణీత మైన శ్రీరామాయణ తరంగిణీయందు ప్రథమమైన వాల్మీకి తీర్థము సమాప్తము.

---

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 16 | 14 | అటను | అనుట |
| 20 | 22 | సందేము | సందేహము |
| 24 | 7 | లుక్షౌ | లూక్షౌ |
| 40 | 7 | వచానాత్ | వచనాత్ |
| 45 | 5 | గర్భని | గర్భుని |
| 54 | 4 | అభినందుంచుట | అభినందించుట |
| 74 | 10 | విలపించుతున్న | విలపించుచున్న |
| 75 | 16 | దశరథస్త్యైవ | దశరథస్యైవ |
| 77 | 8 | రూపముము | రూపమును |
| 79 | 17 | తాకు | తాను |
| 83 | 16 | శమునము | శమనము |
| 85 | 18 | తందేవాం | తందేవం |
| 86 | 5 | శసించిన | శపించిన |
| 87 | 6 | స్థితులన్నియొ | స్థితులన్నియు |
| 89 | 11(తర్వాత) | | 5. కుశలవ జననము |
| 94 | 25 | ప్రతిషితః | ప్రతిష్ఠితః |
| 99 | 7 | ఆహానించి | ఆహ్వానించి |
| 106 | 18 | మహితలే | మహీతలే |
| 108 | 11 | ఉత్తమాసము | ఉత్తమాసనము |
| 116 | 23 | సమానులలైన | సమానులైన |
| 118 | 7 | నిరనవమే | నిరసనమే |
| 145 | 23 | అయుష్య | ఆయుష్య |
| 147 | 11 | చుందురు. | చుందురు. కాని |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 147 | (చివర) | | ఆకాంక్షింతురు. కాళిదాసాదులకు గూడ ధర్మతత్త్వప్రబోధమున లక్ష్యమున్నను వారిశైలియందు ఆర్షమైన సరళత్వ ముండదు. కాళిదాసాదుల.......... |
| 151 | 17 | లోనికి | లోనికో |
| 154 | 5 | వాఖ్యా | వాఖ్యా |
| 174 | 3 | సాత్త్విలు | సాత్త్వికులు |
| 177 | 15 | ఆసత్యము | అసత్యము |
| 189 | 13 | పట్టము | ఘట్టము |
| 199 | 17 | శామం | కామం |